# కాలవాహిని

(నవల)

రచన:

చిట్టిబాబు

విజయసారథి పబ్లికేషన్స్,

విజయవాడ-2.

456

3 TPLB101B272

## అంకితం:

అనాదిగా తన సౌందర్యంతో—
సౌకుమార్యంతో - ప్రపంచ చరిత్రకే
ప్రశ్నగా నిల్చిన 'స్త్రీ' అంతర్యానికి,
అందానికీ—

—రచయిత.

# కాలవాహిని

ప్రభూ !

ఈ కాలవాహినికి ఆనకట్ట ఎక్కడ? ఎన్ని యుగాల నుంచి ప్రవహిస్తున్నది? అది ఏది? అంతమెక్కడ? ఆది మధ్యాంతాలమధ్య మానవుణ్ణి ఆటవస్తువులా చూసే నీ లీలలు ఎంత చిత్రమైనవి! విశ్వజగత్తును మోహింపజేసే, నీ మాయానాటకంలో ఎన్ని అంకాలున్నాయి - ఇంకా ఎంత కాలం యీ జీవితాన్ని కాలవాహినిలో ప్రవహింపజేస్తావ్?

మానవుల్నందర్నీ రకరకాలుగా సృష్టించావు. వాళ్ళ జీవితాలతో చదరంగ మాడుతున్నావు. ప్రాణం వున్న మనుష్యుల్ని పావుల్లాగా చూశావు. మానవజీవితాల్లో కలసి ఒరుసుకుని ప్రవహిస్తున్నావు.

ఐతే, లీల చేసిన అపచారం ఏమిటి? నిన్ను ఆరాధించింది, పూజించింది, ప్రేమించింది. హృదయాన్ని కడిగి పూలమాలగా గుచ్చి నీ మెడలో అలంకరించింది. నిన్ను తప్ప, ఈ జీవితంలో దేన్నీ వాంఛించలేదు? ఎందుకు నిర్దయగా లీల హృదయాన్ని బద్దలుకొట్టావు - పవిత్రప్రేమలో కాలకూట విషాన్ని ఒలికించడం వలన నీకు వచ్చిన లాభమేమిటి?

మదనమోహనుడవేనే - మరి నిన్ను ప్రేమించడం ఆరాధించడం అపచారమేనా?—ఇలా ఎన్ని యుగాలనించి ఎన్ని వేల హృదయాలు నీ పాదాలకింద నలిగిపోయాయి— పోతున్నాయి?

నిన్నగాక మొన్న కళ్యాణవేదికమధ్య-కుంకుమతో మెరిసిన లలాటాన్ని, నీ చేత్తో-బొట్టుతుడిచావు. నల్లగాజుల్ని ముక్క-ముక్కలుజేశావు - నీ ముందు యిలా పాలిపోయి పడివున్న యీ మనిషి - నిన్ను ఎవరూ ప్రేమించనంత గాఢంగా ప్రేమించటమేనా తప్పు.

ఐతే లీల ఈ పసికందుని ఎక్కడ దాచుకుంటుంది?- ఈ పాపని ప్రసాదించడంలో నీ ఆంతర్యమేమిటి? క్షణంలో నవ్వించి, క్షణంలోని సగంలో ఏడ్పించే నీ ఆగాధ హృదయాన్ని అర్ధంచేసుకునేదెన్నడు?—

లీల అనేఈ పేరు "నీలీల" కాదుకదా?

ఈ చీకట వేదికలో వెలుగు-నవ్వుల్లో మృదుత్వం - పువ్వులో రంగు - ప్రేమలో తీపి - తరంగాల్లో నురుగు— జీవితంలో చీకటి? ఎంత అద్భుతంగా సృజించావు-ఈ చిత్రమైన ఏవన వాటికని?

చావు, బ్రతుకు—!
చీకటి, వెన్నెల
సుఖమూ, దుఃఖమూ—
ఇవన్నీ నీవు ఆడుకునే ఆటలా?
అసలు—

ఈ విశాలవేదికని ఎన్ని ఏళ్ళు కష్టపడి నిర్మించావు? 'నటించబడే ఈ బ్రతుకులో నటనా?

జీవిత సంధ్యాసుందరి, తల్లికనుపు చించుకుని బైట పడకముందే ప్రతిప్రాణినీ ఎందుకు కావలించుకుంటుంది?

తల్లి రొమ్ముల్లో తడి ఆరకముందే, ఎందుకు బిడ్డని తన్నుకెళ్తావు - నిన్న కౌగిలిలో వెచ్చగా కాలిన పెదవులు యివ్వాళ బిగుసుకుపోతున్నాయి - నిన్న పాడిన వీణ శృతులు యిప్పుడు తెగి వ్రేలాడుతున్నాయి - నీవూ అద్భుతమైన నటుడవేనా?

నీవు వున్నావని నిరూపించడంకోసమేనా యిన్ని పనులుచేయడం?_అందుకోసమే నీవూ నటిస్తున్నావ్? ఐతే మానవులకన్నా మోసంలో అధికుడివి? అన్యాయాలు చేయడంలో తప్ప!

ప్రపంచం తలుపులు తెర్చావు. మానవుణ్ణీ, దీన్ని విడిచి యిలా వాడుకోమన్నావు. ఈ యింటికి కొన్ని నగిషీలు చెక్కావు. రంగులు వేసి అలంకరించావు?

గలగలపారే కృష్ణ, మెలికలు తిరిగిన జీలానది, అజంతా శిల్పాలు, కాశ్మీర్ పూలు, పారసీక సుందరీమణులు ముగ్ధమోహన ప్రకృతి, మంచుముత్యాలు, పాలవెన్నెల, కాటుక చీకటి

ఇవన్నీ చేయడానికి ఎన్నియుగాలు పట్టింది?—

*　　　*　　　*

ఈ విశ్వలోకంలో 'విశ్వం' ఒక వ్యక్తి.

ఈ లోకం అతనికి అర్థంకాలేదు. లీల జీవితం సంఘ చక్రాలక్రింద బలయింది

పసిపిల్ల ఏడిస్తే పగిలే హృదయం, పూల శబ్దానికి పులకరించే మనసు, తరంగాన్ని చూసి నృత్యం చేయాలనే తలంపు, మదనమోహనుడిముందు మైమర్చే తనవు!

ఇలాంటి లీల జీవితం ఎందుకు గంగపాలయింది?

విశ్వం ఎంతసేపు ఏడ్చాడో అర్థంకాలేదు.

లీల నల్లనయ్య పటంముందుబడి ఏడుస్తోంది. విశ్వం కళ్లు నీళ్ళతో మసకలు వేసినయ్. మంచంమీద పడుకున్నా నిద్రరావడం లేదు. రేపణ్ణించీ ఏంచేయాలి? ఇప్పుడు లీలకి ఏదారి చూడాలి? పతనమైన మానవహృదయాన్ని లోకం ఎంతవరకు అర్థంచేసుకోగలదు?

మానవుడు ప్రేమమయుడు. కాని మానవుల్ని ప్రేమించలేని మానసిక బలహీనుడు. సంఘం, నిజాన్ని అడ్డంపెట్టుకుని తప్పుడుపనులు చేసే, ఒక విచిత్రమైన మానవుల కలయిక. నిజంకాదా? అంటే నిజమనే విశ్వం సమాధానం చెప్తాడు

అతనికి ఎప్పుడు నిద్రపట్టిందో? తెల్లటి ఎండకిరణాలు పరదాల సందుల్లోంచి దూసుకొచ్చేవరకూ మెలుకువ రాలేదు. కన్ను నులుముకున్నాడు. పసిపిల్ల ఏడుపు వినిపిస్తోంది. నదీతరంగాల్లో, నిశ్చలంగా పారే ప్రశాంత ప్రభాతంలో, అలల పడుపులాంటి కఠోరమైన ఏడుపు. బద్ధకం వదిలిపోయింది. ఒక్కవూపులో తలుపులు తెరుచుకున్నాయి.

మదనమోహనుడి పాదాలదగ్గర పసిపిల్ల ఏడుపు. దీపారాధనలేని దివ్యమంగళవిగ్రహం. చిందరవందరైన పూజాసామాగ్రి. ఎండిన ఆకులు. లీల లేదు. ఎక్కడికి వెళ్ళింది, ఈ పసిపిల్లని, యింటిని వదిలి? ఏమయ్యింది లీల. దీపారాధనలేకుండా విగ్రహాన్ని చూడ్డం యిదే మొదటి సారి. ఏమిటిది? ఏమయింది లీల? ఎక్కడికివెళ్ళింది? 'లీలా, లీలా' యిలా ఎన్నోసార్లు అరిచాడు. గోడల ప్రతిధ్వని, పిల్ల ఏడుపు. అంతకితప్ప యింకేం లేదు.

లేదు – ఇక లీలలేదు. అదృశ్యమయింది. ఇంతకాలం వరకూ భరిస్తున్న ఈ జీవితబంధనాన్ని ఒదులుకుని, పిల్లని విశ్వానికొదిలి విశ్వం ఏడ్చాడు. ఇరవైయేళ్ళరాని విశ్వం, ప్రపంచాన్ని అర్థంచేసుకోలేని విశ్వం ఏడ్చాడు.

మదనమోహన విగ్రహం నవ్వింది.

అవును. నవ్వక ఏంచేస్తుంది. ఇంతకన్నా చేయ గల్గిందేమిటి? మానవుణ్ణి ఏడ్పించటం దేవుడికి నవ్వులాట. 'తనదాకా వస్తేగాని తెలియదన్న పచ్చినిజం'

నాఅన్నవారెవ్వరూ లేరు. వున్నదంతా తిన్నారు. లీల భర్త ముకుందం మరణంతో జీవితం చీకటయింది. అగాధమైన కాలవాహిని గట్టుకు నెట్టింది. భర్త మరణంతో లీల హృదయాన్ని సంఘం బద్దలుకొట్టింది.

ఆఖరి యాత్రలో చివరిమజిలీ ఈ జీవితం మానవుడు పుడుతున్నాడు, కొన్ని సంవత్సరాలు కొన్ని నిముషాల్లా గడిచిపోతూ సుఖాలు, దుఃఖాలు బాదరబందీ.

వసంత సమీరాల్లో అప్పుడప్పుడూ విషవాయువులు–

పచ్చని జీవితంలో వెచ్చని నిప్పులు – జీవితం ఆశాపాశం. అది యెంతపొడుగో, ఎవరికీ తెలీదు. ఎవరికయినా కనిపిస్తుంది, చేతికి అందని ఆకాశంలాగా.

ఆరాత్రి చుక్కలు దండల్లాగా వున్నాయి వెన్నెల విరగబడే వృత్తో సన్నగా కురిసే మంచుపూల వానలాగా– మలయమారుతం ప్రియురాలు వలపులా ముసిరిపిస్తో.

పదిగంటలయింది విశ్వ పసిపిల్లని భుజానవేసుకున్నాడు. ఏడ్చి ఏడ్చి అలసి నిద్రపోయిందపాప – బెజవాడ స్టేషన్‌లో రద్దీ – ఎక్కడికీ ప్రయాణం? కాలవాహిని ఎటు ప్రవహిస్తే అటు టిక్కెట్టులేదు. జేబులో అయిదురూపాయల చిల్లర!

గర్జిస్తూ లేటుగా వచ్చిన హౌరా మెయిలు! జనం తొక్కిడి ఎక్కువయ్యింది. విశ్వం చోటుచేసుకుని ఎక్కి కూచున్నాడు. పాప ఏడుస్తూవుంటే, విశ్వం ఓదార్చాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. రక్తస్పర్శగలవాళ్ళ లాగా ఆప్యాయత చూపించగల పదిహేనేళ్ళ పాప రెండుజడలు వేసుకొనివుంది.

విశ్వం పాలిపోయిన ముఖంలో మెరుపు, కళ్ళల్లో కాంతి, ఎర్రటి ఒళ్ళు, చిందరవందరైన నొక్కులజుట్టు, ఆ పాపకి సానుభూతిని, లేదా చిత్రమైన ప్రేమను కల్గజేశాయి.

చేతులు జాచింది. పసిపిల్ల ఒక్కవూపులో సాపచేతుల్లోకి దూకింది. విశ్వందిగి కాఫీ తెచ్చాడు. పిల్లకి పట్టించాడు. బుజ్జికడుపు నిండింది, వెచ్చగా పాప ఒళ్లో నిద్దరోయింది. విశ్వం కళ్ళతో కృతజ్ఞతలు తెలుపుతున్నాడు. ఐనా

కళ్ళల్లోంచి కారిన కన్నీరు అతని మానసిక వేదనని వ్యక్తం చేస్తూనే వున్నది.

ఈ అందాల పాపపేరు వసంత. సూటుకేసు, గోల్డు చైన్, రిస్టువాచీ, మొఖమల్ జాజెట్, కాశ్మీర్ సిల్కులంగా, మెళ్ళో.రాళ్ల నెక్లస్, కుడిచేతికి ఆరు బంగారు గాజులు. దీన్నిబట్టి వసంత కలవాళ్ళపిల్లని నిష్కర్షగా చెప్పొచ్చు.

వసంతే ముందు పలకరించింది పాపని గుండెలకు హత్తుకుంటూ, "మీరు ఎందాకా వెళుతున్నారు. ఎవరీ పాప?"

విశ్వం సమాధాన మిచ్చాడు. మురికిచొక్కాని ముద్దచేస్తున్న కన్నీళ్ళు - "ఇక్కడికి అని యిదమిద్ధంగా చెప్పలేను. ఎక్కడికో ఒకచోటకి—"

ఈ విశాలావనిలో నాకు నా అన్నవారెవ్వరూ లేరు, నేనూ, నా అక్కా తప్ప. మా అక్కని ఈ లోకం తీవ్రంగా ద్వేషించింది. సున్నితమైన హృదయంలో ఘోర ఆఘాతాల్ని తాకించింది. ఐనా కాకుల్లాంటి లోకులమధ్య, మెలిగాం, బ్రతికాం. మా అక్కయ్య జీవితం కాలవాహినిలో కొట్టుకుపోతుందని నేనెన్నడూ అనుకోలేదు. ఒక రాత్రి ఈ పసిపిల్లని నా కొదిలి ఎక్కడికిపోయిందో నాకు తెలీదు."

*　　　*　　　*

వసంత కళ్ళు ఆర్ద్రమైనాయి—

విశ్వం కథ చెప్పడం మొదలెట్టాడు—

"మా నాన్న లారీడ్రైవర్. అన్నదమ్ముల్లో పంచుకున్నది అయిదెకరాలు. దానినమ్మి లారీ కొన్నాం. కొంత

కాలంవరకూ అంటే నా పదోపట వరకూ మా జీవితం హాయిగా సాగిపోయింది.

మా అమ్మ అదోకరకం మనిషి. నిజం చెప్పాలంటే గర్విష్టిది. మానాన్నని చేసుకోవడం ఆవిడకి సుతరామూ ఇష్టంలేదు. అయినా ఋణానుబంధాన్ని ఎవరు తీర్చగలరు? మా అమ్మకి – నాన్నకి పెళ్ళయింది—

స్వతహాగా చాలా అందమైంది. మా నాన్న పెద్ద అందగాడు కాకపోవచ్చు. కానీ ఆయనకి ఆత్మసంస్కారం ఎంతఎక్కువో చెప్పడానికి వీల్లేదు. మానవులలో యింత విశాలహృదయం వుండేవాళ్ళు అరుదుగావొచ్చు. మాఅమ్మకీ నాన్నకీ సరిపడేదికాదు. కడుపున పుట్టిన వాళ్ళమయినా, మమ్మల్ని హీనంగా చూసేది. మానాన్న ఎంతో సరిపెట్టు కుంటూ వచ్చాడు– కానీ మాఅమ్మ ప్రేమకి మేము నోచుకో లేదు

ఒకరాత్రి చాలా చీకటిగావుంది– జడిపిస్తో చల్లగాలి వీస్తోంది నాన్న లైనుకెళ్ళారు – లారీ, మంచిస్పీడులో – తారురోడ్డుమీద సన్నగా జారిపోతోంది. గంటకి యాభై మైళ్ళ స్పీడులో పోయేలారీ ఫ్రంట్ టైరు బద్దలయ్యి – చెట్టుగుద్దుకున్నది. దాని తర్వాత ఏం జరుగుతుందో మీకు తెలిసే వుంటుంది. నాన్న చావుబతుకుల్లో– నెత్తురుముడు గుల్లో కొట్టుకుంటూ, దీనంగా చచ్చిపోయ్యాడు—

మా నాన్న చావుకబురు రాకముందే, ఆ రాత్రేమా అమ్మ కన్పించలేదు. బహుశా లేచిపోయి వుండవొచ్చు. మాకు ఈలోకం చీకటయింది. అక్కాయికి అప్పటికి పన్నెం

డేళ్లు. మాకు బ్రతికే ఆశలేదు. ఎలా బ్రతకాలి అన్నదో సమస్య. చచ్చిపోదామనుకుని, ఇద్దరం ఒకరాత్రి దిగుడు బావిదాకా వెళ్ళాం. చచ్చిపోయిన నాన్న అంతరాత్మని తల్చుకుని వెక్కి వెక్కి ఏడ్చాం—కానీ, మా ఏడుపుకి సమాధానం యిచ్చేవాళ్ళు లేరు. కళ్ళుమూసుకుని దూకుదామనుకున్నాం. కానీ, దూకేధైర్యం లేకపోయింది. ప్రాణభయం మమ్మల్ని నిలవదీసింది.

చచ్చిపోవడమంటే ఏమిటి - అని ప్రశ్నించాను. చనిపోవడమనే పదం తెలుసుగానీ, చావడమంటే యింతే అని యిదమిద్ధంగా తెలియని చిన్నతనమది. మా అక్కయ్య నన్ను కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ చీకటిరాత్రి, చీకటిలో తుమ్మచెట్లమీదనుంచివచ్చే గాలికూడా ఏడ్చింది దానితర్వాత, మా యింటిప్రక్క వాళ్ళు మమ్మల్ని ఒక నెల దాకా ఆదరించారు. ఇంటిని అద్దెకుయిచ్చి, వచ్చేడబ్బుతో పూరివాళ్ళ సహకారంతో బ్రతకమన్నారు—కానీ సహకరించేవాళ్ళకన్నా, కాకుల్లాగా పొడుచుకుతినేవాళ్ళే ఎక్కువయ్యారు.

ఈ పరిస్థితుల్లో మా జీవితాల్లోచిత్రంగా కాలుపెట్టిన వాడు. ముకుందం కాలేజీలో చదువుకోడానికొచ్చాడు. మా ఇంట్లో ముందుగదిలో అద్దెకుదిగాడు. వెనక గదిలో మా అక్కయ్యా నేనూ దుర్భరమైన దారిద్ర్యంతో కొట్టుకుని చచ్చిపోతూ వుండేవాళ్ళం—

ముకుందం చాలా తెలివిగలవాడు. మా పరిస్థితుల్ని

అర్థంచేసుకున్నాడు. మా అక్కయ్య చాలా అందంగా వుండేది. అక్కయ్యంటే, ముకుందానికి ఒకవిధమైన ఆకర్షణ ఏర్పడింది.

మా అక్కయ్యలోకూడా కొన్నిచిత్రమైన మార్పులు కలగడం మొదలెట్టాయి. ముకుందం బూట్లచప్పుడు విన్పిస్తే చాలు, ముఖం కందిపోవడం, మాటల్ని ఆప్యాయంగా వినడం యిత్యాదులు దానికాకారణాలు. ఐతే, అక్కయ్య నాకన్నా పెద్దది. నన్ను ప్రేమించేది, లాలించేది. అమ్మ, నాన్న దైవం అన్నీ అక్కయ్యే.అలాంటి అక్కయ్యముందు మాట్లాడాలంటే చాలా బాధగా వుండేది- బాధకంటే భయం అంటే బావుంటుందేమో?

నాకు పదమూడోఏట అక్కయ్య పెద్దమనిషయింది. ఇంతవరకూ మేం అనుభవించిన జీవితం ఒక ఎత్తూ, ఇక అనుభవించబోయే జీవితం ఒక ఎత్తూ అని అనిపించిందప్పుడు——"

రైలు బిట్రగుంటలో ఆగింది. పాప ఓసారి లేచి కొంచం ఏడ్చి మళ్ళీ పడుకున్నది– టికెట్ కలక్టర్ చెకింగ్ కొచ్చాడు. విశ్వం తనకి టిక్కెట్టు లేదని వున్నది వున్నట్టు చెప్పాడు. టికెట్ కలెక్టర్ ముఖం అదోలాపెట్టి చూశాడు. బహుశా యిలాంటివాళ్ళని ఎంతోమందిని చూసివుండొచ్చు.

వసంతి బేగ్ తీసి పదిరూపాయలకాయితం అతనికిచ్చింది. టి. సి. ఆశ్చర్యపోయ్యాడు. ఐనా ఏ భావాన్నీ వ్యక్తంచెయ్యలేదు. వసంతవంక కృతజ్ఞతాపూర్వకంగా చూసి - సిగ్గుతో తలవంచుకున్నాడు విశ్వం.

అప్రయత్నంగా, విశ్వంకళ్ళల్లోకి సూటిగా చూసింది వసంత. ఆ చూపులో ఏదో యింద్రజాలంవుంది - ఆడదాని ముందు తలవంచిన మగవాడి అంతర్యాం వుంది.

విశ్వం తర్వాతకథ చెప్పడం మొదలెట్టాడు-

ఇంజన్ గుయ్... గుయ్... మని బయల్దేరింది-విశ్వం నిట్టూర్పు ఇంజన్ నిట్టూర్పులో కలసిపోయింది-తర్వాత...

"ముకుందం - మాయింట్లో ఏర్పరచుకున్న స్థానం చాలా చిత్రమైంది. అతనూ మాయింట్లో ఒక పాత్ర వహిం చాడు. మాయింట్లో మేం ముగ్గురం వ్యక్తుల మైపోయ్యాము.

మా అక్కయ్య ముకుందంతో చాలా చనువు తీసు కున్నది. వీళ్ళిద్దరి సంబంధంతో-లోకులు కాకులైకూశారు. ప్రతివాళ్ళల్లోనూ మా అక్కయ్యపేరే నానడం మొద లెట్టింది. అమ్మలాంటి బుద్ధులే కూతురు కొచ్చినయ్యన్నారు. ప్రపంచం మమ్మల్ని హీనంగా చూడ్డం మొదలెట్టింది. ధనం లేనివాళ్ళు, లోకంలో ప్రేమించుకోడానికూడా అర్హులు కారు-అనే శాసనంవుంది.

ఈ మాట ఆనోట ఆనోటా, ముకుందం తలిదండ్రుల చెవిదాకా సోకింది. వాళ్ళనాన్న చండశాసనుడిలాగా, ప్రళయ రుద్రుడిలాగా వచ్చాడు. కొడుకుని, నానా తిట్లూ తిట్టాడు. పెద్దమనుష్యుల్ని పిల్చి పంచాయితీ చేయించాడు.

లోకం మా అక్కయ్యని ఎన్నిమాటలందో - చెప్ప శక్యంకాదు. మర్యాదస్థులుగా కనిపించేవాళ్ళలో, యింత షండాలం వుంటుందని మే మెన్నడూ వూహించలేదు.

ముకుందం తెగించాడు - తలిదండ్రుల్లో తెగింపు

చేసుకున్నాడు. తర్వాత కొద్ది రోజులకే, మాఅక్కయ్యకీ ముకుందానికి పెళ్ళయ్యింది దండల్తో. పెళ్ళికి ఎవరో అయిదారుగురొచ్చారు- మేమంటే సానుభూతివున్నవాళ్ళు.

ఆయేడే ముకుందం బి. ఎ. ప్యాసై, అయిదార్నెల్లు ఉద్యోగం లేకుండా తిరిగాడు. మా బాధల్ని వినేవాళ్లెవరూ లేకుండా పొయ్యారు. తర్వాత నేను పేపర్లమ్మి రోజుకు ఒకరూపాయిపావలా దాకా సంపాయించడం మొదలెట్టాను. ఏపూట కాపూట గడవడం మొదలెట్టింది. దాం తర్వాత బాధలు ఒక కొలిక్కొచ్చిన మాట నిజం!

ఈ పరిస్థితుల్లోనే, ముకుందానికి చిన్న పేపర్లో ఉద్యోగం దొరికింది. ఆ తర్వాత మా జీవితం ఫరవాలే దనిపించింది. కొద్ది కొద్దిగా నిలదొక్కుకున్నాం. జీవితం గాడి తప్పిందనుకున్నది, కొద్దిగా గాడిన పడింది - కటిక చీకటిలో కొవ్వొత్తి కాంతిలాగా.

ఇలా కొద్దికాలం గడిచింది. మా అక్కయ్యకి గర్భిణీ వచ్చింది. దాంతర్వాత మా అక్కయ్యలో మంచి పసుందాతనం వచ్చింది -

మాటల్లో మెరుపు, కళ్ళల్లో కాంతి ఎత్తుగావున్న కడుపు, ముకుందం మాటల్ని వింటే, మైమర్చే శరీరం- మా అక్కయ్యని కొద్దికాలంలో మాతృమూర్తిని చేయబోతున్నాయి. అనుకున్న రోజులు ఆసన్నమైనాయి. ఒక రాత్రి తొమ్మిది గంటలకి మా అక్కయ్య ఒక పాపని కన్నది. ఆ పాపే లీలక్క కూతురూ; మీ ఒళ్లోవున్న పాప!

ఈపాప తండ్రి గండాన పుట్టింది. ఒకరాత్రి, అంటే పాప తొమ్మిదోరోజున పండుకున్న మా ముకుందంబావ, మరి నిద్రనించి లేవనేలేదు. మా అక్కయ్య హృదయం బద్ద లయ్యింది. పచ్చని మొఖాన ఎఱ్ఱటిబొట్టు చెరిగిపోయింది. గాజులుబద్దలై చేతుల్ని గీసుకున్నాయి- మా జీవితం నలిగి నాశనమయింది. మా అక్కాయికి మతి స్థిమితం తప్పింది - ఉన్మాదినిలా వాగడం మొదలెట్టింది.

మళ్ళీనాకు బాధలు తప్పనేలేదు. ఇంతచిన్నవయస్సు లోనే, జీవితాన్నిగురించిఅర్థంచేసుకున్నాను. చదువు ఎస్. ఎస్.ఎల్. సి. లోనే ఆగిపోయ్యింది. మళ్ళీ పాతజీవితం మొద లయింది.

మా అక్కయ్య పిచ్చి రానురానూ ఎక్కువయ్యింది. పిల్లని తీవ్రంగా ద్వేషించడం మొదలెట్టింది. ఒకరాత్రి, జీవి తాన్ని, ప్రపంచాన్ని గురించి తీవ్రంగా విమర్శించింది. పిచ్చి పిచ్చిగా వాగడం మొదలెట్టింది పిల్లనీ, నన్నూ నానా తిట్లూ తిట్టింది. మావల్లనే జీవితం నాశనమయిందంది. దుర్భరమైన పరిస్థితుల్లో - ఒకరాత్రి 'లీల' నాకు యీ పిల్లనొదిలి ఎక్క డికో పోయింది. ఏం చేసుకోను ఈ పిల్లని?——నాకు ప్రపం చం చీకటయింది. ఏం చెయ్యాలో తోచలేదు. ఒకరాత్రి ఈపాపని తీసుకుని రైలెక్కాను. అదృష్టవశాత్తూ మీరు కన్పించారు. నా బాధని హృదయపూర్వకంగా అర్థంచేసు కున్నారు. నాకు ఏం చెయ్యాలో అర్థంకావడంలేదు-ఇలా వచ్చేశాను——" విశ్వం కళ్ళు ఆర్ద్రమైనాయి. ముఖాన్ని చేతుల్లో దాచుకున్నాడు.

వసంత విశ్వంముఖాన్ని చేతో పైకెత్తింది. జుట్టును వెనక్కి తోసింది. కళ్ళ నీళ్ళని చేత్తో తుడిచింది. విశ్వం వసంత భుజంమీద, తల ఆన్చుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు. వసంత ఆప్యాయతతో విశ్వంనచుంచుట్టూ చేతులు వేసింది.

ఇది యిలా ఎందుకు జరిగింది? వసంత ఎవరు?— విశ్వం ఎవరు?— ఇంత అనుబంధం ఎందుకు కుదిరింది?— దీనికి సమాధానాలు చెప్పడం కష్టం. జీవితమొక చిత్రమైన అనుబంధం. ఈ కాలవాహినిలో మానవులు ఎక్కడ, ఎందుకు, ఎప్పుడు, ఎలా పరిచయమౌతారు?—అంటే చెప్పడం చాలా కష్టం.

ఈ జీవన వాహిని యుగయుగాల్నించీ ప్రవహిస్తూనే వుంది. మానవులు ఈ జీవితాన్ని చీకటైనా వెలుగులా ప్రేమిస్తున్నారు. కాలం మానవుణ్ణి, తనకి లోబర్చుకుంటూనే వుంది. సుఖదుఃఖాల కతీతమైన జీవితం ఏదీ అంటే - దాని కెవ్వరూ సమాధానం చెప్పలేరు.

జీవితం చిత్రమైన అనుబంధం. కలువ కన్నులూ, సంపంగి ముక్కూ, సన్నజాజి కంటిరెప్పలూ, కాంక్షతో అల్లాడే మనస్సూ, రెపరెపలాడే యవ్వనపు మిసిమిగల వసంత, అందమైన విశ్వాన్ని కావిలించుకుని మైమర్చిపోయింది. ఇదే ప్రేమమయ జీవితం - ఇదే తీపి అనుబంధం.

జీవితం రకరకాల మనుష్యులికి, రకరకాలుగా కన్పిస్తుంది. క్షణికజీవితంలో, సుఖాన్నిమరిగిన మనిషి, ఇదే జీవితం, ఇదే ఆనందం అనుకుంటాడు- జీవితం రోజా పూల పాన్పులా భ్రమిస్తాడు- ప్రేమిస్తాడు. ఎదురుదెబ్బలు తగిలితే,

త్వరలోనే మానిపోతాయిగాని, హృదయానికి ఎదురుదెబ్బ తగిల్తే, ఒకోసారి జీవితాంతం వరకూ మానిపోవు.

విశ్వం వసంతభుజంమీద తల ఆన్చుకునే వెక్కి-వెక్కి ఏడ్చాడు. అలా ఎంతసేపు ఏడ్చాడో, అర్థంకాలేదు. వసంత ఆప్యాయంగా వీపుమీద నిముర్తోంది.

తూర్పు రేఖలు వెల్తుర్ని కావిలించుకుంటున్నాయి. తెల్లమబ్బులు ఆకాశంమీద అల్లుకుంటున్నాయి ఉషోదయం పూగులాడుతోంది. తెల్లమబ్బుల్లోంచి ఎఱ్ఱకిరణాలు వేళ్ళాడ్తూన్నాయి.

పాపాయి నిద్రలోంచి ఏడుస్తూ లేచింది. మద్రాసు సెంట్రల్ స్టేషనులో నెమ్మదిగా జరుగుతూ, ఆగబోతోంది రైలు. పాపాయిని తన చిన్న రొమ్ములకి అదుముకున్నది వసంత పాపాయి ఆనందంతో కళ్లుమూసింది. బోసినోరు తెర్చి నవ్వింది. బుగ్గల్ని చేతుల్తో గోముగా నిమిరింది.

పిల్లల్ని ఆడించే నేర్పు ఒక్క ఆడదానికే తెలుసు. తనవెచ్చని వక్షంలో పిల్లల్ని హత్తుకుని, మృదువైన లేత పెదాల్తో ఓర్పుగా లాలించి జోలపాడేఅత్యద్భుతమైన కళని విధాత ఆడదానికి పారబోశాడు.

పసిపాప వసంతనే లీలగా భావిస్తున్న దేమో?—వసంత ఒక్క ముక్క-కూడా మాటాడ లేదు. ప్రతిమాటలోనూ, ప్రతి చూపులోనూ అర్థంస్ఫురించే భావాలున్నాయి. వసంత స్వతహాగా చాలా తక్కువగా మాటాడే మనిషి. కాని, హృదయం విశాలమైంది.మానవుల్ని యింతబాగా ప్రేమించేవాళ్లు లోకంలో అరుదుగా వుండొచ్చు.

"అయితే మీరు ఎందాక అనే భావం లేకుండానే, యిందాకా వచ్చారు. మీరూ నేనూ కల్సుకోవడం బహుశా అనుబంధం కావొచ్చు. ఈ సామాజిక పరిస్థితుల్లో— మానవుల అంతరాంతరాల్ని కనుగొనటం తేలికయిన విషయం కాదని నాకు తెలుసు. మీరు మా యింటికి రండి- ఇంత చిన్నపిల్ల యిలా అడుగుతుందేమిటా అని మీరు బాధ పడక్కర్లేదు- లేదా ఆశ్చర్యపో నక్కర్లేదు—" వసంత చెప్పుకుపోతూనే వున్నది.

"మీరు ఒంటరిగా, ఎక్కడైనా బ్రతెగ్గలరు. కానీ లోకం అంటే తెలియని ఈ పసిగందు విషయం ఏమిటి?— నన్ను అడక్కపోయింది, బహుశా కన్నతల్లిలా భ్రమసి వుండవొచ్చు. అలా కాదు అనడానికి కారణాలు మీరు వివరం చేయలేరని నాకు తెల్సు మీరు మీ పాపని ఆదరించవచ్చు- ప్రేమించవచ్చు. అంతమాత్రాన మాతృమూర్తిలా అన్ని బాధ్యతలూ తీర్చగలరనే నమ్మకం నాక్కలగటం లేదు. ఎందుచాతనంటే, మీకు పదహారేళ్ళకన్నా ఎక్కువ లేవు. జీవితాన్ని చూసింది మీరు ఒక్కకోణంలోనే. కానీ జీవితాన్ని చూడ్డానికి చాలా కోణాలుంటాయని- ఒక్కో కోణం ఒక్కో జీవితపు బాటని, మీరు తెల్సుకోవాలంటే, కనీసం యింకా పదిసంవత్సరాలన్నా పడ్తుంది"

విశ్వం-వసంత చెప్పిన మాటలన్నీ దీక్షగా విన్నాను. మాటలమధ్యలో చూపులుకలుసుకోవడం ప్రారంభించాయి. ఒక తీయని నిషా యిద్దర్నీ ఆవరించింది. ఇలాంటిపిషాలు ఆవరించుకోకపోతే, తీయని అనుబంధాలు మిగలకపోవచ్చు

ఇలా చాలాసేపు స్టేషన్లో కూర్చున్నారు. పాపకి పాలుబట్టడంలో ఇద్దరూ మరింత సన్నిహితులయ్యారు. ఇంతలో ఫియట్ కార్లోంచి ఒక అందమైన అమ్మాయీ, ఒక నడికారులో వున్న కారుడ్రైవరూ దిగొచ్చారు.

విశ్వాన్ని, చేతులోవున్న పాపనీ చూసి ఆశ్చర్య పోయారు. విశ్వం ముఖంలోవున్న కళనిచూసి కొత్తగా డ్రైవర్‌తో పాటువచ్చిన అమ్మాయి చలించిపోయింది.

వసంతే విశ్వానికి వాళ్ళనీ, వాళ్ళని విశ్వానికీ పరిచయంచేసింది. క్రొత్తగావచ్చిన ఈ రంగుల సీతాకోక చిలుక పేరు "మదన"—వసంత పెద్దమ్మగారమ్మాయి. కాలేజీలో చదువుతూంది హైద్రాబాద్‌లో. మాటలో అహంకారం, నడకలో ఠీవి కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయి.

వసంత విశ్వం చెయ్యిపట్టుకుని "రండి" అన్నది.

వసంత మారుమాట్లాడలేదు-'రండి'అన్న పదంతప్ప. విశ్వం అంతకన్నా మారు మాట్లాడలేదు. మదన గుఱ్ఱంలా కవాత్‌తొక్కుతూ నడుస్తోంది.

వసంత వెనకేపోయి ప్రక్కనే కార్లో కూచోబడ్డాడు విశ్వం. బర్‌మని స్టార్టయింది కారు. వసంత, విశ్వంచెయ్యి ఆప్యాయంగా నిమిరింది. దాన్లో 'భయపడకు, బాధ్యతనాది ధైర్యంగావుండు' అనే హెచ్చరిక కన్పించసాగింది.

మానవుల్లో దానవులంటే, ఎక్కడ?—అని వెతక నక్కర్లేదు. దానవులు-మానవులు మనలోనే వున్నారు. మాంసపేయులైన మనుష్యులు తరుచూ మన కక్కనిపిస్తూనే

వుంటారు. వీరి జీవితాలు లోయల్లా అగాధాలు. అయినా వెన్నలా సున్నితాలు పూలలో మృదుత్వం, పసిపాప నవ్వు లోని సుతిమెత్తన వీళ్ల హృదయాల్లో వున్నాయి.

వసంతచూపుల్లో ఆర్ద్రితకి— విశ్వం హృదయంలో ఒక ఆశ దీపంలా వెలిగింది. జీవితంలో జయించగలను, నిలబడ గలను అనే నమ్మకం కుదిరింది. తనకి 'వసంత' అనే అవలం బన లేకపోతే, తాను ఏనాడో నేలరాలిపోయేవాడు. ఇంత తక్కువ పరిచయంలోనే, యింత పెద్దవూహ రావడం నిజంగా ఆశ్చర్యకరమైన విషయం. ఈ వూహకి తనలో తాను నవ్వు కున్నాడు విశ్వం.

దేశకాల పరిస్థితుల్ని సమన్వయం చేసుకోవడమంటే, యిదో విధం కాబోలు—అన్న భావం విశ్వం హృదయంలో మెదలసాగింది. కారు పోయిపోయి ఒకపెద్ద కాంపౌండ్‌లో ఆగింది.

దీన్నిబట్టి మనం వూహించుకోగల్గింది ఏమిటంటే, విశ్వం హృదయంద్వారా వసంత అనే దేవతచాటున తాను ఛాయగా బ్రతగ్గలడు. వీళ్లది ధనాగారం. ఇక్కడ తనలాంటి నిర్భాగ్యులు చాలామంది బ్రతుకుతున్నారు.

ఐతే ఒకటి— తనని వసంత హృదయపూర్వకంగా ప్రేమిస్తుంది. లేదా గౌరవిస్తుంది.

ఇక్కడ తనకో ప్రత్యేకస్థానం లభించవచ్చు. లేదా కడుపు నింపుకునే అనామకుడిగానన్నా పరిగణించవచ్చు. వసంత హృదయం విశాలమైంది. దానికిసాక్షి తనహృదయం.

ఇంతకన్నా లోకానికి తాను చెప్పుకోగలిగినంత సంజాయిషీ యింకేమీ లేదు.

వసంత తండ్రికి దాదాపు యాభైఏళ్లు వుండొచ్చు. మంచి హుందాఅయిన విగ్రహం. కోరమీసాలు, చేతికి రత్నాలవుంగరాలు. కళ్ళల్లో నిండుతనం దీన్నిబట్టి— సంస్కారం మిగిలిన మనిషిలా భావించవచ్చు.

ఆయనకి కొడుకుల్లేరు. ఉన్నదల్లా ఒక్కవసంతే; పెద్ద కాంట్రాక్టరు. లక్షల్ని గడించాడు. అంతులేని బీదతనం లోంచి పైకొచ్చాడు. అదృష్టదేవత వరించింది. కష్టాల్లోంచి సుఖాల్లోకి వచ్చిపడ్డాడు.

భార్య వసంతని కని, వసంత పసినాటే, కన్నబిడ్డని కళ్ళ చూడకుండానే మరణించింది. ఆవిడ ఆక్రోశమల్లా వసంతని పూలల్లోపెట్టి పెంచమనీ – ఆమె అభీష్టానికి అడ్డం చెప్పవద్దనీ—

తండ్రి వసంతని పూలల్లోపెట్టి పెంచాడు.

ఒక తెల్లవారుజామున వసంతతల్లి యీలోకంలోంచి ఏదో ఎవరూచూడని లోకాని కెగిరిపోయింది. వసంత తండ్రి ఎంత ఏడ్చాడో చెప్పడానికివీల్లేదు వసంతని ఆమె యిష్టప్రకారమే పెంచాడు. తర్వాత ఇరుగుపొరుగులూ, చుట్టపక్కాలు ఘోషించినా ఆయన పెళ్ళిప్రయత్నం తలపెట్టలేదు.

ఇలా పదేళ్ళపాటు వసంతని పెంచుకొచ్చాడు వసంత వయస్సుతోపాటు ఆయనధనం కూడా పెరుగుతూవచ్చింది. ఈ విశాల ధనాగారానికి అధికారిణి వసంత మాత్రమే. తండ్రి ఒక్క సంపాదనాపరుడు నాయకుడైన యజమాని.

కూతురు అభీష్టానికి ఆయన ఎన్నడూ ఎదురుచెప్ప లేదు. కూతురుకోసం ఈనాటి వరకూ ఏంచెయ్యాలో అన్నీ చేశాడు. ఆవిడ మునిమనుమలదాకా కూడా తినదగినంత సంపాయించాడు.

విశ్వాన్ని చూస్తే ఆయన గతజీవితం రీలులా తిరిగింది.

## 2

ప్రపంచంలో ఎన్నోరకాల మనుష్యులున్నారు. కొందరికి ఈ జీవితం రోజా పూలపాన్పులాగానూ, కొంద రికి ముళ్ళకంచెలానూ కన్పిస్తున్నది. జీవితం యింత ఆశా దీపమా? అన్పిస్తుందికూడా. మానవ జీవనసౌందర్యం, "జనాల" నే ఎడారుల్లో పూలుపూయిస్తుంది. సుఖాన్ని దుఃఖంలా, అందని ద్రాక్షలా భ్రమించేవారూ, దుఃఖాన్ని కూడా సుఖంలా మోహించి ప్రేమించేవారూ రకరకాలైన వాళ్ళు. నయాగరా జలపాతంలో తీయని సంగీతం-సుందర లోకంలో తీయని వేణుగానం- నిద్రలో తీయని మత్తుకలలు- భార్య పిలుపులో ప్రియురాలి వలపులాంటి తీయనిరాగం - కొందరికి ఈ లోకమంతా తీపి పిలుపు!

"అన్నీవున్నా అనుభవించ నేరని దౌర్భాగ్యంలో వున్న దేశకాల పరిస్థితులు" ఎక్కడో విన్నా. ఈమాట అక్ష రాలా నిజం. చాలా సత్యం దాగివున్న దనిపిస్తుంది. నిజం స్పుడూ వినకపోయినా ఎప్పుడో విన్నట్టుంటుంది.

ఇలాంటి జీవితమే ప్రసాదరావుది. ఒక్కొకర్ని చూసి ఎంత ప్రేమించాలనిపిస్తుందో - ఒక్కొకర్ని చూసి అంతా ద్వేషించాలనిపిస్తుందీ. కన్నతల్లికూడా ఒకో్కపిల్లమీద ఎందుకు ఏహ్యమో మనకర్థంకాదు. అది బహుశా తల్లి కూడా అర్థమైవుండదు. అయిదుగురి అన్నదమ్ముల్లో ప్రసాదరావు మధ్యవాడు. తండ్రి లక్షాధికారి.

న్యాయం నిప్పులాంటిదే గాకుండా, భయంకరమైంది కూడాను. నిష్కర్షగా నిజంచెప్పేవాళ్లులోకంలో శత్రువులు. ప్రసాదరావు లోకంలో వున్నతుల్లో ఒకడు. కానీ చెడ్డవాడుగా లోకం పరిగణించింది. ప్రపంచం యిలా ఎందుకు పరిగణించిందో ఎవరికీ అర్థంకాదు. కన్నతండ్రి అసహ్యించుకున్నాడు కాలేజీలో ఒక అమ్మాయిని అగౌరవ పరిచినందుకు. ఒకడి పక్క పళ్ళువూడదన్నిన కారణాన రౌడీజట్టుకు నాయకు డయ్యాడు కాలేజీలో. ఎక్స్కర్షన్‌లో విద్యార్థుల డబ్బు కాజేసిన లెక్చరర్‌కి ఎదురు తిరిగినందుకు, దుర్మార్గుడుగా గౌరవాన్ని నిలబెట్టింది విద్యార్థిబృందం.

కారణం లేకుండానే, అన్నదమ్ములు అసహ్యించుకునేవాళ్ళు. తల్లి అన్నంబెడ్తూ ముఖం ముటముటలాడించుకునేది. తండ్రి ఆజన్మశత్రువులా పరిగణించేవాడు. ఇలా 'జీవితం' ప్రసాదరావుకి చెడ్డవాడనే గౌరవం ప్రసాదించింది.

ప్రసాదరావు జీవితం నానాటికీ దుర్భరమవసాగింది. తప్పులుచేయకుండా నిందలు భరించసాగింది. జీవితమంటే విరక్తి కలగసాగింది. ప్రపంచంలో సంస్కారులుగా ఇప్పుడు పరిగణించబడేవాళ్లు ఒకానొకనాడు ఆరితేరిన రౌడీలు.

ఇలా దుర్భరజీవితం సాగుతున్న రోజుల్లోనే వీరేశలింగంగారి వితంతు వివాహాల ఉద్యమం ముమ్మరంగా సాగుతోంది. అది ఒక ప్రవాహం. ఈ ప్రవాహంలో ప్రసాదరావుకూడా కొట్టుకుపోయాడు. ప్రతినాటా, ప్రతినోటా ప్రసాదరావుపేరు మార్మోగిపోయింది. ఇతని ప్రతి పలుకూ, భావావేశంలా దొర్లిపోసాగింది ఈ ఆకర్షణ ప్రభావంలో ఈగలాగా కొట్టుకుపోసాగింది. 'సుభద్ర' అనే అమ్మాయి కులానికి సాలె. భర్త చిన్నప్పుడే అంటే, ప్రూహకందని పసి రెక్కల్లో వున్నప్పుడే రాలి నేలకూలిపోయాడు. అప్పట్నించీ ప్రసాదరావంటే ఒకవిధమైన ఆకర్షణకు లోనుకాసాగింది. ఎంత అపుకుందామనుకున్నా ఈ మనస్సు ఆగిచావదు. దీనికారణాలు స్పష్టంగా యివి అని చెప్పలేము.

ప్రసాదరావూ సుభద్రా ఒకచోట ఒకరోజున కలుసుకున్నారు. సుభద్రలో మంచి అందం వున్నది. ఈ అందానికి ప్రసాదరావు జోహార్లర్పించాడు. కులమత భేధాలు సమూలంగా నాశనం చెయ్యాలనే విషయంమీద యిద్దరూ ఎంతో తీవ్రంగా చర్చించారు. విప్లవనాయకుడు ప్రసాదరావు హృదయం ఉదాత్తమైంది.

పరిచయాలు పరిచయాలుగావుంటే "ప్రేమ" అనే పదం పుట్టడానికి వీల్లేదు. పరిచయంలో కళ్లూ కళ్ళూ కలుస్తాయి. మనసులూ మనసులూమూగా మాట్లాడుకుంటాయి. జడత్వంలోంచి మార్దవత్వం ఉద్భవించి "ప్రేమతత్వాన్ని" భాసిస్తుంది. ఇలా ఒకరాత్రి సుభద్రి కళ్ళల్లోకి ప్రసాదరావు చూశాడు. సుభద్ర సిగ్గుతో శేదా నుమకారంతో తలవంచింది. ప్రసాదరావు సుభద్రి భుజంమీద చేయివేశాడు

తియ్యని నిషా ఆవరించింది. ప్రపంచం కన్పించ లేదు ఇద్దరూ ఒకటై, ఏకమై వీణలో ప్రేమరాగమై అను రాగాన్ని ఆలాపించుకున్నారు.

సుభద్రా, ప్రసాదరావుల ప్రేమ పరాకాష్ఠ నందు కున్నది. ఈ సంఘటనతో ప్రసాదరావుకి ఇంట్లో వున్న గౌరవ ప్రపత్తులు పెఢేలుమని కూలిపోయినయ్. తండ్రి తనకడుపున చెడబుట్టావని ఢడామడా తిట్టిపోశాడు తల్లి మాట్లాడనే లేదు. అన్నలూ, వదిన్లూ, తన్నొక వింతజంతువుగా చూడ్డం మొద లెట్టారు తమ్ముళ్ళని మాటాడొద్దని కట్టుదిట్టం చేశాడు తండ్రి.

అలాగే కొన్నిరోజులవరకూ సరిపెట్టుకుంటూ వచ్చాడు. కానీ విధి తనకు ఎదురుతిరిగింది. తండ్రి ఒకరోజున సుభద్ర యింటికి నిప్పుపెట్టమని రౌడీలను పంపించాడు. ప్రసాదరావుకి ఈ విషయం తెలిసింది. ఆ రాత్రికి రాత్రే సుభద్రని అక్కణ్ణించి తప్పించి, మద్రాస్ తీసుకొచ్చి రిజిష్టర్ మేరేజ్ చేసుకున్నాడు. కొడుకుఆనందం సహించలేని తండ్రి వుండేకన్నా లేకపోతేనే మంచి దనిపించిం దతనికి, అప్పట్లో.

మద్రాసొచ్చి కొన్నిరోజులు అష్టకష్టాలు పడ్డారు. దారీ తెన్నూ తెలియని చీకటిమార్గంలో పయనించాడు ప్రసాదరావు ఉద్యోగం సద్యోగంలేదు సుభద్ర నగ లమ్మితే పదిహేనొందలరూపాయ లొచ్చినయ్. ఈ పరిస్థితుల్లో 'జగన్' తో పరిచయమయింది.

జగన్ తండ్రికి ఒక్కడే కొడుకు. పెద్ద కంట్రాక్టరు. ప్రసాదరావుకి, జగన్ సిఫార్సుతో తండ్రిదగ్గర గుమాస్తా

ఉద్యోగం యిప్పించాడు. జీవితం ఒకదారిన బడ్డది—నిజాయి తీగా పనిచేశాడు. మానవత్వంగల మనిషిగా పరిగణించ బడ్డాడు. వేలకివేలు తన చేతిమీదుగా తిప్పాడు. ఒక్క నాడన్నా, ఒక్క మాటన్నా పడకుండా పనిచేశాడు. జగన్ తండ్రికి ప్రసాదరావంటే మంచి సదభిప్రాయం కుదిరింది. ఇంత సత్యసంధుణ్ణి యింతవర కెన్నడూచూసినపాపాన పోలే దాయన. ఇన్నేళ్ళనించి ఎంతోమందిని చూశాడు. జీవితంలో ఎన్నో ఒడుదుడుకుల్ని అనుభవించాడు. కానీ యింత నిజా యితీగల మనుష్యుల్ని ఎక్కడా చూసిఎరగడు. తన కొడు కన్నా ఇతను చాలారెట్లు గౌరవనీయుడుఅనిపించిం దతనికి.

జగన్‌కి జీవితంలో విలాసా లెక్కువైనాయి. అతని జీవితం నానాటికీ దిగజారసాగింది. ఒక ఆంగ్లోయిండియన్ లేడీ విలాసాల్లో మైమర్చిపోయాడు. ప్రపంచాన్ని, తనని ప్రాణప్రదంగా ప్రేమించే తండ్రిని ఆటవస్తువుగా చూడ్డం మొదలెట్టాడు.

ఇంతకాలంవరకూ బాగా బ్రతికిన సంసారం పతనా వస్థలో పాదంమోపింది. కొడుకు తప్పతాగి అర్ధరాత్రి ఇంటి కొచ్చేవాడు. ప్రతినోటా నానడం మొదలయింది. తండ్రికి ఆత్మశాంతి లోపించింది.

కొడుకోసం తన రక్తాన్నంతా ధారబోశాడు. ప్రతి క్షణమూ జీవితాన్ని జగన్‌కోసం వ్యర్థంచేశాడు. ప్రయో జకుడైన కొడుకునుకన్న తండ్రిగా గర్వించాడు. కాని ఇప్పుడు జరిగిందేమిటి? తాను కట్టుకున్న ఆశాసౌధం ఫెళుక్కున విరిగి కూలింది. ఈ లోకం చీకటయింది.

కొడుకుజీవితం యింత పతనావస్థలోకి దిగజారుతుం దని తండ్రి ఎన్నడూ వూహించలేదు. 'వెన్నెలనిభ్రమసి - చీకటిని ప్రేమించాడు'—తన పితృప్రేమతో కొడుకులో అనురాగద్వారాన్ని తెరిచాడు. కానీ యింత అన్యాయం జరుగుతుందని ఆయనెన్నడూ వూహించలేదు. 'న్యాయా నికి శిక్ష అన్యాయం జరగడమా?'

జగన్ ఒకరాత్రి తప్పతాగి యింటికొచ్చాడు. తండ్రిని డబ్బుయివ్వమన్నాడు. మత్తులో కళ్ళుబైర్లుకమ్ముకున్నాయి. ఏం మాట్లాడుతున్నాడో తెలియని మసకవెన్నెల్లాంటి మత్తు. డబ్బు - డబ్బు - డబ్బు!

తండ్రి ఒక్కమాటన్నా మాటాడలేదు. ఇదే సమ యంలో ప్రసాదరావు యిక్కడికొచ్చాడు. డబ్బుకోసం జగన్ గర్జిస్తున్నాడు. తండ్రి ఒక్కమాటైనా మాటాడలేదు. జగన్‌కి మెర్క్యురీలైట్ల కాంతిలో మత్తు ఎక్కువయింది. తాగిన నిషా క్షణ క్షణానికి ఎక్కువౌతోంది. అప్పటివరకూ ప్రసాదరావు దర్వాజాదగ్గరే నుంచున్నాడు. జగన్‌కి తండ్రి చేతికర్ర దొరికింది తండ్రికీ కొడుక్కీ పెనుగులాటప్రారంభ మైంది. ప్రసాదరావు తలుపులు తోసుకుని లోపలికొచ్చాడు. జగన్ ఎత్తినకర్ర తగిల్తే తండ్రితల దెబ్బకి ఫెడేల్‌మని పగిలి పోయేది.

మెరుపులాగా ప్రసాదరావు కర్రకి అడ్డంవచ్చాడు. ప్రసాదరావు నుదురు ఫెడీలుమని పగిలిపోయింది. తెల్లటి

గుడ్డల్నిండా ఎట్రునినెత్తురు కళుక్కుమనిపించింది. జగన్ నిషా సగంవరకూ దిగిపోయింది.

అయినా తండ్రినీ, ప్రసాదరావునీ ఎదిరిస్తూనే వున్నాడు. ప్రసాదరావు కోపం మిన్నుముట్టి పోయింది. 'కర్రదెంచ' మని ప్రసాదరావు గర్జించాడు. ప్రసాదరావులో యింత కోపాన్ని జగన్‌గానీ జగన్ తండ్రిగానీ, యింతకు ముందెన్నడూ చూసి ఎరగరు.

ప్రసాదరావు కోపంతో నిలువెల్లా గర్జించాడు. ఎడా పెడా చెంపలు పగిలిపోయేట్టు కొట్టాడుజగన్ను. ప్రసాదరావు ఛెళుకులతో జగన్ మత్తు దిగిపోయింది.

ప్రసాదరావు యిలా అన్నాడు:

"జగన్! మానవుడు పోశనమై పోవడానికి ఎన్నో రకాల కారణాలున్నాయి. అనాదిగా నాశనమౌతున్న మానవుల్ని మన మెందర్నో చూస్తున్నాం. కన్నతల్లిపోయి కళ్లు తెరిచి లోకం చూడలేని పసికూనని నిన్ను పెంచాడు. పెద్దచేశాడు. చదువు, సభ్యత, సంస్కారం అన్నీవున్నాయి. అన్నీ నేర్పాడు. కన్నతల్లికన్నా మిన్నగా పెంచాడు. తనలో వున్న ప్రతినెత్తురుబొట్టునూ నీరుగా మార్చాడు. ఇదేనా నీవు యిచ్చే ప్రతిఫలం? కన్న తండ్రికి నీవు యింతకన్నా యివ్వగలిగిన బహుమానం ఏమిటి! నీలోవున్న ప్రతి రక్త కణమూ, ఆయన పోగుచేసినవే. ఇదేనా నీవు కన్నతండ్రికి చేయగల్గిన న్యాయం?"

జగన్‌లో మృమత్వం మేల్కొన్నది. ప్రశ్చాత్తాపం మొగ్గలై తొడిగి పూలు పూసింది. జగన్ తండ్రి కాళ్ళ

మీాదపడి యేడ్చాడు. ప్రసాదరావు ముఖంలోంచి యింకా రక్తం కారుతూనేవుంది. జగన్ తండ్రి కన్నీళ్లు కారుస్తూ కొడుకును కావిలించుకున్నాడు. ఇద్దరూ అలా యెంతసే పున్నారో యెవరికీ తెలీదు. గంటలు నిమిషాల్లాగ డచిపోయి నాయి. కొడుకు కన్నీళ్ళు తుడుస్తూ, ఏడుస్తున్న కన్నతండ్రి! 'మమకారం'—యీ పదం యిందుకనేగా ప్రపంచంలో ఇంత కాలంవరకూ బ్రతికింది!

రాత్రి పన్నెండింటికి జగన్ ప్రసాదరావుకోసం వచ్చాడు, క్షమించమని అడగటానికి. అదే సమయంలో ప్రసాదరావూ దాన్నే కోరదామనుకుంటున్నాడు. జగన్ వచ్చి వాకిట్లో తచ్చాడుతున్నాడు. రక్తపుగుడ్డల్ని పార వేయడానికి సుభద్ర తలుపుతీసింది. నీడలోనుంచున్న జగన్ని సుభద్ర చూసింది. 'ఎవరూ?' అన్నది. 'నేను వదినా! దుర్మార్గుణ్ణి — జగన్ని' అన్నాడు జగన్.

ఈ మాటవిని ప్రసాదరావు లేచొచ్చాడు. జగన్ చేతిని ఆప్యాయంతో నిమిరాడు. జగన్కి కళ్ళవెంట నీళ్ళొ చ్చినాయి. సుభద్ర కళ్ళనీళ్లు తుడుచుకుంటోంది.

"చూశావా తమ్ముడూ, ఒదిన ఏడుస్తోంది! ఛీ తప్పు కదూ, ఏడవకు" అన్నాడు, జగన్ని ఉద్దేశించిప్రసాదరావు. 'ఈ మధురక్షణం, యింకోసారి జీవితంలో రాదు' అను కున్నది సుభద్ర. ప్రేమించుకోవాలంటే భార్యాభర్తలే కానక్కర లేదు; ఒక తల్లికడుపున పుట్టిన పిల్లలే కానక్కర లేదు. ప్రేమతో ప్రపంచ చరిత్రనే మార్చవచ్చు. కొత్త లోకాల్ని సృష్టించవచ్చు. ఈ ప్రేమ యెంత మధురమైందో,

అంత భయంకరమైంది. మానవజీవితంలో కొత్తఅనుభూతుల లోతుల్ని తరచి తరచి తెలిపించే ఒక విశ్వనూత్న కళాసృష్టి ప్రేమ.

ఈ సంఘటన మామూలుదానికన్నా నిత్య జీవితంలో జరిగే సంఘటనలకన్నా పెద్ద చిత్రమైందేమీ కాదు. అయినా దీనికి విలువున్నది. జీవమున్నది. ఈసారితో జగన్, ప్రసాదులు అతుక్కుపోయారు.

జగన్‌ని సుభద్ర మరిదికన్నా ఆప్యాయంగా ఆదరించింది. జగన్ వదినకన్నా బాగా ప్రేమించేవాడు. జీవితంలో కొన్ని సంఘటనలు చిత్రంగా, మెరుపుల్లాగా జరిగిపోతయ్. ఇలా యెందుకు జరిగినయ్యో అంటే యెవరూ చెప్పలేరు. దీనికి సమాధానం చెప్పలేని కొన్ని క్షణాలు కొన్ని పరిస్థితుల్లో ప్రతివాడి జీవితంలోను అడ్డుగోడల్లా నిలుస్తాయి.

కాలచక్రం ఆగకుండా తిరుగుతూనే వుంది. ఎన్నో చిత్రమైన మార్పుల్ని తెస్తూ, సుఖదుఃఖాల్ని చిరునవ్వుతో మిళితం చేసుకుంటూ తిరిగే, ఎవరూ ఆపలేని యీ కాలచక్రం! జగన్ తండ్రికి రక్తపుపోటు వచ్చింది. ప్రపంచాన్నే కొనగలిగిన చక్రవర్తుల్ని-వీరాధివీరుల శిరస్సుల్ని వేటుతో తెగవేయగల్గిన రారాజుల్ని-మృత్యువు నవ్వుతూ ఆహ్వానిస్తోనేవుంది. ఇంతఘనులకన్నా అతీతమైనవాడేమీ కాదుగా జగన్‌మోహన్ తండ్రి? మృత్యువు ఆయనకి రానురానూ దాపయ్యింది.

మృత్యువును యెవ్వరూ ఆపలేరు. ఆపటం యెవ్వరి శక్యమూ కాదు. ఒక ప్రశాంత ప్రభాతంలో జగన్ తండ్రి

అ స్తమించాడు. కానీ అంతకి క్రితం సాయంత్రం ప్లీడర్ దగ్గిరుండి రాయించిన విల్లులో జగన్‌కీ, ప్రసాద్‌కీ చెరి ఆరు లక్షలూ ఆస్తిపంపకం జరిగివుంది.

మానవుల్ని ఒకరు ఎంత గాఢంగా ప్రేమిస్తారు! ప్రేమకి ఆడా మగా తారతమ్యం లేదుగదా – అష్టకష్టాలు పడి, ఒక అంతస్థులో కొచ్చిన ప్రసాదు ఈనాటికి లక్షాధికారయ్యాడు.

పాపాల్ని భరించలేనివాళ్లు కొందరున్నారు. ఆ కోవలోనివారేగదా ప్రసాదరావు. జగన్ తండ్రి ఇలా ఎందుకు చేశాడు? తానెవ్వరు? తాను యెవ్వరికి సంబంధించినవాడు. అన్నదమ్ముల్నీ తల్లిదండ్రుల్ని అందర్ని వదులుకుని ఒక ఆత్మీయురాలికోసం, ఏమీ ఆలోచించుకోకుండా వచ్చేశాడు.

తను ఫస్తుల్తో చచ్చిపోయినా యిక్కడ అడిగే దిక్కులేదు. కానీ తనని విధాత యెందుకనో అన్యాయం చెయ్యలేదు. దానికి సాక్ష్యం తన హృదయం. తన హృదయాన్ని తాను ఎన్నడూ కించపరచుకోలేదు.

ఈ మద్రాసునగరం–కానీ యిక్కడున్న మత్తు, నిషా నానాటికీ ఎక్కువవుతూనే వుందిగాని దిగజారడం లేదు. మాయజేయడం, మనుషుల్ని మార్చడం యిక్కడ పుటకతోనే నేర్చుకున్నారేమో అనిపిస్తుంది. కాని యిక్కడా మహానుభావులున్నారు. జగన్ తండ్రి అంతగాక ఇంకెంత? తనని యెందుకు గౌరవించాడు? గౌరవాన్ని ప్రేమలోకి మార్చుకున్నాడు చల్లనిచూపు చూశాడు. ఆయన చల్లని

చూపు పరిభాషతో తాను యివ్వాళ లక్షలకు అధికారి అయ్యాడు.

తాను కష్టపడలేదు. కానీ ఆయన ఎన్ని సంవత్సరాల్నించీ ఎన్ని కానులు దాచి యీ లక్షలు చేశాడో? ఆయన సంపాదించింది తనకోసం దాచాడా? దాచి తనకి ధర్మం చేశాడు. ఈ అరులక్షల్ని అనుభవించే అధికారం తనకిలేదు. దీనివల్ల జగన్‌కి; తనకీ మధ్య పెద్ద అగాధం ఏర్పడొచ్చు. మనస్పర్థలు రాజి రగిలి పొగలు సెగలవచ్చు. భగవాన్! ఏమిటి_ నాకీ అగ్నిపరీక్ష?

తెల్లారి ఎనిమిది గంటలయింది. ఉదయం హాయిగా మత్తుగా జోగుతోంది. మంచు ముత్యాలు యింకా యిగిరిపోలేదు. తుమ్మెదలు గులాబీపూల్లో తొండాల్ని జొలిపి, మకరందాన్ని జుర్రేస్తున్నాయి. తలపు తలపులో, పిలుపు! పిలుపు పిలుపులో వలపు. కన్నెపిల్ల చిరునవ్వులా వున్న చల్లని గాలి మెల్లిగా వీస్తే——

ప్రసాదరావు కళ్ళు నులుముకొనిచూచాడు సుభద్ర వనదేవతలా వుంది. తల్లోంచి జారిపోయే పచ్చగన్నేరు పూవు. వెంట్రుకల కొనల్నించి జారిపడే నీటిచుక్కలు. సింధూర తిలకంతో సుందరంగా నిగనిగలాడ్తోన్న నొసట బొట్టు. సుభద్ర దగ్గరికొచ్చి నిలబడింది.

అదృష్టదేవతలా నిలబడ్డ సుభద్ర నడుంచుట్టూ చెయ్యివేసి. చిరునవ్వు నవ్వాడు ప్రసాదరావు. భర్త వెంట్రుకల్ని, విదులుస్తూ ఆనుకుని నిలబడ్డది సుభద్ర. ఒళ్ళోకూచొబెట్టుకుని, ముద్దు పెట్టుకున్నాడు. సుభద్ర

తన్మయంతో అరమోడ్పు కన్నులతో, పరవశించి పోసాగింది. 'ఊఁ, ఏమిటి? మరీ చిన్నపిల్లాడల్లే అంది

ఇంతలో బయట బూట్లశబ్దమయింది. సుభద్ర భర్త ఒళ్ళోంచి లేచి తలుపుతీసింది. ప్రసాదరావు లేచినుంచున్నాడు. జగన్ వచ్చాడు.

"దేవతలా వుంది మా సుభా ఒదిన" అన్నాడు.

జగన్ ముఖం పౌర్ణమి వెన్నెలలా, కృష్ణానది నీరులా నిశ్చలంగా, వుంది. ప్రసాదరావు దిగ్భ్రాంతి చెందాడు, తాను అనుకున్న దొకటి; ఇప్పుడు జరిగింది మరొకటి. జగన్‌కీ తనకీమధ్య పెద్ద అగాథం ఏర్పడుతుందని శంకించాడు. కాని, అలా జరగటానికి వీల్లేదు అన్నట్లు మధురహాసం - యిది యదార్థమా? నటనా? గాఢమైన 'సందిగ్ధత'.

జగన్ ప్రసాదరావుకి దగ్గరగావచ్చి కూర్చున్నాడు. 'అలావున్నావేం అన్నయ్యా' అన్నాడు ప్రసాదరావునుద్దేశించి. ప్రసాదరావు జగన్ భుజంమీద చెయ్యివేసి "ఏం లేదు తమ్ముడూ" అన్నాడు ఆ చిరునవ్వులో మంచి గాంభీర్యంవుంది.

సుభద్ర కాఫీ తెచ్చింది. 'ఏంఒదినా, కాఫీ తెచ్చావా మరిదికి' అన్నాడు. సుభద్ర బుగ్గలు సొట్టలుపడేలానవ్వింది. ప్రసాదూ గంభీరంగా నెమ్మదిగా నవ్వాడు. ప్రసాదూ జగన్ కాఫీ తాగుతున్నారు. ఇంతలోప్రసాదరావు నవ్వుతూ;

"చూడు జగన్. నన్ను నువ్వు అపార్థంచేసుకోవనుకుంటున్నాను. నేను నీ 'హక్కు'ను దుర్వినియోగంచేసుకున్నానేమో, అక్రమంగా హస్తగతం చేసుకున్నానేమో అని బాధపడుతున్నాను. న్యాయంగా, యిందులో నాదోషమేమీ

లేదు. ఒక్కనాడన్నా నేను యింతఅదృష్టానికి అధినేతనౌతా నని భావించలేదు_ అసలు నాకు ఆ తలంపే లేదు!

“ప్రపంచం ఒక నాటకరంగం. ఎక్కి-దిగే మనుష్యుల్తో ఎప్పుడూ నిండిప్రవహిస్తూ నేవుంది ఇదిజీవనవాహిని. ఈ వాహినిలో నేనూ చిన్న చేపపిల్లలా కొట్టుకొచ్చాను. అనాదరణగల ఈలోకంలో ఆదరం లభించింది. మానవత్వం గల మనిషిగా పరిగణించబడ్డాను. ఆగౌరవం నాకు ఎందుకు లభించిందో నాకే అర్థంకాలేదు. ఇవ్వాళ, నన్ను నీ సోదరుడుగా గౌరవించావు. ఇది నాఅదృష్టంగా భావిస్తున్నాను. నిన్ను నేనొకరాత్రి అనుకోని వుద్రేకంలో చేయిచేసుకున్నాను ఇవ్వాళ నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. క్షమాభిక్ష అర్థిస్తున్నాను. తర్వాత, నన్ను నీవు అర్థంచేసుకున్నావు. మన విలువైన స్నేహం, అమోఘమైన ప్రేమగా మారింది. ఇంతకన్నా నేను చేయగలిగింది, చెప్పగలిగింది యింకేమీ లేదు——”

జగన్ ప్రసాదరావు చేతులు పట్టుకున్నాడు. “అన్నయ్యా, గతజీవితంలో నేను ఎన్నో తప్పులు చేశాను. నన్ను, నా వంశాన్ని సమూలంగా అప్రతిష్టపాలుజేశాను. నా జ్ఞాననేత్రాన్ని తెరిపించావు - గౌరవాన్ని నిలబెట్టావు. దీనికి నేనెన్నడూ ఋణంతీర్చుకోలేను. మానాన్న చేసిందాట్లో తప్పేమీలేదు. ముందుచూపు చూశాడు. జీవితాన్ని సమంగా ప్రేమించగల సహృదయత్వం ఆయనలో పొంగిపొర్లింది. నిన్నూ, నన్నూ ఒకతల్లిబిడ్డల్లా ప్రేమించాడు. ఇలా చేసినందుకు నాకెంతో సంతోషంగా వుంది——”

ప్రసాదరావూ, సుభద్రా శిలావిగ్రహాల్లా నిలబడి వున్నారు.

"ఒదినా, నీకు చెల్లెల్ని తేవాలనివుంది" అన్నాడు. సుభద్ర నవ్వింది. 'అంతకన్నా ఏంకావాలిబాబూ' అన్నది.

ఇలా కొంతకాలం జరిగాక, జగన్ ఒకరాత్రి ఒక నూత్న వధువును వెంటబెట్టుకొచ్చాడు. 'సుమిత్ర' ఆ అమ్మాయిపేరు. 'ఎక్కడో దొరికింది యీ అదృష్టదీపం, వెంటతెచ్చానన్నయ్యా' అన్నాడు. ప్రసాద్ తమ్ముడిచెయ్యి పట్టుకుని– 'ప్రపంచంలో ఒక వున్నతుడిగా నిరూపించబడ్డావ్ తమ్ముడూ' అన్నాడు.

ఆరాత్రి సుభద్ర, చెల్లెలికి వాల్జడేసి, పూలుపెట్టి, బుగ్గ పుణికి, 'ఎక్కడిదమ్మా ఈ వజ్రం, మా వరాలమరిదికి దొరికింది' అన్నది. దానికి సుమిత్రనవ్వి 'వజ్రాన్ని సానబెట్ట గలిగిన సరసులు – మీ మరిదిని నమ్ముకు నొచ్చానమ్మా, అక్కయ్యా' అన్నది.

సుభద్ర సుమిత్ర బుగ్గల్ని ముద్దెట్టుకుని నవ్వింది. అక్కయ్యచేతుల్లో చెల్లెలు ముఖం దాచుకున్నది. పులకలెత్తే సిగ్గు!

ఇవి ఆనాటి కొన్ని మధురక్షణాలు.

ఇలా జీవితం హాయిగా సాగిపోయింది. అన్నదమ్ములు కాకపోయినా, అంతకన్నా మినుమిక్కిలిగా వాళ్ళు జీవితాన్ని కొనసాగించారు. ప్రసాద్‌మాట జగన్ ఎన్నడూ జవదాటి ఎరగడు.

లారీలుకొని వ్యాపారం చేశారు. మామిడితోటల్ని కాంట్రాక్ట్ చేశారు. సిరొత్తుకొచ్చింది. ఎంత ఇన్ కమ్ టాక్స్ కట్టేవాళ్ళో లెక్కలేకుండా పోయింది.

ప్రపంచ చరిత్రనే వూగులాడించే మహత్తరమైన సోదరప్రేమ. గణనీయమైన విశ్వ ధాత్రిలోన క్రాంతి-కాపురం ఇద్దరూ ఒకేమేడలో సాగించారు. సుమిత్రా, సుభద్రా, ఒకే అక్కచెల్లెళ్ళలాగా బ్రతుకు సాగించారు. కొంతకాలం తర్వాత, ప్రసాదరావు మేడ కట్టించుకుని ఈ మేడలో కొచ్చేశాడు. ఇందులో దురుద్దేశం లేదు. అది మాత్రం నిజం.

ఇలా కాలం జరిగిపోతూనేవుంది. సుభద్ర మాతృమూర్తి కాబోతోంది. ఇది అదృష్టకరమైనవార్త. ప్రసాదరావూ, జగన్, సుమిత్రా దాదాపూ పండుగ జేసుకున్నంత సంబరపడ్డారు నెలలు నిండుకొచ్చినయ్.

కాన్పు కష్టమైంది. కన్నతల్లి బ్రతుకుతుందనే ఆశ లేదు. ఎన్నో చేశారు. రక్తం వరదలయ్యింది. ధారలకొద్దీ నెత్తురు. పసిబిడ్డగొంతు గావురుమని వినిపించింది. ప్రసాదరావు, జగన్ ల ముఖాలు ఆనందంతో మిలమిల్లాడుతున్నాయి.

మాతృమూర్తి సుభద్ర కళ్ళు తెర్చి చూసింది. కాంతివిహీనమైన కళ్ళు. మృత్యుచ్ఛాయలు ముసురుకున్న ఒళ్ళు. మాట రావడం లేదు. పక్కలో పసిపాప. తల్లిబిడ్డని రొమ్ములకదుముకుంది. ముద్దుపెట్టుకోబోయింది. కళ్ళు కన్నీళ్ళు కారుస్తున్నాయి. బిడ్డను తనవైపుకుతిప్పుకోవాలనే తల్లి ప్రయత్నం. కాని రొమ్ముల్లో పాలు లేవు. తల్లి కన్నీళ్ళు ధారాపాతంగా

ప్రవహిస్తున్నాయి. సుమిత్ర దగ్గరుండి అక్కయ్య కన్నీళ్ళు తుడుస్తోంది. 'మీ బావగారు, మీ బావగారు' అన్నది సుమిత్రతో—

సుమిత్రి వెక్కి వెక్కి ఏడుస్తూ, 'బావగారూ, అక్కయ్య...' అన్నది. అని గావురుమని ఏడ్చింది. ప్రసాదరావు గుండెలు అవిసిపోయినయ్. జగన్ మొదటే కుప్పగా కూలిపోయాడు.

సుభద్ర ఎగశ్వాసతో రొప్పసాగింది. మంచాలు, యింజక్షన్లు, మంత్రిసానుల హడావుడి! భర్తనుచూసి అంత బాధలోనూ నవ్వి 'చివరిచూపు చూడండి' అన్నది. ప్రసాదరావు పసిపిల్లాడిలా వెక్కి వెక్కి ఏడ్చాడు. గుండె బద్దలయ్యింది. భార్య కన్నీళ్ళు తుడిచాడు. చివరిసారి భర్త వెంట్రుకల్ని నిమిరిందామె.

"చూడండి, కన్నతల్లిని కావాలనే నా తీయనికలలు, యివ్వాళతో ఫలించాయనుకున్నాను. నారొమ్ములో పాలని, దాని పసిపెదాలతో పెదాలల్లాడేట్టు తాగితే, మాతృమూర్తిగా గర్వాన్ని పొందాలని, ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. విధి ఎదురుతిరిగింది. కాలం నాకు బామ్మె కాటు వేసింది. నా కన్నబిడ్డకి గోరుముద్దలు తినిపించాలనీ, చందమామనుచూసి నవ్వుకోవాలనే ఆకాంక్షలు మరీచికల్లో మంచిపిళ్ళలా యిగిరిపోయినాయి. నాకు తెలుసు. నేను ఎక్కువసేపు బ్రతకను. మృత్యువు నాకు రాను రానూ దగ్గరవుతూంది."

సుభద్ర కళ్ళల్లో కన్నీళ్ళు కాలనల్లా ప్రవహించ సాగినయ్. ఆయాసంతో గొంతు బిగుసుకుపోయింది ముక్కుల్లోంచి మాట నెమ్మదిగా వస్తోంది. పెదాలసందుల్లోంచి నెత్తురుధార—'నా బిడ్డని ప్రేమతో—ప్రేమతో పెంచండి. యిదే నా చివరికోరిక'—రక్తపుధార ఆగిపోయింది. తెర్చుకున్నకళ్ళు మూతలుబడినయ్. మూసుకున్న కళ్ళల్లో రెండు అశ్రుకణాలు. పసిపిల్ల గావురుమని ఏడ్చింది. కానీ, తనని ఈ లోకంలో, ఒదిలిపోయిన కన్నతల్లి, ఈ లోకాన్ని ఒదిలిపోయిందని ఆ పసిపిల్ల కెలా తెలుస్తుంది? ఇంకెక్కడి సుభద్ర! మాతృమూర్తి కావాలనే కన్నతల్లి ఆశయం, కన్నకడుపు ముచ్చట్లు చూడకుండా కాలవాహినిలో కలిసిపోయింది.

యింకేముంది? సుభద్ర జీవన విహంగం రెపరెప మని కొట్టుకుని, ఎగిరిపోయింది. ప్రసాదరావు ఒక్క మాట తప్ప యింకేమీ అనలేకపోయాడు. 'అదే నాకన్యాయం జరిగింది—'

ఈలోకంలో బ్రతికినంతకాలమూ, ఏదినాదనుకుంటామో అది మన్ని మురిపించి మనదికాకుండా పోతుంది. తర్వాత, కొంతకాలంవరకూ ఈలోకం చీకటైపోతుంది. మతి స్థిమితం తప్పుతుంది. మనకళ్ళకి పసందుగా, "వ్యూహాగానం" లా కృష్ణశాస్త్రి పాటలా వున్నవన్నీ, వియోగరాగాలై మనల్ని అగాధలోకాల్లో చీకటికోణాల్ని చూపిస్తాయి.

ప్రసాదరావు ఎవరికోసం అన్నీ తెగతెంపులు చేసుకున్నాడో, ఆ "ఎవరు?" అనేవారు లేకుండా పోయారు. ప్రసాదరావు మనస్థిమితంలేని పిచ్చివాడిలా, విలవిలా తన్ను

కుని వచ్చాడు. కట్టుకున్న భార్యపోయింది. తమ దాంపత్యం ప్రతిఫలంగా, యీ లోకంలో చిన్నినలుసును వదిలి పోయింది. ఆబిడ్డే తన జీవితాధారం.

ఇరుగుపొరుగులు మళ్ళీ పెళ్ళిచేసుకోమని ప్రోత్స హించారు. ప్రసాదరావు నవ్వి "పగిలి ముక్కలైన గాజు పెంకుల్లాంటి హృదయం యింకఅతకదు" అనేవాడు.

సుభద్ర లేచివొచ్చిందే గావొచ్చు సంఘందృష్టిలో. బాహాటంగా పైకి అనకపోయినా, లోపల్లోపల చెడ్డదాని గానే పరిగణించవచ్చు. అయినంతమాత్రాన, మానవత్వం లేని మనిషిగా లెక్కగట్టడానికి వీల్లేదు. ఈలోకంలో, ఎవరికి ఎంతవరకు అనుబంధంవుందో, దాన్ని తీర్చుకోవాలని వస్తు న్నారు; అదితీరాక బంధాల్ని తెంచుకుని ఎక్కడికో పోతారు. ఈ బంధాలు యింకొన్ని సంబంధాలకి కారణ మవుతాయి—

సుమిత్రే ప్రసాదరావు చిన్ని నలుసును పెంచు తోంది. ఎక్కడెక్కడో పుట్టిన రామచిలుకలు—ఒక కొమ్మని చేరి గూళ్ళుకట్టుకుని, ఎంతో అన్యోన్యంతో బ్రతుకు తాయి. అలాగే సుభద్రా, జగన్, ప్రసాదరావుల బాంధ వ్యాలు యిలా బిగుసుకుపోయినయ్. ప్రసాదరావు కూతురు వసంత, సుమిత్ర కూతురయింది. ఆలనా, పాలనా, అన్నీ సుమిత్రే.

ఇలా పదిహేనేళ్ళు గడిచిపోయినయ్. ఒకరోజున అక స్మాత్తుగా ప్రసాదరావు పెద్దన్నొచ్చాడు. ఒకసారి తండ్రి, ఇంకోసారి యింకొకరు— నెమ్మది నెమ్మదిగా రాకపోకలు సాగాయి

గత జీవితం కళ్ళముందు కదిలింది. ఆయన నెరసిన మీసాల్లోంచి అస్పష్టమైన ఎగశ్వాస. నిరాశా పుటలపు స్మృతుల్లో ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు. పాతజీవితపు యవనిక తెగి, చిరిగిపోయింది. కళ్ళకు కనిపించనిది ఏదో కన్పించిందనే విశ్వాసం ఆ నిశ్వాసంలో వుంది.

తర్వాత, ఎందరో ఈ యింట్లో సన్నిహితుల్లా మెలిగారు. మెరమెచ్చుల్లా, భద్రరాజుల్లా పొగిడి నిలదొక్కుకున్నారు. ప్రసాదరావు వీళ్ళనిచూసి, నవ్వుకున్నాడు. ప్రపంచంలో, ఎన్నిరకాల చిత్రమైన మనుషులున్నారో; అన్నిరకాలవాళ్ళతోనూ పరిచయం ఏర్పడింది.

తను అదృష్టద్వీపానికి అధిపతి అయ్యాడు. ధనలక్ష్మి తనయింట్లో నివాసమేర్పరచుకున్నది. అన్నలూ తమ్ములూ, ఎవరైతే తనగాలి సోకితే, పతితులమై పోతామని బిగుసుకుపోయారో, వాళ్ళే పూసుకుతిరగడం మొదలెట్టారు.

ప్రసాదరావు ఒక్కనాడన్నా తనకి తానుగా బైటపడి ఎరుగడు. మనుష్యుల్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. కొన్ని నేర్చుకున్నాడు. "నేర్చుకున్నా నేర్చుకోవాల్సింది చాలావుంది" అనేదికూడా నేర్చుకున్నాడు—

కాల విహంగాన్ని కళ్లుమూసుకుని ఎక్కాడు. చిట్టడవుల్లో దింపినా, బంగారుద్వీపాల్లో దింపినా. కాని తనని బంగారుద్వీపాల్లోనే దింపింది కాలం.

ఇన్నివున్నా తనకి మనశ్శాంతి లోపించింది. సుభద్ర లేనిలోటు లోటుగానే వుంది. సుమిత్ర ప్రేమతోనే పెంచవచ్చు. ఎంతపెంచినా కన్నతల్లి పెంపెందుకవుతుంది? -

మాతృమూర్తి అంతర్యాంకన్నా విలువైంది లోకంలో ఇంకా ఏమున్నది?

ఆ పాపే వసంత—

ప్రసాదరావు కన్నీళ్లు తుడుచుకున్నాడు.

## 3

విశ్వాన్ని చూడగానే ప్రసాదరావుఅంతరాంతరాల్లో ఏదో మానవత్వం ప్రశ్నించింది. తానూ యిలా ఒకానొక నాడు ఇల్లొదిలి పారిపోయి వచ్చాడు. తాను ప్రపంచాన్ని ఎదిరించి "తన" అనే మమకారబంధనాల్ని పెటాపెటలు చేసుకుని యిక్కడికొచ్చి వాలాడు. కాని యితను ప్రపంచానికి జంకి పారిపోయివచ్చాడు. ఇద్దరూ పరిస్థితులకు వారసులే. కానీ యిద్దరిలో ఎంత వ్యత్యాసం!—

ప్రసాదరావుకి వసంత విశ్వాన్ని పరిచయంచేసింది. విశ్వం నమ్రతతో సమాధానమిచ్చాడు. నమస్కారం చేశాడు ప్రసాదరావుకి, విశ్వాన్నిచూస్తే అంతరాంతరాల్లో ఏదోఅవాజ్యమైన అనురాగంపుద్భవించింది. ఏదోఒక ప్రేమ—

విశ్వంలోచూచిన అందానికి, ప్రసాదరావు చలించిపోయాడు. నమ్రతకే కరిగిపోయాడు. వసంత విశాల హృదయానికి ఆయన అంతరాంతరాల్లో ప్రేమవాహిని వెల్లువలయ్యింది. తనకూతురు ప్రయోజకురాలు. ఇంతకన్నా పొంగిపోవల్సిందేముంది?—

మదనమీద మదనుడు విరిపూవులు వేస్తున్నాడు. గుండెల్లోకా ప్రేమ గూడుకట్టుకుంది. పంజరంలో చిలుక లాగా ప్రేమతో గిలగిలా కొట్టుకోసాగింది. విశ్వాన్ని అంత రాంతరాల్లో ప్రేమించసాగింది. ఈ ప్రేమ క్షణికమయ్యింది. ఒక్కసారి విశ్వాన్ని కావిలించుకుంటే! వసంత తెచ్చుకున్న ఈ పూలహారాన్ని తాను మెళ్ళోవేసుకుంటే! ఛీ, తనకి పెడదారుల్లో వూహ పరిగెత్తుతుందేమో? అయితే ఏం?— వసంతకి అతనెంతో తనకీ అంతేనేమో? కాదు కాదు. విశ్వం వసంత హక్కు. మొదటిచూపులోనే విశ్వాన్ని వసంత లోబర్చుకున్నది.

తను తన తళుకు బెళుకుల్తో, ఆకర్షణతో విశ్వాన్ని లోబర్చుకోవాలి. ఈ అందాన్ని చేజేతులా చూస్తూ తను పోగొట్టుకోలేదు.

ప్రసాదరావు విశ్వాన్ని దగ్గరగా కూచోబెట్టుకుని "బాబూ, నిన్నుచూస్తే నాకెందుకనో పుత్రేషణ కల్గుతోంది. ఇది సహజంగా అసహజమైనది. ఐనా, నిన్ను నేను వదిలిపెట్టి వుండలేనేమో– అన్నంత గాఢమైన ముద్ర నాగుండెల్లో హత్తుకుపోయింది."

విశ్వం ఆశ్చర్యంలో మునిగిపోయాడు. ఇంత ఆదరం లభిస్తుందని ఎన్నడూ వూహించలేదు. విశ్వం కళ్లల్లో నీళ్ళు కళుక్కున మెరిశినయ్.

ప్రసాదరావు ఆప్యాయంగా భుజంతట్టి, "బాబూ, ఈ లోకం ఎవరిదీకాదు. అందరికీ అనుభవించే హక్కువున్నది.

గత జీవితాన్ని గురించి ఏడ్వటం అవివేకుల లక్షణం—ఏడ్వకు" అన్నాడు.

ఇంతలో వసంత వచ్చి, తండ్రిపక్కనే ఆనుకూర్చుంది. సూటిగా విశ్వం ముఖంలోకి చూసింది. ఆ కళ్లు తళుక్కుమని మెరిసి చిలిపిగా నవ్వుతున్నాయి. చిన్నరొమ్ములు కంపించి, జాకెట్లో మెరుపుల్ని కంపిస్తోన్నాయి. వ్రేలాడేసిన వాలుజెడలోని పూలు సిగ్గుతో పరవశించిపోతున్నాయి.

"నాన్నా, విశ్వంగారి బట్టలు" అన్నది వసంత. విశ్వానికి సిగ్గేసింది. ప్రసాదరావు నవ్వి, "ఫోన్ చేయి షాపుకి. నీకు కావలసినవాళ్ళ సెలక్షన్ నీదేగా" అన్నాడు.

"పో నాన్నా" అన్నదీ వసంత.

ప్రసాదరావు నవ్వు మిన్నుముట్టింది.

"విశ్వంగారూ, రండి. స్నానం చేయండి" అంది. వసంత, షాపువాడికి ఫోన్ చేసింది. రెడీమేడ్ బట్టలు మోపెడు వేసుకొచ్చాడు వాడు. అయిదొందలు ఖరీదుగల బట్టలు, పెట్టెనిండా తీసుకున్నది. ఇన్నెందుకని విశ్వం అడ్డు చెప్పాడు. వసంత "మీకు తెలీదు, ఫూరుకోండి" అన్నది. వసంతకి తాళం వేస్తూ, మదన దాన్ని సమర్థించింది.

సాయంకాలానికి బూట్లూ, గడియారమూ వాటం తటికవే వచ్చి, విశ్వం హక్కైపోయినయ్. విశ్వంలో పున్న తేజస్సు, జాజ్వల్యమానంగా ప్రకాశించింది.

వసంత అనుకున్నది "నేను చాలా అదృష్టవంతు రాల్ని" విశ్వంకూడా, యిలా యెన్నిసార్లు అనుకున్నాడో. విశ్వం అదృష్ట జాతక కథానికల్లోని రాజకుమారుడయ్యాడు. ఇష్టంవచ్చినట్లు సుఖాల్ని అనుభవించవచ్చు. సుఖం వక్క రికి కొన్ని పరిస్థితుల్లో, "విలాసిని."

తనకి వసంత ఏమౌతుంది? ఈ ప్రశ్నకి సమాధానం యివ్వవలసింది వసంత. అయినా ప్రశ్నించుకునే హక్కు విశ్వాని కున్నది గదా?

ఒకరాత్రి ఎనిమిది గంటలకి, వసంత విశ్వాన్ని పేకా డ్డానికి రమ్మన్నది. విశ్వం సరే నన్నాడు. పేకాటలో వసంత చిత్తుగా ఓడిపోసాగింది. ఉక్రోషం పట్టలేక "దొంగాట" అన్నది.

విశ్వంనవ్వి, "అవును దొంగదగ్గర అలాగే ఆడాలి" అన్నాడు.

"ఎవరు దొంగ?"

"నువ్వే"

"నువ్వే"

ఇలా చాలాసార్లు రెట్టించుకున్నాక, వసంత, విశ్వం చేతిలో పేకలాక్కోబోయింది. విశ్వం చెయి వెనక్కి లాక్కోడంతో, వసంత వూపులో వెళ్ళి విశ్వం ఒళ్ళో పడింది. అప్రయత్నంగా, విశ్వం వసంత నడుంచుట్టూ. చేతులు వేసి తనదగ్గర కూర్చోబెట్టుకున్నాడు. వసంత గోముగా వెంట్రుకలు నిమిరింది. అది తియ్యని మత్తు.

మబ్బులు ఆవరించుకున్న ఆకాశంలాగా చీకటి నిషా. అది వివరించడానికి వీల్లేని మధురానుభూతి.

ఇంతలో బైట మదన గట్టిగా నవ్విన శబ్దం. 'ఓ. కె. గుడ్ నైట్ ... ఐ షల్ మీట్ యు టుమారో' అన్న మాటలు వినిపించాయి. వసంత లేచి కూర్చుంది. విశ్వం పేకముక్కల్ని ఏరి మళ్ళీ కలుపుతున్నాడు. మదన లోపల కొచ్చి కూర్చుంది. చనువుగా విశ్వాన్ని రాసుకుంటూ పోయి, ప్రక్కనే కుర్చీలో కూర్చుంది. వసంత విశ్వం కళ్ళ ల్లోకిచూసి నవ్వింది. ఆ నవ్వులో సెలయేటి గలగలలూ, చిరుమబ్బుల మిలమిలలూ వున్నాయి.

మదన వాళ్ళవంక అదోలా చూసింది. మళ్ళీ పేకాట మొదలయింది. కాని యిన్టరెస్టుగాలేదు. ఆట రెమ్మో, మిమ్మోగా సాగుతోంది. కాసేపాగాక విశ్వం, 'యిక ఆపేద్దామా' అన్నాడు. వసంత సరేనన్నట్టు తెలూపింది. మదనకి యిష్టంలేదు ఆటఆపడం. అయినా, గత్యంతరం లేదు.

ప్రసాదరావు బయటనుంచి పిలిచాడు. 'అమ్మా! వసంతా ఎవరో వచ్చారు చూడమ్మా' అన్నాడు. వసంతా, విశ్వం బయటకొచ్చారు. మదన అలానే లోపల కూర్చుని వున్నది. వసంత ఒకసారి పరుగెత్తికెళ్ళి, కావిలించుకొని 'సుమిత్ర పిన్నీ' అంది. 'పిన్నీ, యింతకాలం నన్నొదిలి యెక్కడికెళ్ళావమ్మా' అన్నది.

వసంత విశ్వంవైపు తిరిగి, "విశ్వంగారూ, మాపిన్ని" అన్నది. విశ్వం నమ్రతగా "నమస్కారమండీ" అన్నాడు.

సుమిత్ర చిరునవ్వు నవ్వింది. ప్రసాదరావుగారు అందుకుని, "యితనేనమ్మా నే చెప్పిన అబ్బాయి విశ్వం" అన్నాడు. సుమిత్రి ఆప్యాయంగా విశ్వంవంక చూసింది "బాబాయేడి పిన్నీ?" అన్నది వసంత. "ఒస్తున్నారమ్మా! బాబాయి మీదకి మళ్ళిందా గాలి? యెవరు ఎత్తుకుపోగులే" అన్నది సుమిత్ర.

"ఎత్తుకెళ్ళినా, పోట్లాడి మీ పిన్ని లాక్కొస్తుందమ్మా" అన్నారు ప్రసాదరావుగారు. అందరూ ఒక్కసారి నవ్వారు. మదన భైటకొస్తూ యీ నవ్వుల్తో శృతికల్పింది. "నీ వెప్పుడొచ్చావమ్మా" అన్నది మదన నుద్దేశించి. "పది రోజులయ్యింది పిన్నీ!" అన్నది మదన.

జగన్ కూడా వచ్చాడు. వెంటనే నౌకరు రెండు బుట్టల్తో కాయలు, పండ్లూ పట్టుకొచ్చాడు. వసంత దగ్గర కొచ్చి, "అమ్మా వసంతా! బాగాడున్నావామ్మా" అన్నాడు. వసంతనవ్వి "బాగానే ఉన్నాను బాబాయ్"అన్నది. "అది సరేగాని బాబాయ్, నిన్నెవరూ లాక్కెళ్ళలేదా?" అని పకపకనవ్వడం మొదలెట్టింది. అందరూ నవ్వుకున్నారు సుమిత్ర ఆప్యాయంగా, భర్తవంక చూసింది.

జగన్ కిదేమీ అర్థంకాలేదు. ముఖం ప్రశ్నార్థకంగా పెట్టి, "ఏమిటది?" అన్నాడు

"మా మరదల్ని అడుగు"అన్నాడు ప్రసాదరావుగారు. కులాసాగా నవ్వుల్తో కాలం గడిచిపోయింది. అందరూ భోజనాలకు కూచున్నారు. జగన్ ఆప్యాయంగా, విశ్వం వీపు నిమిరాడు. విశ్వం తలెత్తి ఒక్కసారి చూశాడు. ఆ

చూపుల్లో అమాయకత్వం అద్దంలోని అందంలా ప్రతిఫలి స్తోంది.

"బాబాయ్, ఒక్కమాట చెప్పనా?" అన్నది వసంత. ఇంతలో పసిపిల్ల ఏడుపు వినిపించింది. ప్రసాదరావుగారు, "విశ్వం అక్కగారబ్బాయ్" అన్నారు. సుమిత్ర ఆయా తెస్తుందన్నా వినకుండా చేయి కడుక్కువెళ్లి, పాపని భుజాన వేసుకొచ్చింది. ఆమెలో మాతృత్వం పొంగిపొర్లింది. అందరూ భోంచేస్తున్నా తానుమాత్రం పాపకి పాలుపట్టి, జోకొడ్తూవుంది. జగన్నవ్వి, "పిల్లతల్లీ జాగ్రత్త" అన్నాడు.

"మీకూకూడా లాలపాడనా?" అన్నది సుమిత్ర. జగన్ నవ్వి, "పిల్లతల్లే గాకుండా 'పెద్ద' తల్లికూడా అవుదా మనుకుంటున్నావా? అన్నాడు. అలా కబుర్లతో చాలా రాత్రివరకూ గడచిపోయింది.

మళ్లీ తెల్లారింది మదన్‌ని అర్జెంటుగా రమ్మని టెలి గ్రాంవచ్చింది. ఇంత అర్జెంటుగా రమ్మనమనడానికి కారణ మేమిటో, ఎవరికీ అర్థంకాలేదు. మదన అప్పటికప్పుడే డ్రెస్ చేసుకుని, ఏరోడ్రమ్‌కి బయలుదేరింది విమానం దగ్గ రికి. వసంత, విశ్వం మాత్రమే చిన్నకార్లో డ్రాప్ చేయడాని కెళ్ళారు వసంత వెళ్ళబోతున్న మదన చేయిపట్టుకుని, "వెంటనే వ్రాయి ఉత్తరం" అన్నది. విశ్వాన్ని రమ్మని, మరీ మరీ రెక్వెస్ట్ చేసింది.

మదన వెళ్ళిపోయాక, "అదోరకం మనిషి" అన్నది వసంత. విశ్వం తలూపి వూరుకున్నాడు. కార్లో వెనకసీట్లో కూర్చున్నారు. విశ్వం భుజంమీద తలవాల్చి ఎటో

చూస్తోంది వసంత—'ఎటు' అనే ప్రశ్నకి యిక్కడ సమాధానం లేదు.

కారు కాంపౌండ్‌లో ఆగింది. సుమిత్ర-మేడమీద నుంచుని యెదురుచూస్తోంది. మేడపైకెక్కాక, "మదన వెళ్ళిపోయిందా?" అన్నది వెళ్ళిపోయింది అన్నట్లు తల వూగులాడించింది వసంత. సుమిత్ర భుజాలమీది పాప, నిద్దరోతోంది. నిద్రలోకూడా మధురహాసం!

"విశ్వంబాబూ" అని పిల్చింది సుమిత్ర. విశ్వం వెనక్కితిరిగి నిలబడిపోయాడు. వసంతకూడానిలబడిపోయింది. "ఒక్కమాట; ఈ పాపని నేను పెంచుకుంటాను, నీ కిష్టమేనా బాబూ!" అన్నది సుమిత్ర.

"నువ్వా పిన్నీ" అన్నది వసంత.

"ఔను, నేనే" అన్నది సుమిత్ర.

"అలాగే పిన్నీ, యి తకన్నా కావల్సిందేముంది? ఇంతమంచి పెంపుడుతల్లి దొరకడం నిజంగా పాప అదృష్టం" అన్నది వసంత.

విశ్వం నవ్వి, "వసంత అభిప్రాయం విన్నారుగా. ఇంతకన్నా నేనుమాత్రం చెప్పాల్సిందేముంది?" అన్నాడు. సుమిత్ర, ఆనందంతో విశ్వం తలను చేత్తోనిమిరి, "ఎంత మంచివాడవు బాబూ!" అన్నది. విశ్వం, "మీకన్నా మంచివాళ్లు యెవరున్నారీ లోకంలో నాకు" అన్నాడు.

"రండి భద్రాజుగారూ, భోంచేద్దాం" అన్నది వసంత. విశ్వం అనుసరించాడు చిన్నగా నవ్వుతూ ఇది

చనువు. ఈ చనువులో సంస్కారం వుంది. సంసారం చాటున కనుపించని ప్రేమకూడా వుంది.

మానవజీవితమే చిత్రమైన అనుబంధం. చెట్టుకు అల్లుకునే తీగలాగా, ఎంతగొప్ప ఆడదానికయినా, "అనుబంధం" అంటూ వకటి వుండాలి. ఈ అవలంబనే, విశ్వంగా వసంత హృదయం ఆరాటపడడం అసహజమూ, అతిశయోక్తీ కాగూడదు. "ప్రేమ"కి అంతరాంతరాల్లో అంతరాలు అంటూ వుండవు. చరిత్రలు ఒక్క క్షణంలో తారుమారవడం ఈ "ప్రేమ" అనే రెండక్షరాలవల్లనే. రాజరికాలకే నీళ్ళొదులుకున్న రాకుమారులు, ఒక్క ముద్దుకోసం పతనమైన పట్టణాలూ, నదీప్రవాహాల్లా రక్తపు టేరులు, తెగిన కాళ్లూ, శ్మశానవాటికలూ యివన్నీ ప్రేమవల్ల కలిగిన చిత్రపరిణామాలే అనడానికి సందేహపడనక్కరలేదనుకుంటాను.

అయితే అధికారమూ, హోదా వీటివల్లకూడా తారుమారైన సామ్రాజ్యాల పుటలున్నాయ్. మానవుని వున్నతి అనే భేషజం క్రింద నలిగిపోయిన మానవుని ప్రేమో దారత గీపెట్టి విలవిలా తన్నుకుని ఏడ్చింది. సలీమ్ ప్రేమ చరిత్ర మలినపూరితం కావడానికి అక్బర్ ఆంతర్యంకన్నా అధికారం, అరాచక రాచరికం అడ్డుగోడల్లా నిల్చినాయి. అనార్కలీ అంతిమవేదన, ఏ కోటల్నీ బద్దలుకొట్టలేకపోయినా, మానవహృదయాల్ని బద్దలుకొట్టి, కరుణాలో కరిగి, కన్నీటిలో కదిలి, సమాధిలో కలిసిపోయింది.

వసంత విశ్వాన్ని ప్రేమించవచ్చు; అది యిద్దరికీ

ఇష్టంకానూవచ్చు. అయితే భవిష్యత్తును బద్దలుకొట్టి, చీకటి వెలుగుల్ని చూడగలంత సౌందర్యపిపాసకి మానవుడు నోచుకోలేదు ఇది సౌందర్య పిపాసకాదు, అంటే వాదించ నక్కరలేదు. రచనా శిల్పంలాగా, సౌందర్య పిపాసాశిల్పం కూడా మహోజ్జ్వలమైనది. రేపు జరిగేదాన్ని తెల్సుకోవడం బ్రహ్మవశంకూడా కాదు. బ్రహ్మ తనకి రేపు ఏం జరుగు తుందో చెప్పగలడా?

అనుల్లంఘనీయమైన విధి ప్రసాదరావుకి ఎలా దారి చూపించిందో అలాగే విశ్వానికీ దారి చూపించింది. విశ్వం యిక్కడకొచ్చి ఒక గొప్ప స్థానాన్ని ఆక్రమించుకోవడం చిత్రమైందేగదామరి.

ఇలా కాలం గడుస్తూనేవుంది. విశ్వం, వసంత నానా టికీ సన్నిహితులైపోయారు. విశ్వాన్ని ఆ యింట్లో పరాయి వ్యక్తిగా ఎవరూ భావించడంలేదు. భావించనక్కర్లేదు కూడాను.

మార్చినెల మండుటెండల్ని దాల్చిపోస్తోంది.ఆకాశం లోంచి నిప్పుకణాలు రాల్తున్నట్టున్నాయి. విశ్వానికి ఏమీ తోచడంలేదు కులాసాలు మితిమీరినా, విలాసాలు విరివిగా దొరికినా, బావుండవు. ఎంతసేపూ కబుర్లూ, పేకా, బీచి, చిన్నకారూ విశ్వానికి మొఖంమొత్తినాయి. గాలిమార్పూ, పరిసరాల్ని కదిలి పోవడమూ జరిగితే బావుండును అను కున్నాడు.

ఐతే అప్పుడప్పుడూ లీల గుర్తొస్తూండేది. పాపం!లీల ఏక్కడుందో, ఏం చేస్తోందో, ఏమైంది? యిన్ని సుఖాల్లోనూ

కూడా వెలితి. పూర్ణభాసితుడైన కలువ రేడు నుదురుమీది ముసురు వలుపులాగా లీల గుర్తొచ్చినప్పుడు విశ్వం ముఖం నల్లగా పాలిపోయేది. అయినా ఆలోచించి చేయగలిగిం దేమున్నది! గతాలస్మృతుల్ని నెమరు వేసుకోవడంవల్ల బాధ పెగిలి, ఆగలు సెగిలి, వగలు రగలడంకన్నా. అంత మాత్రాన బాధ మనస్సును దహించకుండా మాత్రం వుండదు. బాధ నిప్పుకన్నా వెయ్యిరెట్లు కాల్తుంది. నిప్పులో కాలి దహించిన మనిషి చచ్చిపోవచ్చుగానీ, బాధల్లో కాలితే మనిషి రోజుకు లక్షసార్లు కాలి చచ్చి బ్రతుకుతాడు.

హైదరాబాద్‌నుంచి మదన వుత్తరం రాసింది విశ్వాన్ని రమ్మని. వసంతకూడావస్తే బావుంటుందన్నా భావంతప్ప రమ్మనే కోరిక ఎక్కడా ఆ వుత్తరంలో దొర్ల లేదు. విశ్వానికి ఈవుత్తరం మంచి ఎంకరేజిమెంట్ ఇచ్చింది.

అంతమాత్రాన విశ్వానికి యిక్కణ్ణించి కదిలే స్వాతంత్ర్యంలేదు. దానికి వసంత అనుమతి కావాలి. విశ్వా నికి- ఆయింట్లోవున్న అల్సేషియన్ కుక్కకి పెద్దభేదంలేదు. నోరుగల మనిషి-నోరులేని కుక్క. తాను వసంతకి కాపలా కాసినట్లు, కుక్క యింటికి కాపలా కాస్తోంది. ఈవూహ తనకి వచ్చినందుకు తనని తానే అసహ్యించుకున్నాడు విశ్వం. కాదు, వసంత అలాంటిది ఎన్నడూకాదు. కాదు-కాదు. ఇలా వెయ్యిసార్లన్నా గుణించుకున్నాడు విశ్వం. ఎందుకనో అన్నీవున్నా స్వేచ్ఛలేక మానవుడు ఏమీలేనట్లు బాధపడ తాడు.

7)

వసంత విశ్వాన్ని "హైదరాబాద్ వెళ్తున్నారా" అని అడిగింది. విశ్వం "నీవూ వస్తే బాగావుంటుంది" అన్నాడు. వసంత నవ్వి, "అందులో నన్నురమ్మని లేదుగా" అన్నది. "నీవు పరాయిదానివి కాదుగా? అందుకని రాయ లేదు" అన్నాడు విశ్వం. అయినా వసంత ప్రయాణానికి సిలుపడలేదు. దానిక్కారణాలు చాలా ఏకరువు పెట్టినా, అవి జీవంలేనివి. విశ్వం హైదరాబాద్ ప్రయాణంమాత్రం తప్పలేదు. ఆ సాయంకాలమే విశ్వం హైదరాబాద్ ప్రయాణ మయ్యాడు. త్వరగారమ్మని వసంత నొక్కి నొక్కి చెప్పింది.

మరుసటిరోజు పన్నెండుగంటలకి ట్రైన్ హైదరా బాద్ చేరింది. మదన చిన్నకార్లో స్టేషన్‌కొచ్చింది. విశ్వా నికి ఎదురొచ్చి మరీ స్వాగతం చెప్పింది.

విశ్వాన్ని చూడగానే మదన ముఖం వికసించింది. ఇక్కోరకపు తీయని ఆనందం. మదన హృదయంలోవున్న ఉద్దేశ్యాలువేరు. విశ్వం ఉద్దేశ్యాలు అసలు చిగుళ్లే తొడగ లేదుగదా! మదన చనువుగా విశ్వం చేతిని పట్టుకున్నది. ఇలా చేయి పట్టుకోవడంలో మదనకి వేరేభావం వున్నది. కాని, దీన్ని విశ్వం మరో దృక్పథంలో చూడలేదు. ఎందుక నంటే, వసంత పెద్దమ్మకూతురుగా, తనచేతిని పట్టుకునే హక్కు మదనకి వుంది అనే వూహాగానం.

ఇక్కడ పరిస్థితులు చాలావిచిత్రమైనవి. ఇక్కడ స్వేచ్ఛ వున్నది. కాని చాలాగంభీరమైనది. ఆనందంవున్నది. కాని అతిక్రమించలేని హద్దుల్లో బంధించబడివుంది. విశ్వాన్ని అందరూ గౌరవించారు. ఆప్యాయతతో ప్రేమించారు. గౌర

వంతో సమాదరించారు. గౌరవనీయులు. కానీ ఈ గౌరవం వెనుక విశ్వాన్ని దక్కించుకోవాలనే నిగూఢమైన స్వార్థం వున్నది.

ఒకరోజు వుస్మానియా, ఒకరోజు రిట్జ్ కి, మరోసారి సాలార్ జంగ్ కి, ఒకటేమిటి, మదన విశ్వానికి అన్నీ చూపించింది. ఆపేక్షలక్రింద అంతస్థులు బలీయమైనవికావు అన్నట్లు ప్రవర్తించింది మదన ఇది ఒక్కవిశ్వానికి మాత్రమే అది అందరికీ సంబంధించినవికాదు. అందర్నీ శాసించే మదన విశ్వాన్ని శాసించలేదు. ఎందువల్లనంటే, విశ్వం గెస్ట్ కూడాను. అంతరాంతరాల్లో బలీయమైన వాంఛలుండటం అసహజమేమీకాదు. అన్నపానాదులు జీవితాలకి ఎంతఅవసరాలో కామకేళీ విలాసాలు, ముద్దులుకూడా అంతే అవసరాలు. ఈ నగ్నసత్యాన్ని గుర్తించుకుంటే చాలు. అంతమాత్రాన పరిమితులైన హద్దులు, బదాబదలు చేసుకుని, సాంఘిక మర్యాదల్ని అతిక్రమించే హక్కు ఎవరికీ లేదు. విశ్వాన్ని ప్రేమించేహక్కు లోలోపల లోతుల్లో మదనకి వుండవచ్చు. అందుచేత విశ్వం ప్రేమించాలి – అనే చట్టాల కట్టడాల్ని హృదయమనే చట్రంలో బిగించటానికి వీల్లేదు.

రాత్రి చీకటిగా వున్న నిశ్శబ్దత – హృదయాల వెల్లువలే, ప్రవహించే సంక్షోభత– ఆనందంలాంటి కళ్ళల్లో మెత్తని సుఖాలఖుషీ– క్షణ క్షణంలో మారే ఊసరవెల్లి రంగుల మార్పులాంటి హృదయాక్రోశన– ఇదేగదా, మదనకి కంటిరెప్పలమీద నిద్రపట్టకుండా మార్చే "శక్తి" ప్రభావం——

విశ్వం నిద్రలోనవ్వుతున్నాడు. మంచుముత్యాల్లాంటి చెమటబిందువులు ముఖానమెరుస్తున్నాయి. నుదుట జారిన వెంట్రుకలు ముఖాన మెలిక తిరిగివున్నై. అందాన్ని చిందుతున్న సోగయుగాలు! మదనలో వుద్రేకం రేగింది. విశ్వం నిద్దరోతున్న గదితలుపుల్ని నెమ్మదిగా నెట్టింది. పిల్లిలా అడుగులు వేసుకుంటూ లోపలికిపోయింది! విశ్వం అటునించి యిటు తిరిగాడు. నెమ్మదిగా ఒరిగింది విశ్వంమీదికి. చిన్న రొమ్ములు, నల్లని జాకెట్ చాటున తెల్లని బాడీని పెనవేసుకుని పైకి పొంగినై — ఆమె వక్షాలు విశ్వం గుండెల్ని తాకినయ్. వులిక్కిపడ్డాడు. మదన కావిలించుకున్నది. విశ్వం వుక్కిరిబిక్కిరయ్యాడు. అదేదోగా వుంది. "ఇంద్రజాలం" నరాల్లో రక్తాన్ని ప్రవహింపజేస్తున్నది. కంపించాడు విశ్వం.

"ఏమిటండీ యిదీ" అన్నాడు.

మదన నవ్వి కౌగిలి విడిచింది—

'ఇహి...హి...హి' నెమ్మదైన మదన నవ్వు—

విశ్వం కోపాన్ని సముదాయించుకున్నాడు. అయినా అంతరాంతరాల్లో జ్వాల భగభగమంటోంది. ఇది తనకి అగ్నిపరీక్ష. లోకంలో ప్రేమలూ, ఎన్నోరకాలని విశ్వానికి అప్పుడు స్ఫురించింది. వసంత ప్రేమ గౌరవంతోనిండిగంభీరమైనది. మదనప్రేమకూడా గౌరవంతోనిండిన చంచలప్రేమ. మదనని ఆసమయంలో ఎంతో అసహ్యించుకున్నాడు.

విశ్వం లేచి దూరంగా నుంచున్నాడు. మదనకూడా గంభీరంగానే నుంచున్నది. విశ్వం చెప్పడం మొదలెట్టాడు. "చూడండి, మదనాదేవిగారూ, మీకు చెప్పగలవాణ్ణి కానను

కోండి-ఐనా చెప్పడం నా బాధ్యత. మిమ్మల్ని నేను గౌర వించాను: ఆరాధించాను. ఆప్యాయతతో మాట్లాడించినంత మాత్రాన అనురాగంతో ప్రేమించాననుకోవడం పొర బాటు. చూడండి, యింకో విషయం -కన్నతల్లిని ప్రేమించే వాడేతప్ప, కామించేవాడు ఈలోకంలో ఎవడూ వుండడు. విశాలవిశ్వవాటికలో ప్రేమకున్నపరిధి చాలావిశాలమైంది, ఉన్నతమైందీ కావొచ్చు.

"మీరు నన్ను ప్రేమించవచ్చు. అంతమాత్రాన నా ఆత్మసంస్కారానికి, అగ్నిపరీక్ష పెట్టటం మీకు భావ్యం కాదు. నేను నిలువ నీడలేనివాణ్ణి. గొప్పవారి హృదయాలు ఎంత విశాలాలో అంతకన్నా పదిరెట్లు సంకుచితాలు. ఈ మనసుల్ని సంతోషమొచ్చినా, కోపమొచ్చినా పట్టలేం. నన్ను సమాదరించిన వసంతాదేవి రేపు సాగనంపవచ్చు. ఎందుకని అని అడగే హక్కునిపూర్తిగా దుర్వినియోగం చేసు కోగల పరిస్థితులు ఆకాశంమీద మబ్బుల్లాఅల్లుకురావొచ్చు. ఆనాడు నిలువలేకపోవొచ్చు. విధి నదిలాగా పారి కన్నీటి మున్నీటిలో కలసే రోజున ఈవిశ్వంలో విశ్వానికి చోటు దొరక్కపోనూ వచ్చు. ఆపేక్షలు కొన్నిపరిస్థితుల్లో అంతః కరణకి ప్రబలశత్రువులు. కేవలం నేను మిమ్మల్ని మాటల్తో బాధిస్తున్నాననుకుంటే, చెప్పనవసరంలేదు. నా బాధని మీకు గాథగా వివరించుతున్నాను. అంతే, అంతకన్నా మించి మరేంలేదు.

"నేను యిక్కడనుంచి రేపే వెళ్ళబోతున్నాను. నన్ను మీ తమ్ముళ్ళా గౌరవించండి. దానికి తగిన అర్హత నాలో

వ్పుందో లేదో నిర్ణయించుకునే హక్కు మీది. మీరు నన్ను గౌరవంగా చూసినందుకు నాకృతజ్ఞతాభి వందనలు చెల్పుకుంటున్నాను—"

ఇంతవరకూ మదన ఒక్క ముక్కగూడా మాట్లాడలేదు. ఒక్క దీర్ఘనిట్టూర్పు విడిచింది- చెప్పుకుపోతూవుంది. "చూడండి విశ్వంబాబూ, నేను ఆడదాన్ని. చదువూ, సంస్కారమూ అన్నీవున్నా - తెగించలేనిదాన్ని. కానీ, ఈ అభిప్రాయం మిమ్మల్ని చూడంగానే సూర్యకాంతిలో మంచుబిందువుల్లా విడిపోయింది. నా హృదయ సుమాంజలుల్ని మీకు ప్రేమపుష్పాంజలులుగా ఏనాడో సమర్పించుకున్నాను నాఅంతర్యాన్ని చాలాసార్లు ప్రశ్నించుకున్నాను. దానికి సమాధానం దొరకలేదు. దొరుకుతుందనే నమ్మకం నాకు ఏనాడూ లేదు బహుశా రాకపోనూవచ్చు. అందుకే మిమ్మల్ని హైద్రాబాద్ రప్పించుకున్నాను. నా ప్రేమని బాహాటంగా మీకు వ్యక్తంచేదామనుకున్నాను.కానీ చేయలేకపోయాను. ఐతే, అంతస్తులూ, అంతఃకరణలూ అన్న మాటలు అబద్ధాలు. నేను మీ ధనంకన్నా ఘనంగా మీ గుణాల్ని ప్రేమించాను ఇదే నేనుచేసిన అపచారమా? హృదయపూర్వకంగా మనుష్యుల్ని ఆరాధించడం మానసికబలహీనతా? ఇంతకన్నా ఈ జీవితంలో అర్థంలేదా? కనిపించిన ప్రతి మనిషినీ ఆరాధించవచ్చు. అంతమాత్రాన ప్రేమించాలనే ఖచ్చితమైన అభిప్రాయాలు నాకు లేవు. గౌరవించాలి అనే నిర్దుష్టమైన అభిప్రాయంవుంది. కానీ మిమ్మల్ని చూసినతర్వాత ఒక్క ప్రేమించడమేగాదు, గౌరవించాలని

కూడా అన్పించింది. విశ్వంబాబూ, ఎందుకునిన్ను గాఢంగా ప్రేమించాలో, ప్రేమించానో నాకు తెలీదు—" మదన కళ్ళల్లో కన్నీళ్ళు కళుక్కమన్నాయి. గొంతు జీరపలికింది.

అంతమాత్రాన—

విశ్వం కరిగిపోగలడా? ఆడదాని కన్నీళ్ళని చూసి నంతమాత్రాన, కరిగిపోగలిగినంతమానసిక బలహీనతకి బందీ కాలేదు మానవుడు. ప్రకృతి సృజించిన ఈ విచిత్ర జీవన నాటకరంగంలో ఆడదాని ఆకర్షణకే లొంగాడు కాని మానవుడు—పైకి పెల్లుబికే కన్నీటికికాదు. విశ్వాన్ని మదన ఆకర్షించ లేకపోవచ్చు. వయస్సులోవున్నంతమాత్రాన అందరూ అందరినీ ప్రేమిస్తారా! విశ్వం అంతర్యం దీనికి వ్యతిరేకమైంది.

అయితే, అందరూ తేలిగ్గా ప్రతివిషయానికి బైటపడిపోరు. వీళ్ల అంతర్యాలు అగాధాలు. ఎంత వెదికినా తెలియని వీళ్ళ చిత్రమైన జీవనగతులు, బాధని కడుపులోనే వుంచుకుని, కుళ్ళబెట్టుకునే నైజం వీళ్ళది. వీళ్ళు తప్పులు చేసినా గొప్పగానేవుంటాయ్. ఏ చరిత్ర పరిశోధించినా, తక్కువ మాట్లాడేవాడికే గౌరవంవున్నట్లు స్పష్టమౌతోంది. రామునికన్నా గొప్పవాడైన సౌమిత్రి ఘనత, ఉద్రేకంవల్లా, నోటి దుడుకుతనంవల్లా కప్పబడిపోయింది. ఈ మనుష్యులు బైటికి ఎంత ఉదాత్తంగా కన్పిస్తారో, అవసరమొచ్చినపుడు తమస్వార్థానికి, సుతిమెత్తగా పీకల్ని తప్పిస్తారు. వీళ్ళకి ప్రపంచంలో స్థానంవుంది. గౌరవంవున్నది. మనుష్యులు వీళ్ళని

ఆరాధించి ప్రేమిస్తారు. లోకాన్ని చుట్టిని మలయానిలం లాంటి నైజంతో లోబర్చుకునేవాళ్ళు.

దీనికి వ్యతిరేకమైన నైజం మదనది. న్యాయాన్ని కాపాడుకునే హక్కు ప్రతివాళ్ళకీ వుంది. ఈ హక్కు ఒక్క మదనదేకాదు, ఈ విశాల విశ్వవాటికలో పాపం చేసుకుని పుట్టిన ప్రతి ప్రాణికీ వుంది. ఇక్కడ న్యాయం నిష్కర్షగా నూటికినూరుపాళ్లు దొరుకుతుంది. కాని, అది అందరికీ నచ్చనంత ఘాటుగా మోటుగా వుంటుంది. వీళ్లు పరిస్థితులకు వారసులుకాదు. వీళ్లు చిన్న తప్పుచేసినా, చరిత్ర వీళ్ళకి పెద్ద అభాండాల్ని కల్పించి పోస్తుంది హృదయపూర్వకంగా కడుపులో వున్నదాన్ని వున్నట్లు వెళ్ళగక్కడంద్వారా వీళ్లు సంఘానికి శత్రువులు. ఈ మన స్తత్వానికి చెందింది మదన. తాను చెప్పదల్చుకున్నది సూటిగా చెప్పింది. తనని విశ్వం ఎలాఅయినా అర్థంచేసుకోనీ. నిజాన్ని, అంతర్యంలో దాచుకోలేని అనురాగాన్ని గుప్పించిపోసింది.

దాంతర్వాత మదన ఏమీ మాట్లాడలేదు. దొంగ కయినా కొన్ని పరిస్థితుల్లో మానవత్వం ఎదురుతిరుగుతుంది. మానవుడు నాశనం కావడానికి తాను కొంతకారకుడైతే, సంఘుందానికి రెండురెట్లు కారణమౌతుంది. 'పరిస్థితి మిగతా దాన్ని పూర్తిచేస్తుంది. సమాదరించలేని సంఘం, నిష్కృతి చూపించలేని సాంఘికమర్యాదలు జీవితాన్ని పీల్చి, పిప్పి చేసి, శూలాల్లా గుచ్చి, గుండెల్లో పుండ్లుచేస్తున్నాయి పరిస్థితుల ప్రభావంవల్ల ఒక్కసారి తప్పటడుగువేసిన మనిషి, మళ్ళీ బాగుపడాలంటే చాలాకాలంపడుతుంది. దొంగగా ముద్ర

పడిన మనిషి, పతితగా పరిగణించబడిన పడతి, రౌడీగా పేరు మోసిన వ్యక్తీ—సంఘం దృష్టిలో మర్యాదస్తులుకారు.

మదనని విశ్వం ఎంతవరకు అర్థంచేసుకున్నాడు? - లేదా విశ్వాన్ని ఆమె ఎంతవరకు అర్థంచేసుకోనగలిగింది_అని తర్కించుకున్నా సమాధానం దొరకలేదు. ప్రత్యుత్తరమియ్య లేని ఆంతర్యాలు మూగగా మసకమబ్బుల్లో చందమామలా వెల్లుబికి రాలేదు. కానీ ఒక్కటిమాత్రం నిజం. మదనలోని ఆత్మసంస్కారం తళుకు బెళుకులవల్లా, నిజాన్ని ఘాటుగా చెప్పడంవల్లా నాశనమయ్యింది.

కానీ విశ్వం, అందరిలాగా మదనని తేలిగ్గా అర్థం చేసుకోలేదు. మదనలో మానసిక వికాసంవుంది. వసంతా, మదనా, ఒకతల్లి కడుపునపుట్టిన అక్కచెల్లెళ్లు కానక్కరలేదు. వరసకి అక్కచెల్లెళ్ళు. కానీ వీళ్ళిద్దరి ఆంతర్యాల్లో ఎంత తేడావుంది! ఇద్దరిలో ఉదాత్తమైన భావన, గంభీరమైన ప్రకృతీ వున్నాయి. కాని ఒకటి 'శాంతి' నది - రెండోది చిలిపిది. రెండోదానికి, జంకి అందరూ భయపడతారు.

అనుకున్న ప్రయాణం ఆగిపోయింది. మరో రెండు రోజులున్నాడు విశ్వం. వసంత మాటలే చెవుల్లో గింగిరాలు తిరుగుతున్నాయి. కాని ఎంతకీ మదన కదల్నివ్వడంలేదు. అంత పెళుసుగా మాటల్ని విసరడం మనుశారాల్ని తెంచుకోవడం విశ్వంనల్ల కానిపని. ఇక రేపు ప్రయాణమనగా ఇవ్వాళ రాత్రి వసంత హైదరాబాద్ వచ్చింది. చెప్పకుండా,

పెట్టకుండా వసంత యిలా రావడం ఒక్క విశ్వానికీ, మదనకే కాదు. అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఈ పదిరోజుల్లోనే, వసంతలో చాలా మార్పొచ్చినట్లు భావన కలిగింది విశ్వానికి. విశ్వమూ, వసంతా చాలాసేపు మాట్లాడుకున్నారు. ఇక్కడ అన్యోన్యత వుంది. ఆపేక్ష వుంది. మదన వాస్తవానికి మంచిది కావచ్చు. కాని స్త్రీ నైజం చిత్రమైందే కాదు, అగాధమైంది కూడాను. ఇదివరకటి మంచి భావనలూ సదుద్దేశ్యాలు వసంతరాకతో పుటుక్కున తెగిపోయినాయి. వసంత యిక్కడికి రావడంలో వున్న మెలిక విశ్వాన్ని దక్కించుకోవడమే. ఇలా వూహించడంలో మదన అపోహాలు పాముల్లాగా బుసలు గక్కుతూండొచ్చు.

కాని యీ తీపి అపేక్షలచాటున కల్మషం ఏమీ లేదు. ఐనా మదన దాన్ని సహించలేదు. తన పాత్ర చిత్రమైంది. విశ్వాన్ని తాను దక్కించుకోవాలి. అంతస్థులో, అందంలో తాను వసంతకన్నా తీసిపోయిందేం కాదు. అవసరమైతే తనకి దొరకని పిట్ట ఎగురుతుందనుకున్న రోజున – ఆడపిట్టని పొడిచి చంపటానికయినా యీ మదన తయారే.

సలీమ్ అనార్కలీని గాఢంగా, జీవితంకన్నా, సామ్రాజ్యంకన్నా ఈ లోకంలో అతీతమైన సుఖాలన్నింటికన్నా మిన్నగా ప్రేమిస్తాడు. అనార్కలీ అంతకన్నా గాఢంగానే ప్రేమిస్తుంది. సలీమ్ సోయగాలకి భ్రమిసిన గుల్నార్ మాటేమిటి? యువరాజాన్ని దక్కించుకోవడం కోసం ఈ రాజనర్తకి, చరిత్రకే కొత్తబాటలు కల్పిస్తుంది.

అనార్కలీ అంతమాన్ని చూసేవరకూ నిద్రపోదు. సుతి మెత్తని ఆడదాని హృదయంలో కరుడుగట్టిన కటిక పాషాణాలు. మొగల్ నిర్మాణం అనార్కలీ అంతంతో, మరో బాటల్ని తీర్చిదిద్దుకుంటుంది. మొగలాయీ సామ్రాజ్యంలో పుట్టిన ప్రతిపూవులోనూ మొగ్గలోనూ అనార్కలీ ప్రేమ రక్తం చింది కన్పిస్తూనేవున్నది.

అయితే యిక్కడ, విశ్వాన్ని యిద్దరు స్త్రీలు గాఢంగా ప్రేమిస్తున్నారు. ఒకరికొకరు తీసిపోనివాళ్లు. ఎవరు ఎక్కువ? ఎవరు తక్కువ? ఈ ప్రశ్నలకి యిక్కడ తావు లేదు. వాస్తవానికి విశ్వం వసంతని ప్రేమిస్తున్నాడు. దాని క్కారణాలు చాలా వున్నాయ్. వసంత తనని సమాదరించింది. చెట్టుమీద పక్షిలాగా దిక్కులేని తనకి, చీకటి లోతుల్లోంచి వెన్నెల మెట్లమీదికి ఎక్కించింది. సమాదరణే కాదు-సమానత్వంతో చూస్తూంది. మదనని ప్రేమించడానికి విశ్వానికి హక్కు లేదనగూడదు. ఉండొచ్చు. అయినా విశ్వం మదనని ప్రేమించలేదు. ఆదరించినంతమాత్రాన ప్రేమించాలి అనే షరతులేమీ లేవుగదా!

తర్వాత మూడురోజులికి, వసంతా, విశ్వమూ బయల్దేరారు. మదనకి అంతిరాంతరాల్లో విద్వేషాగ్ని రాజిరగులోంది. అయినా చేయగల్గిందేమీలేదు. 'కాలం కల్సిరాంలేని గుఱ్ఱం'. ఏనాడో దాన్ని లోబర్చుకోవాలి. ఆ మంచిసమయం కోసమే ఎదురుచూస్తూంది.

వసంతా, విశ్వమూ ట్రైన్ ఎక్కేవరకూ, దాచుకున్న కన్నీళ్లు ట్రైన్ కదిలినతర్వాత బుగ్గలమీదుగాజారి, రొమ్ములదాకా కారాయి. ఏమిటీ చిత్రమైన ఆవేశం?

ప్చ్...నీటిబుగ్గలాంటి 'స్త్రీ' హృదయం.

తరతరాలనుంచీ విసుసుకుపోయి, ఒక్కసారి శృతుల కందకుండాపోయే చిత్రాతిచిత్రమైన చానహృదయం. దరీ తెన్ను లేను. అనుమానం, యీర్ష్య, జుగుప్స, అహంకారం మిళితంచేసి; అందాన్ని అందించి, మగ హృదయాల్ని అర క్షణంలో ఆకట్టించి, మరుక్షణంలో మరిపించే - ఈ చిత్ర మైన స్త్రీ మృగాన్ని-ఎందుకు సృష్టించావు విధాతా?

* * *

లీల నూటయిరవైమైళ్ళు నడిచి ఒక పల్లెటూరు చేరు కున్నది. ఇక్కడికి ఎలా చేరింది? ఎలా చేరగలిగాను-అనే ప్రశ్న లీలకి తట్టితే శావుండును. కాని యిది లీలకి తట్టలేదు. ఒక్కటిమాత్రం తనకి తెలుసు. విధాత తనని చిన్నచూపు చూశాడు తనకిఒకవిధమైన ఉన్మాదం వచ్చింది. అది వివరించ డానికి వీల్లేనిది. తన హృదయంకన్నా మిన్నగా దేముణ్ణి ఆరాధించింది. అందుకు ప్రతిఫలంగా మిగిలిందేమిటి? "మిగి లిందేమిటి?"

"చుట్టూ జుట్టు విరబోసుకున్న చీకటి చిన్నది!"

"హాహాకారాలతో మిన్నుముట్టే - ఆకలి కేకలీ స్వరం"

ధనికాంధత్వంతో తమని హీనంగాచూసే 'దరిద్రులు'

తమని ప్రాణప్రదంగా ప్రేమించే, కన్నతండ్రి కాల వాహినిలో కలసిపోయాడు ఈ లోకంలో తమనివదిలిపోయిన తల్లి, తండ్రి చావు తెలియకుండానే, యిల్లు వదిలిపోయింది- వున్నవారందర్నీ దూరంచేసుకుని తనకి నీడగా నిల్చిన

ముకుందం శాశ్వతమైన నీడలో కలిసిపోయ్యాడు. తనకి ప్రతిబింబంగా ఓబిడ్డని ఈ లోకంలో వొదిలి తనకి భార్తృత్వంమీద మమత ఎందుకనో సడలి విడిలిపోయింది. ఉన్నతమ్మణ్ణి, కన్న నలుసును కాలదన్నుకున్నది. ఎడతెగకుండా చాల ధూరం నడిచొచ్చింది. ఆకలైనా చంపుకున్నది. చేతిగాజులు అమ్ముకున్నది. మానవుడు ఎన్ని బంధనాల్ని తెంచుకున్నా తెంచుకోలేని బంధం ఆకలి. ఇలా చివరికీ పల్లెటూరు చేరుకున్నది.

ఇది పల్లెటూరు. ఇక్కడున్న యిళ్ళు చాలాతక్కువ. అనాదినాటి మానవుడి చిహ్నాలు యింకా యిక్కడ చెదరలేదు. అందమైనవాళ్ళు యిక్కడ లేరు. ఉన్నా ఎండలో యెండి కళతప్పిన యీ ముఖాల్లో స్వచ్ఛత వుంది. "పాడి పంటలు పొంగిపొరలే దేశాన" యిది యిక్కడ అక్షరాలా నిజం. ఇక్కడవున్న చెప్పుకోతగ్గ యిల్లు ఒక్కటే ఒక్కటి. అది రాణీ 'సుచేల' గారిది. రాణీ సుచేల యిక్కడికొచ్చే సరికి పన్నెండేళ్ల పిల్ల. భర్త కుమారరాజా రెండవపెళ్ళిగా ఈ అందగత్తెని ఎన్నుకున్నాడు. నలభైయేళ్ళవరుడికి పన్నెండేళ్ళ పిల్ల వధువు. బీదతనంలోంచి పైకొచ్చిన ఈ అదృష్టదేవత, కేవలం ముసలిభర్త హృదయంలో ప్రేమదీపాల్నే గాక, కళతప్పిన దివాణపుగోడల్లో వాడల్లోనైతం దీపాల్ని వెలిగించింది. ఆలనా పాలనాలేక అరణ్యంలావున్న ఈ యిల్లు, వెన్నెలకాంతులతో మెరిసిపోయింది. ప్రజల్ని హింసించే దివాను, అరాచకం సుచేలాదేవితో తారుమారయ్యింది. అచ్చోసిన యీ ఆంబోతును మొట్టమొదటగా ముక్కుతాళ్ళువేసి వాచింది ఈ చిన్నరాణీయే. బీదతనం

లోంచి ధనలక్ష్మి భాండాగారంలో కొచ్చిపడినా, ఈ చిన్న రాణీ గర్వించబోవటాని క్కారణం పూర్వజన్మ సుకృతం గాక మరేమిటి ?

కుమారరాజా తమ్ముడు చిన రాజాకి జీవితంలో ఆశయాలంటూవుంటే రెండేరెండు. విలాసినులు, విలాసాలు. చిన రాజాకి వయస్సు షుమారు ఇరవైఏళ్ళు వుండొచ్చు. కాని జీవితాన్ని సగం అప్పుడే అనుభవించినట్టున్నాడు. ఎరన్రిటి నిప్పుకళ్ళు. గప్పుమనే బ్రాందీ సుగంధ పరిమళాలు. మత్తెక్కిన కళ్ళలో మైమరచిన ఖుషీనిషా – పెళ్ళి అక్కర లేదు. బాధలూ బాదరబందీలూ అసలు లేనేలేవు. అందమైన ఆడది కన్పిస్తే ఈ విలాస వీరవసంతరాయలు, నిద్ర పట్టకుండా విలవిల్లాడతాడు. జీవితాన్ని అనుభవించాలనే, ఈ రసికవతంసుడు ఎప్పుడైనా రాలిపోవచ్చు.

పెద్దరాణి సుమరాణి అదోకరకం మనిషి. ఎప్పుడూ రోగంతో తీసుకునేది. ఆ యింటికి ఆలనా పాలనా లేదు. దివాణంలో ఎందరో దిగేవారు. ఇష్టమొచ్చినట్టు తాగి తూలి సుఖాల ముసుపుల్లో పోతూండేవారు. దాసీలు విలాసినులయ్యారు. చిన్నబాబు రసికతుమ్మెద. నిషాలో వున్నప్పుడూ ఖుషీలోవున్నప్పుడూ ఆయనచెయ్యి విరివిగా దానధర్మాలు చేస్తుండేది. మత్తులమధ్యన, మెత్తని పరుపులమీద సుందరీ మణుల సాన్నిహిత్యంలోనూ శిబీ, దధీచీఎవ్వరూ ఆయనకి పోలేవారుకారు. 'దానకర్ణుడు'. ఆలనా పాలనా లేని యీ కొంపలో ఎవరి యిష్టంవారిది. కాని, కుమారరాజా భార్యని మెంతో గాఢంగా ప్రేమించేవాడు. సుమరాణి కడుపున

ఒక్క కాయన్నా కాయలేదు. ఆ బెంగతో పెదరాణీ క్షీణించిపోయింది సగం. ఒకరాత్రి దివాణాన్నీ, భర్తనీ, రాచరికాన్నీ ఒదులుకొని చచ్చిపోయింది.

తర్వాత కుమారరాజా అదోలావుండేవాడు. ఎవరితోనూ మాట్లాడేవాడుకాదు. భార్య మరణం ఆయన హృదయంలో రాచపుండు అయింది. అన్నీ వున్నాయ్. రాచరికమూ, భోగమూ, సౌఖ్యమూ, ధనమూ అన్నీ - కానీ వీటన్నిటినీ వెలబోసిభార్యని బ్రతికించుకోగలడా? బ్రతికించుకోవడం ఎవరివల్ల నయినా అయిందా?

కాని ప్రకృతి చిత్రమైంది. దానంతటకదే బాంధవ్యాన్ని పేర్చికూర్చుతుంది. సుమరాణి తమ్ముడు కుమారరాజాని వేటకి ఆహ్వానించాడు. రాచరికం కత్తిమీద సాములాంటిది. ఇక్కడ గౌరవాన్ని చేజేతులా అమ్ముకోవాల్సొస్తుంది. ప్రపంచాన్ని జయించగలిగిన తమ్ములుండి, ఈ అఖండ భూవలయాన్ని గిరిగీసి నిలపగలిగిన ధర్మరాజుకి పెళ్ళాన్ని బందీచేసి, అడవుల్లో ఆకులలాల్ని తినాల్సినంతగ తేంపట్టింది? ఆహ్వానాన్ని తిరస్కరించడం రాచరికపు లక్షణంకాదు. అలా తిరస్కరించినవాడు రాజుగా అనర్హుడు. ' రాచరికం అంటే జమీందారీ ఫాయిదా అన్నమాట. రాజా అంటే యిక్కడ కొమ్ములు మొల్చిన జమీందారు అనే అర్థాన్ని అన్వయించుకోవాల్సొస్తుంది.

భార్య చచ్చిపోయేనాటికి కుమారరాజా వయస్సు నలభై ఏళ్లు. గంభీరమైన నల్లమీసాల్ని వెక్కిరిస్తూ తెల్ల మీసాలు యిప్పుడే పొటమరిస్తున్నాయి. మెలికలు తిరిగిన

కంఠరాలచుట్టూ సిల్కుబట్టలు చుట్టుకు పోతున్నాయి. ఆహ్వానాన్ని మన్నిస్తూ రాజా వుత్తరం రాశారు. పిస్తోళ్ళు ఆరు. నిండా గుళ్లు. రైఫిల్ గుండు కన్నా. వేగంగా పోయే జవనాశ్వం. గురిచూసి కాల్వగల అయిదారుగురు సుంచి మదించిన వేటగాళ్ళు—

రాజా ఒక ఉదయం బయల్దేరి కోటపాలెం ఎస్టేటుకు శావమరిదిగారింటికి లాంఛనప్రాయపు రాజరికపు హోదాలో బయల్దేరారు. అన్నీ మంచి శకునాలే ఎదురయ్యాయి. రైఫిళ్ళు, బ్రాందీసీసాలు, గుఱ్ఱాలు, కమ్చా కఱ్ఱలు సమార్రాజాకి స్వాగతమిచ్చాయి. కోటపాలాన్నానుకుని 8 మైళ్ళలో "తుమ్మలేరు" వద్దున ఒక పెద్ద కీకారణ్యం వుంది ఇక్కడ స్వేచ్ఛగా వేటాడుకో వచ్చు. చిన్న బంగళాకూడా వుంది. ఇక్కడ యిది ఎన్ని ఏళ్ళక్రింద కట్టారో తెలియకుండాపుంది. ఇది వేటగాళ్ళ విడిది యిల్లు చుట్టూ క్రూరజంతువులు మసలకుండా, దూకకుండా కట్టుదిట్టంగా కట్టిన, ఈ బంగళాలో సామాన్లు పడేసి యిద్దర్ని కాపలావుంచి వేటకి బయల్దేరారు, పన్నెండు మంది. రైఫిల్లు తపతపమని పేలిపోతున్నాయి. కుమారరాజా లేడిపిల్ల వెంటపడ్డారు అందకుండా చిందులేస్తోం దది. దాన్ని పట్టుకోవాలనేపట్టుదల ఎక్కువయ్యింది రాజాగారికి. అయినా అది చిక్కడంలేదు ఢాంమని పేలింది. ఝుస్...స్... మంటూ దూసుకుంటూ పోయి చెట్టుకు తగిలి నిప్పురవ్వలు గక్కుకుంటూ కాండంలోంచి యిటువైపుకొచ్చింది. రాజాగారు గుఱ్ఱాన్ని పరిగెత్తించారు. నుసులు కక్కుతో పరు

గెడ్తోన్న జవనాశ్వం, కళ్లు చిట్లించి కాళ్లుపైకెత్తి వికృతంగా సకిలించింది.

ఎదురుగా గర్జిస్తోన్న పెద్దపులి. కళ్లు తళతళా మెరుస్తున్నాయి. రాజాగారు రైఫిలు పేల్చారు గుళ్లు అయిపోయిన రైఫిలది దీనంగా మూల్గింది. ట్రిగ్గరు కదిల్నా నిప్పులు రాలడంలేదు. టైములేదు పెద్దపులి భయంకరంగా గర్జించింది. ఒక్కసారి లంఘించి, పంజాతో ఛెడేల్‌మని కొట్టింది. గుఱ్ఱం ముఖం వేటుతో వాలిపోయింది. గుఱ్ఱం, భయంతో, బాధతో విలవిలా కొట్టుకున్నది. కుమార్రాజా క్రిందపడిపోయారు. పులి గుఱ్ఱాన్ని లాక్కుపోయింది.

ఆయనకి స్పృహ తెల్సే సరికి చీకటిగావున్న రాత్రి. ఈదురుగాలి. ఎండుటాకుల గలగలలు. ఒళ్ళంతా విరగ్గొట్టినట్టుంది. తెలియనంత గాఢాంధకారం. ఎవ్వరూ లేరు. బంగళాదాటి చాలాదూరంవచ్చాడు. కనుచూపు మేరలో ఎక్కడా కాంతికిరణాలు కన్పించడంలేదు. ఇప్పుడు ఏం చెయ్యాలి- అన్నదో సమస్య. అనంతాల అంచులదాకా వ్యాపించివున్న భయంకర కీకారణ్యం. తనవాళ్ళెవరూ కన్పించడంలేదు. క్రూరజంతువులు తిరిగే అర్ధరాత్రిసమయం. పోని యీచీకట్లో బంగళాకి దారెటు. జేబుల్నిండా దండిగా సిగరెట్లున్నాయి, లైటరుంది.

కాసేపు అక్కడే కూచుని ఆలోచిస్తున్నాడు కుమార్రాజా. ఆలోచనా లోకంలోంచి అసలులోకానికి రాకపూర్వమే ఎదురుగా బుసలుకొడుతోంది త్రాచుపాము. అప్ర

యత్నంగా లైటు వెలిగించారు కుమారరాజా. త్రాచు పాము బుస మరింత ఎక్కువైంది. కస్‌మని లేచి కాటువేయ బోయింది. ముట్టె గురితప్పి నేలకి కొట్టుకున్నది కుమారరాజా ఒడిసి తోక ఎడంచేత్తో పట్టుకుని, కుడిచేతిని పడగమీద వుంచి గట్టిగా పట్టుకున్నారు. ఫెడేలుమని చెట్టుకి కొట్టారు. పడగ ఫట్‌మంది. బట్టల్నిండా రక్తం చిందింది. నల్లని చీకట్లో ఎర్రని నెత్తురు. నాగుపాములకి తమజాతి శత్రు కూటంలో వాళ్లు.

కుమారరాజా గుండె దడదడలాడింది. ఒక్కవూపులో మూడుగజాలుదూకి పరుగెత్తుకెళ్లారు. నురగలుకక్కే గుర్రంలా ఎక్కడికి, ఎటూ తెలియని చోటికి ఆయాసంతో పెదాలు, పీక బిగదీసుకు పోయినయ్యి. రాత్రి రెండింటివరకూ పరుగెత్తుతూ పోతూనే వున్నారు. కాళ్ళు తేలిపోతున్నాయి. ప్రాణాల్తో చెలగాటమాడే కుమారరాజాకి మొట్టమొదటి సారిగా ప్రాణభయం.

ఎక్కడో దూరంలో లైటు సన్నగా వెలుగుతూన్నది. అటువైపుకి లైటుకన్పించాక కొంతదూరం నడిచారు. ప్రాణానికి ముప్పంరాదు అనుకున్నారు. చెరువుగట్టు దాటి, వూళ్లో కాలుబెట్టారు. తూలొచ్చింది. పడిపోయారు_ అంతే.

రెండురోజులవరకూ స్పృహలేదు స్పృహవచ్చి ఈ లోకంలో పడ్డాక ఆయన చూసుకున్నది ఏమీలేదు. పట్టు పరుపుల్లో పండుకునే కుమారరాజా నవారు మంచంమీద ముతక దుప్పట్లో దొర్లుతున్నారు. ఇప్పుడిప్పుడే గతాల

స్మృతులు పెనవేసుకుంటూ దొర్లుకొస్తున్నాయి. తాను సామాన్య మధ్యతరగతి యింట్లో వున్నారు..

ఇక్కడ గౌరవాలకి ఆయన పొంగిపోయారు. ఈఇంట్లో మట్టిలోపుట్టిన మాణిక్యంవుంది. ఆవిడే సుచేలాదేవి. గౌరవాలకి కలిమే కానక్కరలేదు; కలిమిడివుంటేచాలు_ అనేది ఈయింట్లో నిరూపించబడిన ప్రత్యేకత. కుమారరాజా హృదయాన్ని సుచేలాదేవి దొంగిలించింది. ఈపిల్ల రాణీ గావటానికి అర్హురాలు అనిపించిందాయన కప్పుడు.

సామాన్యమైన సుచేలాదేవి యిప్పుడు ఒక జమీందారీకి యజమానురాలు. ఇంతవరకూ పెద్దరాణి చేతిలో ఆలనా పాలనా లేని ఈ జమీందారీ ఫాయిదాలు తారుమారైనాయి. ప్రజల నైతికస్థాయిని ఆవిడఅర్థం చేసుకున్నది. లోకంఅంటే తెలియని ఈగ్రామీణ ప్రజల జీవితాల్లో వసంతాన్ని రప్పించింది. దివాను దౌర్జన్యాలని ఆకట్టింది.

కుమారరాజా జీవితం మెరుగులు దిద్దుకున్నది. అన్ని సంస్కరణలూ వచ్చిపడినయ్. శాపులు మరమ్మత్తు చేయించింది. శిస్తు ఇంతా_అని శాసించింది అన్నిటినీ మార్పు చేయించిన ఈ రాణీ ఒక్క సంస్కరణమాత్రమే చేయించాల్సివుంది యింకా. ఈమార్పు "చినరాజా"___

ఈ రసికరాజుని ఎలా లొంగదీయాలో సుచేలాదేవికి అర్థంగాలేదు. "ఒక్క క్షణంలో తారుమారుగావల్సిన ఈ చరిత్ర మరోక్షణంవరకూ పొడిగించబడటానికి కారణాలు" యిదమిద్ధంగా నిర్ణయించబడటానికి వీలులేనివి.

కానీ చినరాజాకి ఒక్కటితెలుసు, ఒకమహత్తరమైన

శక్తి చెప్పుచేతల్లో ఈ రాజరికం ప్రస్తుతం నడుస్తోంది. దివాను అధికారాలు అంతరించిపోయినయ్యి. ఈ దివాను నామమాత్రుడైన నిమిత్తమాత్రుడు. ఇతని అహంకారం దీపపు కాంతిలో చీకటిలా చెదిరిపోయింది. సుచేలాదేవితో ఇంత వరకు రెండుసార్లుమాత్రమే మాటాడాడు. ఈ రాణితో మాటాడాలంటే చాలా జాగ్రత్తగా తూచి తూచి మాటాడాలనేది చినరాజా స్వానుభవంతో తెల్సుకున్న విషయం.

మసకమబ్బులు చెదరకముందే, తూర్పుమేఘాల్లోంచి కాంతికిరణాలు దూసుకురాకముందే, మంచుముత్యాలు పగిలీ పగలకముందే; చినరాజా మేడమెట్లుఎక్కి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు ఇవ్వాళ ఎలా అయినా రాణీగారితో మాటాడాలి. తనకి అర్జెంటుగా పాతికవేలు కావాలి. లేవు అన్న పక్షంలో భాగాన్ని పంచమని అడుగుతాడు. తనతాడ్రి స్వార్జితంలో కుమారరాజా కెంతభాగంవుందో తనకీ అంతే వుంది—

బాగా తెల్లారింది. దివాణం నిద్రమత్తు విరిగిపోయింది. అందరూ లేచి తమతమ కార్యక్రమాల్లో నిమగ్నులౌతున్నారు. సుచేలాదేవి లేచి చూసింది. మరిది తనగదిముందు పచార్లు చేస్తున్నారు.

సుచేలాదేవి రాచరికపుమర్యాద ప్రకారం తలమీదికి మేలిముసుగు సవరించుకుని, లేచి నిలబడింది. చినరాజా లోపలికి వెళ్ళాడు. కాసేపటి వరకూ నిశ్శబ్దం తాండవించింది. సుచేలాదేవి దాసీనిపిల్చి, మరిదిగారు వచ్చిన కారణమేమిటో కనుక్కోమన్నది.

"నాకు డబ్బుకావాలి"—

"ఎంత?"

"పాతిక వేలు"—

"అంత డబ్బెందుకు మరిదిగారూ" అన్నది మహా రాణి.

చినరాజా ఎన్నో మాట్లాడదామనుకున్నాడు. కాని సుచేలాదేవి ముఖం చూచాక మరి మాట్లాడ చేతకాలేదు. సుచేలాదేవి గంభీరస్వరం నెమ్మదిగా చినరాజా చెవుల్ని తాకుతోంది. "చూడండి మరిదిగారూ, ఒక్క విషయం స్పష్టంగా చెప్పడం నా బాధ్యత. ఆ హక్కును ఎవరు యిచ్చారనేది - నేను ఎంతవరకు వినియోగించుకున్నాననేది, వేరే విషయం. మీకు పాతిక వేలు యివ్వడంలో నా కభ్యం తరం లేదు. కానీ, దాన్ని మీరు ఎంతవరకు సద్వినియోగం చేసుకోగలుగుతున్నారు అనే ప్రశ్న మీకే రావడం మంచిది. వయస్సులో చిన్నదాన్నయినా, వదినగా మీ కన్నా పెద్ద దాన్ని బీదతనంలోంచి పైకొచ్చినంతమాత్రాన, ఈ జమీం దారీమీద నియంతలా అధికారాన్ని చెలాయించుకోవాలనే అభిలాష నాకు ఏకోశానా లేదు.

"మీ అన్నగారికి ఈ జమీందారీమీద యెంతహక్కున్నదో, మీకూ అంతే ఉన్నది. వదినగా మాట్లాడుతున్నానుగానీ, మహారాణిగా మాట్లాడ్డం లేదు. ఇంత ఖరీదుగల బట్టల్ని నేనెన్నడూ కట్టుకోలేదు ఈ పాలరాతి మేడలో మెట్టింటికి రాగలననీ యింత కీర్తినీ ధనాన్నీ సంపాదించిన వారి భార్యను కాగలననీ నేనెన్నడూ అనుకోలేదు ఇలా చెప్ప డంవలన మీ గౌరవానికీ, ప్రతిష్టకి ఏమన్నా మచ్చగలిగి

నట్లయితే, క్షమాభిక్ష నర్థిస్తున్నాను. మీకు డబ్బు ముఖ్యావసరమయితే, అలాగే డబ్బు తెప్పించి యిప్పిస్తాను."

చినరాజా నోరు బిగుసుకుపోయింది. ఒక్క మాటన్నా మాటాడలేదు. దాసీదాన్ని పిల్చి "పదిహేను వేలు చాలని చెప్పు" అన్నాడు. దాసీ సుచేలాదేవికి ఈ విషయాన్ని చెప్పింది. ఆవిడ చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వులో గంభీరమైన భావనవున్నది. మనుష్యుల్ని ప్రేమించగల మహోజ్వలమైన ప్రేమోదాత్తత వున్నది.

ఈ విషయాన్ని కుమారరాజాకి తెల్పితే, "మదగజాన్ని మాటల్తో నేలొంగదీశారా మహారాణీ" అన్నారు. సుచేలముఖం చిరుకోపంతో గులాబీరంగులోకి మారింది.

చినరాజా డబ్బుతీసుకుని, ఆ రోజే యెక్కడికో వెళ్ళారు. ఎక్కడికి వెళ్ళారో యెవ్వరికీ తెలీదు. సుచేలాదేవి అధికారంతో ఆ దివాణమే కొత్త గంభీరాన్ని, ఆనందాన్ని సంతరించుకున్నది. విధివశాత్తు లీల యిక్కడికి చేరుకున్నది. ఆ మె నిండా దుఃఖపు కెరటాలు ప్రవహిస్తున్నాయి. సీలాటి రేవు కెళ్ళే పెద్దముత్తైదు పోకాను లీలని "ఎందాక?" అని ప్రశ్నించింది. లీల ఏడ్వటం తప్ప ఏమీ సమాధానం చెప్పలేకపోయింది.

లీలని రాణీ సుచేలాదేవిగారింటికి తీసుకొచ్చి దిగబెట్టి వెళ్ళిందావిడ ఉన్నదంతా పూసగుచ్చినట్లు చెప్పింది. రాణీగారు అడిగారు "ఎవరమ్మా నీవు". దానికి సమాధానం "అనాథ" అని తెలిపింది. దాంతర్వాత సుచేలాదేవిమాటల్తో లీలని ఏమీ బాధించలేదు అప్పట్నించీ, సుచేలాదేవి అంతరంగిక చెలికత్తెగా లీల నియమించబడింది.

కాలం తనలో కలుపుకుంటున్న మార్పులతోపాటు, విధివిధానాన్ని నిర్ణయించింది ఈ నిర్ణయాలు మానవజీవితానికి దగ్గరగా సంబంధించినవి. కట్టుబాట్లని నిర్ణయించిన ప్రకృతి–ఖచ్చితమైన "కట్టడాల్ని" కూడా శాసించింది. ఇవి అతిక్రమించడానికి వీలులేనివి.

ఈఅంకంలో చివరిభాగంలోవచ్చినలీలా దేవి, సుచేలా దేవి ఆతంరంగికంలో నైనా బాగుపడుతుందేమో? లేదా చిన్నప్పటి నుంచీ దైవం చిన్నచూపు చూస్తూవచ్చాడు—ఇప్పుడూ అలానే జరుగుతుందేమో? కదలిపోయె "కాలవాహిని"

# 4

ఇది మద్రాసు మహానగరం. ఇక్కడ సంజెరంగులు వ్యాపించుకున్న మత్తు ఇంకా యిక్కడ, మాయ మబ్బులు విడివడలేదు ఇక్కడ విలాసినులకూ, విలాసాలాకు లోటు లేదు. లాడ్జింగులకీ, లలనామణులకీ పెట్టింది పేరు. మనుషుల్ని మార్చేవాళ్ళు మొదలు మంచాలువేసేవాళ్ళవరకూ యిక్కడ దొరుకుతారు. పెద్ద సినీస్టార్స్ మొదలు ఎక్స్ట్రా యాక్టర్ల వరకూ వెదకనక్కరలేకుండా యిక్కడ లభ్యమౌతారు. ఇది చిత్రమైన నగరం. దేహాల్ని, తివాచీల్లా పరిచి, మానాభిమానాల్ని విచ్చలవిడిగా అమ్మి యిక్కడ పెద్ద స్టార్సయినవాళ్ళు, కళని అడ్డంపెట్టుకుని, ఖరీదయిన చీరల

వెనక కంపు దేహాల్లో బ్రతుకుతున్నారు. కొంతమంది పవి త్రులూ వున్నారు.

జగన్నాథ బాబుకి బోలెడంత ఆస్తివుంది. రాజమండ్రి దగ్గర ఏదో పల్లెటూరు. లక్షలకి లక్షలు విచ్చలవిడిగా, పెట్టెల్లో మూల్గుతున్నాయి. సినిమా తీద్దామని, మద్రాసు వచ్చి చేరాడు. ప్రసాదరావూ, జగన్నాథబాబూ బెజవాడ కాలేజీలో కొంతకాలం చదువు వెలగబెట్టారు. ఒకరోజు నలనుకోకుండా "దాసప్రకాష్" లో కల్సుకున్నారు.

ప్రసాదరావు జగన్నాథబాబుని యింటికి ఆహ్వానించాడు. సినిమా తీద్దామనే ప్రయత్నాలు చురుగ్గా సాగుతున్నాయి. హీరోని యెవర్ని వెదుక్కోవాలా అనేది, యింకా నిర్ణయం కాలేదు. హీరో కుర్రవాడుగా వుండి వుండాలి. కథలో కష్టపడి అక్కని బ్రతికించుకుని, ప్రయోజకుడవ్వాలి. కథ మంచిదే. రచయిత కష్టపడి రాశాడు. మరి దానికి తగిన కుర్రవాణ్ణి వెదుక్కోవాలి. ఆంబోతుల్లాంటి హీరోలు, పెట్రోలు బేరల్సులాంటి అమ్మాయిల్ని ఎన్నుకోవడం ఈ నవనిర్మాతకి యిష్టం లేదు.

హీరో హీరోయిన్ల వేట మొదలయ్యింది. సాయంకాలం నాలుగంటలకి ప్రసాదరావుగారూ, జగన్నాథబాబూ కలసి యింటికొచ్చారు. ఆ సమయంలో విశ్వం, వసంతా జగన్ గారింటి కెళ్ళారు. అట్నించి 'స్టార్' లో సినిమాకి వెళ్దామని ప్రోగ్రాం ప్రపోజలు వుంది. వెళ్ళినా వెళ్ళొచ్చు; లేదా, తిరిగి రానూవచ్చు.

ఆ రాత్రి తొమ్మిదింటివరకూ జగన్నాథబాబు వుండి వెళ్లిపోయాడు. పదింటి ప్రాంతంలో వసంతా, విశ్వమూ వచ్చారు ప్రసాదరావుగారి నంటుకుని ఆలేషియన్‌కుక్క పడుకుంటుంది. ఇదీ యివ్వాళ రివాజుతప్పకుండానే కళ్ళు మిటకరించి మరీచూస్తోంది.

ఆరాత్రి భోజనాలు సరదాగానే జరిగిపోయినాయి. విశ్వం, వసంతా కేరింతాల్లో పదకొండుగంటలు కంగు మన్నాయి. ఇద్దరూ నవ్వుకుంటూ పడుకున్నారు. వీళ్ళిద్దరికీ లోకం అనుకునే బాంధవ్యం దాదాపు భార్యాభర్తలనే— కాని, నిజానికి ఇంతవరకూ వాళ్ళిద్దరికీ శరీర సంబంధమైన కాంక్షలంటూ ఏమీలేవు. లోకం ఏమనుకున్నా లక్ష్యం లేదు. అసలు ఈ మద్రాసునగరంలో యిలాంటివి పట్టించు కునే తీరిక ఎవరికున్నదిగనక—

ఇంతవరకూ జరిగినదాన్ని ఒక్కసారి స్ఫురణకి తెచ్చు కుంటే, చాలా ఆశ్చర్యం కల్గుతోంది. ఇలా జరుగుతుందా అంటే, జరగ్గూడదనే 'హామీ' లేదుగదా. అంతదాకా ఎందుకు? విశ్వం యిక్కడ స్థిరనివాసాన్ని ఏర్పరచుకున్నాడు. లీల ఎక్కడికో చేరిపోయింది. చిన్నపాపని సుమిత్ర పెంచు తోంది—ఇలానేగదా ప్రవహించిపోతోంది కాలవాహిని.

"ఒక్కరాత్రి" జగన్నాథబాబుచే విశ్వం అదృష్టం ధృవతారలా భాసించే సమయం వచ్చింది. బృహత్తర కథా నికల్లోని రాజకుమారులకుమాత్రమే యిలాంటి అదృష్టాలు పడతాయిగాబోలు. జగన్నాథబాబు విశ్వాన్నిచూసి 'యిత

నెవ్వరు' అని సందిగ్ధంలోపడ్డాడు. ప్రసాదరావు పరిచయం చేశాడు. 'విశ్వం' అని. 'మావాడే. వరసకి మేనల్లు డౌతాడు' ఇలా పరిచయం చేయడంలో ఎంత నిగూఢమైన ఆపేక్ష వున్నది!—

జగన్నాథబాబూ, ప్రసాదరావూ రాత్రి చాలావరకు మాటాడుకున్నారు. "ఇంత అందగాడు మీయింట్లో వున్నాడని నాకెందుకు తెలియనియ్యలేదు. నేను యితన్ని నా పిక్చర్లో హీరోగా బుక్ చేసుకుంటాను. మీకేం అభ్యంతరం లేదుగదా?"

ప్రసాదరావు నిజంగా ఆశ్చర్యపోయాడు. ఆనందంతో ఆయన హృదయం ద్రవించిపోయింది "నిజమా?"—అన్నా రాయన. జగన్నాథబాబు నవ్వి "మరి అబద్ధమనుకుంటు న్నావా? ఏమిటి?" అన్నాడు.

ప్రసాదరావుగారు ఈమాట చెప్పగానే, నిశ్చేష్టుడయ్యింది విశ్వం. గానీ, ఆనందంతో నాట్యంచేసింది వసంత. విశ్వం అదృష్టం విరగబడినవ్వే సమయం వచ్చింది. ఇంతకన్నా కావాల్సిందేముంది - వసంత, విశ్వం వెనగ్గావచ్చి భుజం మీద గడ్డంఆన్చి, జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి, ఆప్యాయతతో నిమిరింది.

ఆనందంలో మండుటెండకూడా, తెలితెమ్మెర గాలులు వీచే పాలవెల్లి తరగల లేతచంద్రికలా భాసిస్తుంది. జీవితంలో అదృష్టం వరంగా పొందిన పుణ్యపురుషులకుగానీ మధుర క్షణాలు మలయానిలాల్లా పల్కరించవు. సుమసుందరులు

నెచ్చెలికత్తెలై గానీ యిచ్చకాలాడరు. నిజం. అదృష్టాన్ని అందిపుచ్చుకున్నవాళ్ళకిగానీ, యీ అగాధ కాలవాహిని గట్టున విరిసెవపూలు పూచి కంఠాభరణంలా చిరునవ్వుల మురిపాల్లో తీయని గానాన్ని ఆలపించి జోలపాడవు. చంద మామకన్నా ఈ విశ్వం సొగసైనవాడు. జాబిల్లికన్నా నిర్మ లుడు. పలుకులో పులకలుకురిపించే ఈ విశ్వం ఒకనాటికి విశ్వాన్ని జయించగలడేమో, ఎవరుచూడొచ్చారు—

జగన్నాథబాబుగారు సినిమా ప్రయత్నాలు ఈనా టికి ఒక కొలిక్కివచ్చిన మాటమాత్రం నిజం. రేణుక అనే ఒక అమ్మాయిని హీరోయిన్‌గా బుక్ చేశారు. పదెనిమిదేళ్ళ కన్నా ఎక్కువవుండని ఈ కుమారికి, భవిష్యత్తు ఏనాడో వెన్నెలమెట్లు కట్టినట్టుంది. జీవితం ఈవిడకి విలాసవస్తువు.తన అందంతో లోకాన్ని మురిపించింది. ఆకర్షణతో జీవితాన్ని జయించింది. సినిమా చరిత్రలో నటిగా కొన్ని అధ్యా యాల్నే సృష్టించింది.

అందమేకాదు - అన్నిటిలోనూ తళుకుబెళుకుల్లోనూ, యువక హృదయాల్లో తీయనితీపుల్ని రేపించింది. అదృష్టం ఈవిడకి చెలికత్తెగ్గాబోలు, ప్రతి పిక్చరూ శతదినోత్సవాల్ని చూసింది.

పెళ్ళిచేసుకుంటే బావుండును అని చాలాసార్లు అన్పించింది. ఈ మాయజగత్తులోంచి తిరిగ్గా విశ్రాంతి లభించే రోజు ఏనాటికైనారాదా? వచ్చినప్పటికి వస్తుంది. పదకొండో ఏట చిన్నపిల్లవేషాలు వేయడానికి సినిమాల్లో

ఖ్యాన్నిపొందింది. పదమూడోఏట పెద్దమనిషయ్యింది. అన్ని సుఖాల్నీ అనుభవించగల వయస్సు వచ్చింది. కానీ, ఈనాటి వరకూ నీతితప్పలేదు. సినిమాల్లో, పరాయిపురుషుల్ని కావిలించుకుంటే, స్పర్శతో శరీరం పొంగిపోయేది. తియ్యని విద్యుత్తు నర నరాల్ని బాధించేది. అంతవరకే ఆ హద్దు. ఆమెకి అంతవరకే పరిమితమయ్యింది.

తాను 'వ్రూ' .అంటే ఒక్క-రాత్రికి కొన్ని వేలు యివ్వగల లక్షాధికారుల్ని కాలితో నెట్టేసింది. కడుపు గడవక, తాను ఈ 'చిత్ర' జగత్తులో కొచ్చిపడింది. తనకోసం కాదు ఈ ఆనంద సంపాదన? తన తలిదండ్రులకోసం. తన సంపాదనమీద ఆధారపడి సిల్కు-బట్టలు సింగారించుకుని షోగ్గా తిరిగేవాళ్ళకోసం – ఒకోసారి అన్పిస్తూండేది. ఒక్క-శరీరవాంఛతప్ప ఈ జీవితంలో యింతకన్నా పొందగల్గింది యింకేమీ లేదు. నాకు అదీ అక్ఖర్లేదు. యిక్క-డవుంటే చివరకు పతనంతప్ప యింకేమీ మిగల్దేమో? ప్రతి క్షణమూ ఈ తుచ్ఛఅలంకారాల్లో, గాలిబుడగల్లాంటి పగలడానికి సిద్ధంగావున్న హృదయంతో, ఎంతకీ అర్థంకాని అగాధమైన మానవ మానసిక వికాసంతో, తుచ్ఛ చీకటిజీవితాన్ని వెన్నెల్లా భ్రమించే, ఈ సుఖదుఃఖాల్లోంచి, ఈ భవ బంధాల్లోంచి. తీరిగ్గా విశ్రాంతి లభించే తీయని అదృష్టం లభించే సమయం ఏనాడన్నా లభించగలదా!

ప్రతిమనిషీ, ఈ జీవనయాత్రాపథంలో అడుగు వేయలేని భయంకర సమయం ఆసన్న మౌతుంది మానసికమైన, మానవ బలహీనత నర నరాల్ని కాల్చి నుసిచేస్తుంది

దుఃఖంలాగానే, సుఖంకూడా ఒక్కోసారి వెగటుకల్పిస్తుంది. ఎందుకు దుఃఖం కలుగుతుంది. సుఖం ఎక్కడ లభ్య మౌతుంది. దీన్ని అన్వేషించి సామ్రాజ్యాన్ని, భార్యా బిడ్డల్ని, భవబంధనాల్ని తెంచుకున్న బుద్ధుడైన సిద్ధార్థుడుకే జవాబు అంతుచిక్కలేదుగదా?

కెమేరా ఆన్ చేసిన మొదటిరోజు వుదయం జగన్నాథబాబుగారు అందర్నీ విందుకు ఆహ్వానించారు. విశ్వమూ, వసంతా చిన్నకార్లో బయల్దేరారు. జగన్, సుమిత్రా, ప్రసాదరావుగారు తర్వాత బయల్దేరి స్టూడియోకి చేరారు.

విశ్వాన్ని అందరూ వింతగా చూశారు. ఎలా గయినా కొత్తనటుడామెను! జీవితాన్ని జయించడానికి ముందు మానవుడు స్వేచ్ఛకి లొంగిపోతాడు. బహిరంగంగా తీర్చుకోలేని ఆనందాలూ, కాంక్షలూ హృదయంలోనే సుడులుతిరుగుతూ వుంటాయి. సహజమైన ప్రకృతి నిర్ణయాలు, మానవుణ్ణి అనాదిగానే బందీ చేసినయ్.

మొట్ట మొదటిసారిగా కెమేరాముందు నుంచున్నప్పుడు శరీరం ఒణికిపోయింది. విశ్వం నిలువెల్లా కంపించిపోయాడు. ముప్పైఅయిదువేలకి కాంట్రాక్టు రాసుకున్నారు.

రేణుకాదేవి ప్రోత్సాహమూ, డైరెక్టర్ సహృదయంతో, విశ్వం నిలదొక్కుకున్నాడు. రషెస్ చూసిన వాళ్లు విశ్వానికి మంచి భవిష్యత్ వున్నదన్నారు. విశ్వానికి సినిమాల్లో ఛాన్సు దొరికిందనగానే 'మదన' నడుము విరిగినంత పనయ్యింది. ఇక విశ్వం తనకి అసలే దక్కడు.

కానీ, ఇప్పుడు జీవితమే తారుమారయ్యింది. విశ్వం గంటా, గంటన్నరకన్నా ఎక్కువసేపు వుండటంలేదు. అది వరకటి ఆనందమంతా చచ్చిపోయింది. ముభావంగా, ముక్తసరిగా మాట్లాడుతాడు. ఇది బలీయమైన బాధ్యత అంటాడతను. అంతకన్నా యింకేం అనగలడు?—

వసంత వాంఛించింది యిలాంటి జీవితం కాదుగదా. ఆనందం తనకి లభ్యంకావాలని వువ్విళ్లూరింది. ఇంతవరకూ వసంత హృదయంలో ప్రేమ మోసులు వెయ్యలేదు. విశ్వం యింతవరకూ బీదవాడు. ప్రపంచంలో ఎక్కడా స్థానంలేదు. కానీ యిప్పుడు అదృష్టసుందరి విశ్వాన్ని కౌగలించుకున్నది. ఇంకా రెండుమూడు పిక్చర్సలో విశ్వానికి కాంట్రాక్టు పూర్తయ్యింది. ఒక్క సినిమాకి కొన్నివేలు సంపాయించగల తాహతున్నది.

మానవుడి మనస్సు చంచలమైంది. ఈక్షణంలో నిల్చిన ఈశరీరం మరోక్షణంలో వుండటానికి ఎలా నమ్మకం లేదో, ఇప్పుడున్న మనస్సు అప్పటికి వుంటుందనటం హాస్యాస్పదం. ఈ మానవమృగాల సంబంధం అసహజతతో, కుత్రిమతో కప్పబడి వున్నది. ఈ చిత్రమైన, కప్పును బద్దలుకొట్టడానికి వీల్లేదు.

ఈ జీవితానికి ముఖ్యమేదో, ఎంతవరకో నిర్వచించడం ఎవరి తరమూ కాలేదు. నిర్వచించడానికి ఎవరికి వీలవుతుంది? ధనం కన్నా మోహం ఘనం అన్నది. మోహం పశువృత్తికి తార్కాణమూ అనుకుంటే – యిలాంటివాళ్ళు జగదేక సుందరులనుకూడా గుడ్డిగవ్వలక్రింద భావిస్తారు. ఆరా

ధించాల్సిన అందగత్తెల్ని అందవిహీనలుగా భావించే అంధాధముడు_నికృష్టుడు. లలాటాన వ్రాసినదాన్ని చెరపడం ఎవరి తరమూ ఎలాకాకుండా పోతుందో, మనసులో పడిన మోహ ముద్రనికూడా చెరపటం అంతేఅని భావన.

ఇప్పుడు వసంత హృదయంలో చెలరేగే సంక్షోభత-వానగాలి హోరులాంటిది. విశ్వం యవ్వనపు పొంగులో తప్పు చేయవచ్చు. ఈ చిత్రజగతిలో మరొకరి ఆకర్షణ కయినా లొంగిపోవచ్చు. అంతమాత్రాన చెడ్డవాడనికాదు. కానీ, తనకి దక్కకపోవచ్చు. అంతేమరి, ఈ జీవితం తనకి కాకుండా పోతుందనుకున్న రోజున, మానవుడు విలవిల్లాడ తాడు. మారుమూల పల్లెటూరి గుళ్ళో దేవుణ్ణి ఒక్కసారన్నా ఆరాధించలేనివాడు తిరపతి వెళ్ళడంవల్ల ప్రయోజనం లేదన్న నగ్నసత్యాన్ని ఎంతమంది గుర్తిస్తున్నారు, అదీ ఇలాంటిదే.

విశ్వం రాత్రి ఎనిమిదింటికి యింటికొచ్చాడు. స్టూడియోకారు వచ్చి దించిపోయింది. కారు హారను విని బైటకొచ్చింది వసంత. అందులోనే రేణుకూడావుంది రేణుక టాటా చెప్పడాన్ని తను చెవులారా విన్నది ఈర్ష్యతో కళ్ళ ల్లోంచి నీరు బుగ్గలమీదికిజారి యింకిపోయినయ్.

విశ్వం భోజనాని కూర్చున్నాడు. వసంతేస్వయంగా వడ్డించింది. ఇందులో ఆప్యాయతలేదు, అనుమానం వున్నది. విశ్వం పసికట్టాడు. అవును. వసంతలో ఏదోచిత్రమైనమార్పు వచ్చింది!

"వసంతా"___

"వూఁ..."

"ఇవ్వాళ అదోలావున్నావు"

"లేదు, బాగానే వున్నాను."

విశ్వం యింకా మాట్లాడలేదు. మితభాషి అయిన విశ్వం, ఇంతకన్నా ఎక్కువ మాట్లాడలేదు. వసంతకి అనుమానం వేసింది. మనిషి మంచిగావున్నప్పుడు ఏమీ స్ఫురించని అనుమానాలు, తనకాకుండా పోతాడన్నప్పుడు మనస్సును పీల్చి పిప్పిచేస్తాయి. ఇంత స్థానాన్ని కల్పించిన విశ్వం హృదయంలో తనకి స్థానం లేకపోతుందా?

రాత్రి పదింటికి స్టూడియో కెళ్ళాలి. ఇవ్వాళ చిత్రీకరించబోయేది పతాకసన్నివేశం. ప్రియుడి చేతుల్లో ప్రియురాలు ఉంటుంది. ఇది (సినిమా) కథలో అక్కకి యిష్టం వుండదు. ప్రేమించిన ప్రియురాలు, తనని యింతవరకూ కష్టపడి పెంచిన అక్క. వీళ్ళిద్దరిమధ్యా నలిగిపోయే, కథానాయకుడు.

విశ్వం మళ్లీ బట్టలు తొడుక్కుంటున్నాడు వసంత ముభావంగా వూరుకున్నది. గుండెల్లో రాజి రగిలే అగ్నిజ్వాలలు సంగతేమిటి? ఎంత దాచుకుందామన్నా ఎక్కిళ్ళు ఆగలేదు. అవి విశ్వం చెవుల్ని తాకినయ్యి. ఒక్కసారి వెనక్కితిరిగాడు. 'వసంతా' అన్నాడు. చిరుగాలి కంపనాని కూడా కంపించే వసంత హృదయం ఏడ్వటంతప్ప ఏం చేయగలుగుతుంది?

"వసంతా ఏడుస్తున్నావా? ఎందుకు ఏడుస్తావ్" అన్నాడు. దానికి ప్రతిఫలంగా వచ్చే జవాబు వసంత కారే

కన్నీళ్ళలో వుంది. అయితే, యిది విశ్వానికి ఎలా అర్థమవుతుంది?

ఏమిటిది భగవాన్? వసంత యెందు కేడుస్తుంది? విశ్వం అప్రయత్నంగా వసంతను సమీపించాడు. రెండు చేతుల్తో ముఖాన్ని పైకెత్తాడు. తనవైపుకు తిప్పుకున్నాడు. కాటుక కళ్ళల్లోంచి కారే, వెచ్చని నల్లటి కన్నీరు.

"వసంతా, సమాధానం చెప్పవా? చెప్పవా వసంతా? దీనికి సమాధానం చెప్పడం నీ కిష్టంలేదా? నీ మనస్సుకి ఏమన్నా బాధకల్గించానా? నీకేం జరిగింది?"

"అన్యాయం"

"అన్యాయమా?

"ఔను"

"ఎవరు చేశారు?"

"మీరు."

"నేనా! నేనా వసంతా; నీ కన్యాయం తలపెట్టిన వాణ్ణి?" దిగ్భ్రమ విశ్వంచుట్టూ తిరిగిపోతోంది. గుండె దడలో రోకటిపోటుల్లాగా! "నేను ఎలాంటి తప్పుచేశాను వసంతా! చెప్తే, దాన్ని సరిదిద్దుకోవడానికి, నాకేం అభ్యంతరం లేదు ఆశ్రయమిచ్చినవాళ్ళ పీకల్ని తప్పించడం నేను నేర్చుకోలేదు."

"మిమ్మల్ని హృదయపూర్వకంగా ప్రేమించాను. నా హృదయంలో మీకుతప్ప యింకెవ్వరికీ స్థానం లేదు. కాని మీ హృదయంలో నాకు చోటులేదు. నాకు స్పష్టమైా

తూనే వుంది. నా కళ్ళతో నేను చూశాను. మీరు ఎవర్నో కార్లో యెక్కించుకొచ్చారు. నాకు ఎంత సంస్కారంవున్నా ఆడదాన్ని. నాకు ఆత్మగౌరవం వుంది. తన ప్రేమించిన మనిషి, యింకొకరివశం అవుతుందంటే ఏ ఆడదాని అంత ర్యమూ యెదురుతిరక్కుండా మానదు" వసంత ఆగినా ఏడుపు ఆగలేదు.

విశ్వం యిప్పుడే ఈ లోకంలో కొచ్చాడు. "పిచ్చి వసంతా, ఇదా నీ భయం. ఈ జీవితంలో ప్రతి క్షణమూ నిన్నే ఆరాధిస్తాను. నా భవిష్యత్ కి మెట్లు కట్టింది నీవు. నీవుతప్ప ఈ హృదయంలో యింకెవరికీ స్థానం లేదు" అప్ర యత్నంగా, అతని చేతులు వసంత నడుంచుట్టూ పెనవేసు కున్నాయి. పెదాలు కన్నీటితో తడిసిన బుగ్గల్ని స్పృశించి నాయి. వెచ్చని పెదాలకి ఎండిన కన్నీటి వుప్పదనం. అంతే, ఏంజరిగిందో చెప్పనక్కరలేదు. రెండు ప్రాణులూ తియ్యని వేదనని అనుభవించినాయి. ఇలాంటి మహోజ్వల మైన మధురక్షణం జీవితంలో ఇంకోసారిరాదు. ఈ ప్రేమదీపం ప్రపంచంకన్నా అతీతమైనది. దీనికున్నంతశక్తి గంభీరసాగ రకన్య ప్రళయఘోషక్కానీ, పిడుగులరాపిడికి రాలే నిప్పు రవ్వలగ్గానీ, పైకి పగిలి, లావాద్రవాల్ని వెదజల్లే అగ్ని పర్వతానిగ్గానీ, నెపోలియన్ కన్నులో భయంకరత్వాని క్కూడా లేదు. ప్రేమ జీవితాన్ని బంధించింది. జీవితం ప్రేమోద్దీపనంవల్లనే ప్రకాశించి, సర్వమానవ జీవితానికీ నివాళినర్పిస్తోంది. 'ప్రేమ' లేనిరోజున ఈ 'ప్రపంచం' వుండేదికాదు. ఈ ప్రేమ కొన్ని క్షణాల్లో విశ్వజగత్తును

యెంత మోహింపజేసిందో, ఇంకా కొన్ని క్షణాల్లో విల
యాన్ని కూడా అంతే తెచ్చిపోసింది. ప్రేమ యెంత తీయ
నిదో-అంత భయంకరమైంది.

ఆవరించుకున్న అనుమానపు తెరలు ప్రేమ వేడికి
విడిపోయినాయి. వసంత అనుమానం పటాపంచలయింది.
పొరపడింది తానే, విశ్వం తనవాడే.

ఇంతలో బైట కారు హారన్ విన్పించింది. తీయని
వేణుగానంలో అపశృతిలాగా నిర్మల, నిశ్చలోదకంలో -
రాతిబెడ్డ సవ్వడిలాగా. లోపలికి ఆహ్వానించాడు విశ్వం
రేణుకని. పరిచయం చేశాడు ఒకరికొకర్ని.

వసంత, రేణుక కంఠంలో మంచి తియ్యదనమున్న
దని గ్రహించింది. రేణుక కంఠంలో మృదుత్వమున్నది.
నిగ్రహమున్నది. నవ్వులో మనుష్యుల్ని ఆకట్టుకునే మెత్తని
పదునున్నది కంటిరెప్పల్లో యువకులికి కావల్సిన తన్మ
యత వెదికితే దొరుకుతుంది. అయినా విశ్వం తనవాడే అని
కొన్ని మధురక్షణాల క్రిందటే స్పష్టమయ్యింది.

రేణుక అనుకున్నంత, వసంత వూహించినంత
చెడ్డగా ఏమీ కన్పించలేదు. రేణుకలో సంస్కారంవుంది.
మహోజ్జ్వలమైన శక్తివున్నది. అందుకే యింతవరకూ నిల
దొక్కుకోగలిగింది.

తొమ్మిదీనలభైకి, రేణుకా, విశ్వమూ బయల్దేరారు.
రేణుక స్టూడియోకి రమ్మని వసంతని బ్రతిమలాడింది ఐనా
వసంత ఆంతర్యం దానికంగీకరించలేదు. కారు బయల్దేరింది.
వసంత గాఢంగా నిట్టూర్చింది. ఆ నిట్టూర్పులో ప్రపంచాన్ని

జోకొట్టగల ఉదాత్తత వున్నది. శాంతినదిలాంటి గంభీరత వున్నది.

హీరో, హీరోయిన్ కోసం అంతా అక్కడ వేయి కళ్ళతో ఎదురుచూస్తున్నారు. మళ్ళీ వీళ్ళ రాకతో స్టూడియోలో సంచలనం బయల్దేరింది. రచయితగారు యిప్పుడే దస్త్రాన్ని సర్దుకుంటున్నారు. నిద్రమత్తులోంచి యిప్పుడే కళ్ళు భరించలేనంత లైట్లకాంతిని చూస్తూ, ఒళ్ళు విరుచుకుని, చిటికలువేస్తున్నారు. శ్రీమూర్తి కెమేరామేన్ గారు హడావుడి 'పతాక' సన్నివేశానికి పతాకస్థాయి నందుకున్నది. 'సైలెన్స్' అనే కేకలు సైలెన్స్‌ని భగ్నంచేస్తున్నాయి.

ఇది ప్రేమసీమ. చక్కని కొలనిగట్టు ఎలక్ట్రిక్ చందమామ. అట్టమేఘాలు. చుక్కలు. కలువపూలు కృత్రిమతో అందాన్ని సంతరించుకున్న స్టూడియో. హీరోయిన్ పరుగెత్తింది. హీరో వెంటబడ్డాడు చెంగు లంకించుకున్నాడు. నవ్వుంచుట్టూ చేతులువేశాడు. కథానాయకురాలు కలువపూవుతో కొట్టింది. హీరో తన్మయత్వంతో సోగకళ్లు సగం మూశాడు. చెంపా చెంపా కలుసుకున్నాయి. హీరోయిన్ బంగారు తీగల్లాంటికళ్లు - హీరో వెంట్రుకల్ని నిమిరాయి. ఓ. కె అన్నాడు డైరెక్టరు.

అయితే, ఒకటి. రేణుక అదివరకు చాలామందితో నటించింది. విశ్వంలాగా చాలామందిని కావిలించుకున్నది అది నటన. తియ్యగా అన్పించేదికాదు యెప్పుడోతప్ప. కాని యిప్పుడు అలాకాదు, ఇందులో యేదో యింద్రజాలంవుంది.

విశ్వాన్ని కావిలించుకోవడంలో నటనలేదు. అది తనకి నటనలా కన్పించడంలేదు. ఇందులో వాస్తవికతవుంది. ఈ కావిలింతలో హాయి వున్నది. మృదుత్వం వున్నది; సుఖంవున్నది.

విశ్వం నిజంగా అదృష్టవంతుడు. ప్రపంచంలో ఒక్క మగాణ్ణి యింతమంది వాంఛించడం, అదృష్టంగాక మరేమిటి? ఒక్క ఆడదన్నా కన్నెత్తి చూడని దౌర్భాగ్యుల సంగతేమిటి? వసంత విశ్వాన్ని ఆదరించి ప్రేమించింది. మదన ప్రేమించి తనకి అడ్డులేకుండా, వసంతని తప్పించాలనుకున్నది. రేణుక లోబర్చుకోవాలనే వలపన్నుతోంది.

ఎవరికున్న ఘనత వాళ్ళకున్నది. అయితే జరగల ముందు 'వూహా' కాంతి యెంతవరకు ప్రసరిస్తుంది? కాలం నిర్ణయించుతూంది. అవును మరి "కాలవాహిని" ప్రవహించకపోతే ఎలాగా మరి?

జగన్నాధబాబు అనుకున్న దానికన్నా ముందుగానే సినిమా పూర్తయ్యింది. విశ్వం యింకా రెండు చిత్రాల్లో బుక్కయ్యాడు. చిత్రం విడుదలయ్యింది. ఆరోజే, వసంతా విశ్వమూ, ప్రసాదరావుగారు, జగన్. సుమిత్రా అంతా సకుటుంబ సమేతంగా, సినిమా చూసివచ్చారు.

వసంతికి కొన్ని సమయాల్లో రేణుకంటే, విద్వేషం కల్గింది. తన హక్కును రేణుక యిష్టమొచ్చినట్లు వినియోగించుకున్నది. కళ్ళముందు విశ్వం వున్నాడుగదా. తనూ అలాంటి అనుభవాల్ని పొందవచ్చునే. తను యింతకన్నా వున్నతమైన అనుభవాల్నే పొందింది. కాని యింత ఉదా

త్రంగా లేనేమో అన్పించింది. "నిగూఢమైన ఆడదాన్ని ఆంతర్యం".

చిత్రం యింత డబ్బు చేసుకుంటుందని, జగన్నాథ బాబు ఏనాడూ అనుకోలేదు. ఈ చిత్రం ఒక్క డబ్బునే కాదు, తనకి మంచి గౌరవాన్ని తెచ్చిపెట్టింది. విశ్వం ఫోటోలు పత్రికల్నిండా ప్రచురితమైనాయ్. ఉత్తమ నటుడన్నారు పాత్రని అర్థం చేసుకోనడంలో సినిమా చరిత్రలో కొత్త అధ్యాయం విశ్వంతోనే ప్రారంభమైందన్నారు. మామూలుగా అల్నుంచీ అభిమానుల వుత్తరాలు శరపరంపరలు వచ్చిపడ్డాయి.

లోకంలో సగంమందికి యిప్పుడు విశ్వమంటే ఎవరో తెలుసు. కాని, అతని గత జీవితం వీళ్ళల్లో ఎంత మందికి తెలుసు! విశ్వానికి గౌరవం ఒక్క సినిమాతోనే పరాకాష్ట నందుకున్నది. ప్రొడ్యూసర్ల రాకపోకలు యెక్కువైనాయి. హితులూ, స్నేహితూలు చాలామంది, పోగయ్యారు.

ఇంకో సినిమాలో తల్లి లేనిబిడ్డగా, విశ్వం నటించాడు. ఈ చిత్రం చిత్రజగత్తునే మురిపించింది. రాష్ట్రపతి రజకపతకం లభించింది. ఎక్కడ చూసినా విశ్వం పేరు, మారుమోగిపోయింది. పరాకాష్టనందుకున్న యీ యిరవై ఏళ్ళ నటుడు ప్రేక్షకుల హృదయాల్ని నలి చిత్రంతోనే దొంగిలించాడు – విశ్వం పే... ద్ద నటుడు అయ్యిందిమాత్రం నిజం.

మానవుడు బాధ్యతల్ని నెత్తిన వేసుకున్న రోజున, సుఖశాంతులకు దూరమౌతాడు. ఆ అశాంతినే శాంతిగా, దుఃఖాన్నే సుఖంగా పరిభ్రమిస్తాడు. ఇప్పుడు విశ్వానికి నిజంగా తీరిక లేదు. అయినా దేన్నీ లెంచుకోలేదు. ఒకో రాత్రి రెండింటికి వచ్చేవాడు. ఒకోరాత్రి అసలు రావడానికే తీరికుండేదికాదు. వసంతకూడా యిప్పుడుదాన్ని పట్టించుకోవడం లేదు. కానీ వచ్చిన ప్రతిసారీ, వసంతని హృదయపూర్వకంగా ప్రేమించేవాడు. తియ్యగా మాట్లాడేవాడు. కావిలించుకునేవాడు. ముద్దుపెట్టుకునేవాడు.

అసలు ఈ జీవితంలో ఎవరికీ 'ఏదో' వుంది. ఆఏదో అనేది సుఖమూకావొచ్చు; దుఃఖమూకావొచ్చు. అదీయిదీ గాక యింకేదైనా కావొచ్చు. లోకంలో మానవుడు పుట్టాక ఏదీ అనుభవించకుండా ఎప్పుడూ రాలిపోలేడు.

కానీ, ఇప్పుడు చాలామందితో పరిచయమయ్యింది. ఈమధ్యనే విశ్వానికి పరిచయమైన అమ్మాయి "బాల" — ఎగ్స్ట్రా యాక్టరుగా బ్రతుకుతోంది. అందంవుంది. కానీ, అందని అదృష్టం ఆమె వెన్నంటి తిరుగుతూనేవుందిగదా. జీవితం పతనమయ్యింది అంటుంది, సహృదయుడైన విశ్వం బాలని ఒకసారి తనజీవితాన్ని గురించి చెప్పమన్నాడు. నిజంగా బాలకి ఆశ్చర్యమేసింది. ఒకపెద్ద ఫేమస్ హీరో, ఒకచిన్న యక్స్ట్రాతొం జీవితాన్ని సానుభూతితో సమాలోచించ గలగడమా? మొదట హాస్యమనుకున్నది. కానీ, అదిపచ్చి నిజం అన్న విషయం విశ్వం మాటలతీరులోనే వున్నది. బాల యింతవరకూ అనుభవిస్తున్న జీవితం

దాదాపూ నరకప్రాయమైనది. యక్స్ట్రా నటికి ఏమాత్రం గౌరవ ప్రపత్తులుంటాయో మద్రాసులో సినీజీవి ప్రతివాడికీ తెలుసు. బాలంటే విశ్వానికి ప్రేమకాదు. అభిమానం—అభిమానానికీ, ప్రేమకీ ఏమీ సంబంధంలేదు. ఆరెండూ, రెండురకాలు.

బాల జీవితం విషాద కథానిక. దీన్ని చెప్పడానికి, గతజీవితాన్నంతా నెమరువేసుకోవాల్సొస్తుంది. విశ్వం బలవంతంచేశాడు తన జీవిత చరిత్ర చెప్పమని. ఇంతవరకూ ఒక్కనాడన్నా, ఇంత హృదయపూర్వకంగా తమజీవిత చరిత్రని సమాదరంతో అడిగినవారు లేరు.

ఒకరిజీవితం విషాదం, దుఃఖాల్లోనే ఆనందాన్ని అనుభవించి నైతికంగా తృప్తిపొందుతారేకానీ, ప్రతిరోజూ ప్రశ్నించే మానసిక బలహీనతలు హృదయంలో కుక్కగొడుగుల్లా పొటమరిస్తూనే వున్నాయి. వీరికి ఎక్కడోగాని సమాదరణ లభించదు. ఆ సమాదరణ లభించినరోజున, ఇంతవరకూ కడుపులతో దాచుకున్న కన్నీరు శావిలో జలగలాగా వూరి వూరి బైటికొస్తుంది.

బాల పుట్టడం మరీబ స్త్రీగానీ, పల్లెగానీవూళ్లో. తలిదండ్రులకి చాలాఆస్తి వుంది. ముగ్గురు అన్నలతర్వాత, ఒక్కతే చెల్లెలు. తండ్రి వాళ్ళతోపాటే, ఆ అమ్మాయినీ పెంచాడు. కూతురంటే ఆయనకి అభిమానం. ఎస్. ఎస్. ఎల్. సి. వరకూ చదువుకుంది. ప్రవీణురాలు అవకపోవచ్చుగానీ, భరతనాట్యంలో ప్రవేశం వుంది.

బాలకి జీవితంలో కాంక్షలున్నాయిగదామరి? చదువుతోనే సంస్కారం అలవడుతుంది. సంస్కారం జీవి

తాన్ని ప్రేమసూత్రాలతో బంధించి వేస్తుంది.

తను చదువుకునే రోజుల్లో 'మురళి' అనే కుఱ్ఱాడుండేవాడు. అందంగా వుండేవాడు. ఖరీదైనబట్టలు వేసేవాడు. ఫస్ట్‌మార్కులు తెచ్చుకునేవాడు. ఆజానుబాహుడు, స్ఫురద్రూపి అయిన, మురళి అంటే బాలకి ఎందుకనో ఆపేక్షగా వుండేది. ఎప్పుడూ, అతనివంక చూస్తూండేది. అతను తనవైపుకి చూసినప్పుడు తియ్యని సిగ్గులో కరిగిపోయేది. కంటిరెప్పలు అప్రయత్నంగా వాలిపోయేవి. బుగ్గలమీద గులాబీనిగ్గులు—

కొంతకాలం తర్వాత, తానుగ్రహించిం దేమిటంటే తాను ఎంతగా మురళిని ప్రేమిస్తూందో, అంతకన్నా ఎక్కువగా, మురళి తనను ప్రేమిస్తున్నాడు. తాను ఆడది. తెగించి, తాను ప్రేమించానని మురళిగ్గానీ, యింటివద్దగానీ, చెప్పలేదు. 'అబల' అయిన ఆడదాని అంతర్యం, పరిస్థితుల్ని ఎదురించ లేదుగదా.

సాయంత్రం, స్కూలు వదిలాక, బాల తెలుగు కాంపోజిషన్ పుస్తకాన్ని దిద్దించుకుని, యింటికి వస్తోంది. రెండురోజుల్నించి స్కూలుకురాని కారణంగా, యివ్వాళ పనిమాలాఆగి, మరీ కరెక్ట్ చేయించుకోవాల్సొచ్చింది. ఒంటరిగా వస్తోంది. ఇంతలో, వెనకనించి తన్నెవరో పిల్చినట్లయింది. వెనక్కితిరిగి చూసింది. తాను యింతవరకు ఎవరి కోసమైతే తీయని కలలుకందో, తన అంతర్యంలోని విషయం ఎవరికైతే చెప్పడానికి భయపడిందో, ఆ మురళీయే! – ఆనం

దంతో, సిగ్గుతో హృదయం విల విలా తన్నుకున్నది. ఎందుకో చిరునవ్వు తనని పరిహాసిస్తోంది. గొల్లకాపరి వేణు నాదం పచ్చిక బీళ్ళల్లోంచి మంజులంగా, మధురంగా విన్పిస్తోంది—

మురళి సైకిల్ మీదవచ్చి, తనప్రక్కనే కవరు పారేసి పోయాడు. నీలిరంగు కవర్ మీద నూర్జహాన్ సెంటు పరిమళాలు గప్పుమని వీచాయి. ఖరీదైన జేబుగుడ్డలో అందమైన, ఎఱ్ఱకాయితంలో, ముత్యాల్లాంటి అక్షరాలు చెక్కినట్లు—
"ప్రియమైన బాలకి—

చాలారోజులుల్నించి నీతో ముఖ్యవిషయం చెపుదామనుకోవడమూ, చెప్పలేక పోవడమూ జరిగాయి. ఈ వుత్తరంలో నేనునిన్ను వూహాసుందరిగాను, మేఘమాలగాను, వర్ణించడంలేదు. యదార్థం వ్రాస్తున్నాను. జీవితంలో నిన్ను మొట్టమొదటిసారిగా ప్రేమించాను. ప్రేమ అంటే, నిర్వచించడం, యిదమిద్ధమని తేల్చి చెప్పడమూ నాకు చాతకావు. కాని, ప్రేమించాననే ఒక్కవిషయంమాత్రం ఖచ్చితంగా చెప్పగల్ను. పోతే, చాలాత్వరలో యిక్కణ్ణించి వెళ్ళిపోతున్నాను. మానాన్నగారు మద్రాసులో బిజినెస్ చేస్తానన్నం, దానికి అజమాయిషీ వహించాల్సిన బాధ్యత నా భుజస్కంధాలమీద బడడంజరిగాయి. నన్నునీవు ప్రేమించేట్టయితే, బుధవారంనాటి రాత్రి 11 గం॥కు సిద్ధంగావుండు—ఇంతకన్నా హృదయాన్ని విప్పిచెప్పడం నా చేతగాని పని—బహుశా యిదినీకు ఆమోదకరమే ననుకుంటాను.

ఇట్లు
నీ మురళీకృష్ణ"

ఈ వుత్తరాన్ని చదివి బాల చాలా ఆలోచనలో పడింది. దీన్నిచేస్తే బావుండును అనేది - యిదమిద్ధంగా తేల్చుకోలేకపోయింది. కన్నతండ్రి యిలాంటి వాటిని క్షమించదు. ప్రపంచంలో ప్రేమించగలవాణ్ణి సంస్కారంతో దీవించగల సహృదయత ఈలోకంలో ఎంతమందికుంటుంది! అనుకున్న అదృష్టం ఎదురైతే, మానవుడు తబ్బిబ్బవుతాడు. ఇంతకాలం వరకూ దొరుకుతుం దనుకున్నది - దొరికితే, దానివిలువ మనకంతగా కనిపించదు.

ఇప్పుడు, బాలకి ఎదురుగోడల్లా రెండుప్రశ్నలు సముత్పన్న మౌతున్నాయి. ప్రేమకోసం, తలిదండ్రుల్ని త్యజించగల్దా, తలిదండ్రుల్ని, నా అన్నవారిని కాలదన్నుకుని మురళి కోసం, జీవితాన్ని త్యాగంచేయగలదా? - చేయగలనా, అనేదానికన్నా, ఎంతవరకు త్యాగంచేయగలను - అని ప్రశ్నించుకునేవాళ్ళు, ఈలోకంలో చాలా తక్కువమంది వుంటారు.

ఎంత ఆలోచించుకున్నా ఈ ప్రశ్నకి సమాధానం దొరకలేదు. ఎలా దొరకుతుంది! ఈ జీవితంలో ఎటు తేల్చుకోవాలీ - అన్న సందిగ్ధతలో బాల విలవిల్లాడసాగింది. ఆంతర్యంలో మురళికి తనమీద సదభిప్రాయం వున్నదా? — అవును, లేకపోతే తనకి ఈ ప్రేమలేఖని ఎలా రాయగలడు. సామాన్యమైన భాషలో ఉదాత్తమైన భావాల్ని గుప్పించడం తేలికైనవిషయం కాదుగదా?

ఊరికే, ఉద్రేకంలో రాశాడేమో? మురళికి వయస్సు యిరవై ఏళ్ళకన్నా ఎక్కువుండదు. క్షణికమైన సుఖంకోసం

కాలుజారి పతనావస్థలోకి దిగజారితే, మళ్లీ ఈప్రపంచంముఖం ఎలా చూడగల్గుతుంది. మనిషికి మనస్సు ఎంతఆ ప్తమిత్రుడో అంతకన్నా భయంకరమైన శత్రువుకూడాను. అయితే, మనిషి అంతర్యాన్ని గ్రహించగల సాధనాలేమీ లేవు గదా?——మురళిని తాను చాలాకాలంనుంచి ప్రేమించింది. తానే ఎదుటపడి అడిగేసరికి, జంకు తనని ఆవరించింది. ఇలా అనాదిగా మగవాడి పాదాలకింద నలిగిపోయిన హాత భాగ్యుల్ని తాను ఎంతోమందిని చూసింది తమయింటిపక్క నక్కు జీవితం ఎందుకు నాశనమయ్యిందో తనకి తెలుసు—— నక్కును ఆడిపోసుకోని వాళ్ళంటూ, తెలిసినవాళ్ళల్లో ఎవరూ వుండరు. బ్రతకలేక, నక్కు పారిపోయింది. ఎక్క డికో తెలియదు. బహుశా యెవరూ చూడలేని ఏ దూర ప్రాంతానికో పోయివుంటుంది. నక్కును దేవతగా యెవ రైతే ఆరాధించారో; నీవులేకపోతే, జీవితమే లేదని యెవ రైతే ఘోషించారో——వాళ్ళు ఈ దేశోద్ధారకులే నక్కు జీవితం నాశనమవడానికి, కారకులయ్యారు. కమ్మనాయుడు గారబ్బాయి మొట్టమొదటిసారిగా లోబర్చుకున్నాడు. భూమ్యాకాశాలు ఏకమైనా, కులగిరులు కంపించినా, నా హృదయంలో నీకుతప్ప మరెవ్వరికీ స్థానంలేదన్నాడు. నక్కు నమ్మింది. నమ్మక ఏంచేస్తుంది! ఔను...

అనాదిగా ఆడదాన్ని మగవాడు తనకాలికింద పూవు లాగా నలిపాడు. మానసికసౌందర్యాన్ని, మానవత్వాన్ని తన స్వార్థానికి వినియోగించుకున్నాడు. ఆడదాని శాడీదగ్గ ర్నుండీ, కాళ్లరంగు వరకూ తన యిష్టమేనని శాసించాడు.

శతాబ్దాల పరిభ్రమణంలో చరిత్ర పుటల్లో - పాత పద్ధతుల ద్వారా నేర్చుకున్న విజ్ఞానం కొత్త పుంతలు తొక్కింది. తనకీ మానసిక సౌందర్యం వున్నదని ఆడది నిరూపించుకునే శతాబ్దాలు వచ్చాక, మగవాడి గర్వం సగం వరకూ విరిగి పోయినమాటమాత్రం నిజం. ఏది ఏమైనా, మగవాడికి ఆడది బానిసత్వం చేయడంమాత్రం తప్పలేదు. సబలగా నిరూపించబడినా ఝాన్సీరాణీని లోకం అబలగానే గౌరవించిందిగదా!

మంగళవారం రాత్రి వరకూ బాల ఎటూ నిశ్చయించుకోలేకపోయింది. మనస్సు అల్లకల్లోలమైపోయింది. ఏం చెయ్యాలి? ఎవర్ని వదులుకోవాలి ? ఎందుకనో, ప్రతి మనిషికీ, ఒకోసారి మొండినమ్మకం కలుగుతుంది. బాల అంతర్యం మురళికే ఓటు చేసింది. అంతే, 'తర్వాత' ని గురించి బాల ఆలోచించుకోలేదు.

బుధవారంనాటి వుదయంనుంచీ, బాలలో ఆనందోత్సాహాలు మితిమీరిపోయినయ్యి. మధురక్షణాలు కళ్ళ ముందు నాట్యం చేస్తున్నాయి. ప్రతిచిన్న విషయానికీ చిరునవ్వు పెదాలమీద వెలిపోతోంది-ఎందుకిలా జరుగుతుంది? ఎందుకు జరిగింది? అంటే, బాల హృదయం చక్కని సమాధానమిస్తుంది. జీవితంలో ఆనందాన్ని అనుభవించబోతుంది. సుఖాన్నన్నా అనుభవిస్తుంది, లేదా, ఈ కాల వాహినిలోనన్నా కలసిపోతుంది. అమరప్రేమకోసం అమరులైనవాళ్ళకన్నా తాను అధికురాలు కాదుగదా?—

మానవుడి జీవితం చాలావరకూ తృప్తితోనే గడిచి

పోతోంది. ప్రతివాడు ఏదో విధంగా సంతృప్తి పడకపోతే, బ్రతగ్గలిగిన అవకాశాలు లేకుండా పోతాయి

బుధవారం రాత్రి పరుగెత్తుకుంటూ వచ్చింది. గడియారంలో ముళ్ళు, పైపైకి రౌండ్లు తిరుగుతూ కాలవేగాన్ని సూచిస్తున్నాయి. పదిగంటల పదిహేను నిమిషాలు. ఇంకా నలభైఐదు నిమిషాలు. ఋణాం, యింకా కొద్ది నిముషాల సేపు మాత్రమే. ఇప్పుడు భయం ఆవరించుకున్న దేమిటి? కళ్ళల్లో నీలాల్లా, కన్నీటి ముత్యాలు ప్రవహించి పోతున్నా యెందుకు?—గుండెల్లో రైళ్లు ఎందుకు పరుగెత్తి పోతున్నాయ్? ఏమిటిదంతా ప్రకృతీ?—

పదకొండయ్యింది. మురళి రాలేదు. పదకొండుంబావయ్యింది. మురళి రాలేదు. బాల పెట్టుకున్న ఆశలన్నీ నిరాశలేనా? ప్రొద్దుట్నించీ, పొందిన సంతోషమంతా, భగ్నమై పోవాల్సిందేనా?—

కానీ, అలా జరగలేదు. పదకొండుగంటల పదిహేను నిమిషాలకి, మురళి రానేవచ్చాడు. చిన్నకారు నిశ్శబ్దంగా కాంపౌండ్ ముందు ఆగింది బాల అంతర్యం ఆనందంతోనూ ఆవేదనతోనూ బిగుసుకుపోయింది. ఒక కంటిలో పరుగులెత్తే ఆనందం, మరో కంటిలో పొంగిపొర్లే ఆవేదన! ఒక్క క్షణంలో రెండు, సుఖదుఃఖాలు. మరో క్షణంలో నిర్ణయించుకోవాల్సింది, సుఖంగానీ, దుఃఖంగానీ, ఏదో ఒకటి — ఏదైనాసరే.

పెట్టినిండా బట్టలు, మెడనిండా నగలు, ముఖాన కొట్టొచ్చినట్టు మెరిసే కుంకుమ. బాల తల్లి పాదాలకి దణ్ణం

పెట్టింది. అందరూ దీర్ఘ నిద్రలో వున్నారు. హృదయంలో 'ప్రేమ' బద్దలై కళ్ళల్లోంచి బొట్లుగా కారింది. రెండు కన్నీటిబొట్లు తల్లికాళ్ళమీద జారిపడినాయి. కన్నీళ్లుతుడుచుకుని, గంభీరంగా వెనక్కి తిరిగివచ్చేసింది. అంతర్యం, మురళి వైపుకు లాగినా, తెంచుకోలేని భవబంధాలు కాళ్ళకి బంధాలై శాధిస్తూనే వున్నాయి.

ఇంటిబైట గేటు తెరుస్తున్నప్పుడు, యిక మిగిలిందేమీ లేదు_ అన్పిపించింది. కారు తలుపుతీసి - మురళిపక్కన కూచున్నప్పుడు, కొత్త సిగ్గు, చిగురుదొడిగింది. ఒక్క ప్రేమికుడికోసం, ఉన్నవాళ్లందర్నీ కాలదన్నుకుని, ఎక్కడికో లేచిపోతున్న యీ బాల జీవితంలో సుఖదుఃఖాల పరిమితిని విధాత యెంతవరకు శాసించాడో!

మొదటిరోజుల్లో ప్రేమ తియ్యగా, మత్తుగా, యింద్రజాలంగా వుంటుంది ఒకర్నొకరు విడవలేనంత, గాఢంగా ఉదాత్తంగా ప్రేమించుకుంటారు. ఇద్దరిదీ ఒకే బాట, ఒకే మాట. కొంతకాలం పొయ్యాక ఈ ప్రేమలో ఉదాత్తత కన్పించదు. దూరంగావున్న అత్తాకోడళ్ళు, ఒకచోటకొచ్చాక, నిప్పులు చేటల్లో చెరిగిపోసుకున్నట్లు, దూరంగా వున్నప్పుడు, ఒకళ్ళమీద ఒకరు యీగనుకూడా వాలనియ్యనంత, గాఢంగా వుండే యీ మమకారబంధం, మరి దగ్గరకొచ్చాకో?

బాల జీవితం చాలా ఆనందప్రాయంగా రెండేళ్ళ వరకూ గడిచింది. కోడంబాకంలో చిన్న యిల్లు తీసుకున్నారు. మురళి పేలోటు లేకుండా శాలనిచూశాడు. మురళి

బాలని ప్రేమించడానికీ, వికసించబోయే గులాబికన్నె మొగ్గతో తుమ్మెద మకరందాన్ని జుర్రుబోవటానికీ పెద్ద భేధంలేదు అందమైన రేకులమీదవాలి, కాళ్ళతో నలిపి, తియ్యని మత్తుతో వశంచేసుకుని, తన రెక్కలమీద రంగుల్ని మెరిపించి, మదరజాన్ని రాల్చి, పూలగిన్నెని బద్దలుకొట్టుకుని, తొండాన్ని దూర్చి మకరందాన్ని తాగి పోయాక, తుమ్మెద యింకో పువ్వుని యెందుకు వెదుక్కుంటుంది? మగవాడి ఆంతర్యం యిందుకు విభిన్నమైంది కాదు గదా? తుమ్మెదల్లాగా, పూలమీదవాలే మగతుమ్మెదలు ఎన్ని ఆడపూలగిన్నెల్లోని, మకరందాన్ని తాగిపారెయ్యడం లేదు! పూలగిన్నె కవాటాన్ని బద్దలుకొట్టి పూవు దీనంగా మూల్గుతుంటే, సంతృప్తిపడే తుమ్మెదకీ, మగవాడికీ ఎక్కడన్నా భేధంవుందా?

ప్రతి పురుషుడూ మొదట ఆడదాన్ని యెలా ప్రేమిస్తాడో, పెళ్ళయ్యి పరిస్థితులవల్ల కార్యం కాకపోతే పరుపుల మీద దిళ్ళని కావిలించుకుని ఎన్ని తీపికలలు కంటాడో, ఆ మధుర క్షణంకోసం ఈ రాచకుమారుని ఆంతర్యం ఎలా మత్తులో దహించుకుపోతుందో దేముడికి తెలుస్తుంది. లేదా కృష్ణుడి పక్కలోంచి, సత్యభామను లేపితే దహించుకుపోయే, అతగాడి ఆంతర్యం మనకి ప్రత్యక్ష ఫలితంగా, ఋజువవుతుంది.

బాల యింట్లోలేని రోజుల్లో ఆ మూడు రాత్రులూ మురళి మానసికవేదన్ని వ్యక్తంచేసే, భాష యేమీ దొరకడంలేదు. ఇంచుమించుగా చెప్పాలంటే, మంచాలమీద

నల్లులు కుడ్తోన్నాయి. చలిగాలి బెదిరిస్తూ వీస్తోంది. వెన్నెల వృథాగా పోతోంది; యింకా యిలా యిలా, యిలాగా.

మానవుడి మనస్సులో అనుమానం అనే మచ్చ హృదయదీపపు గ్లాసుపై ఏర్పడనే కూడదు-ఏర్పడితే దాన్ని చెరపడం, ఈ జీవితంలో చాలావరకూ సాధ్యపడదు. అయితే ఎక్కడైనా, అనుమానం విరిగిపోయిన క్షణం ఆసన్నమైతే, అది అదృష్టం దానంతటికదే వెదుక్కుంటో, ఒచ్చి కావిలించుకుంటోన్నదన్నమాట. అనుకున్న కార్యక్రమాన్ని తారుమారు చేసే, అనుకోని క్షణాలువస్తే, గొడ్డు కసాయివాడిముందు చావబోయే అంతిమక్షణంలో శ్యామల నేత్రాల్లో ప్రతిఫలించే దీనత్వపు ఛాయలు మనిషి ముఖం మీదా ప్రతిఫలిస్తాయి.

జీవితాన్ని బాగుచేసేవాళ్ళు కొందరైతే, సర్వనాశనం చేసేవాళ్లు యింకొందరు. ఈకోవలోనివాడే సుందరం. ఈ కోవఅంటే రెండోతెగ — అని అర్థం. ఇతని వృత్తి బ్రోకరేజి. విటుల్ని విలాసినులదగ్గర తార్చి, దానిమీద ఘరానా జీవితాన్ని వెలిగించుకోవడం. ఇలాంటివాళ్ళకి కడుపు నిండితేచాలు, మానవ మర్యాదలకోసం, వీళ్ళు జీవితంలో ఒక్క క్షణంకూడా ఆలోచించుకోరు. యవ్వన మదంతో లేచివచ్చినవాళ్లు, స్వేచ్ఛకోసం నినాదాలూ, ఆర్భాటాలు చేసేవాళ్ళు, జీవితంలో కాలుజారి పతనమైన వాళ్ళు, చిన్నప్పుడే భర్తలుపోయిన పూర్వ సువాసినులు, సుందరానికి చిరపరిచితులు.

జీవితంలో యదార్థతకన్నా అబద్ధమే, నిజంలా కన్పిస్తుంది. ప్రపంచంలో గతచరిత్రల అవలోకనవల్ల తేలిన విషయాన్నిబట్టి, దుర్మార్గుడికి కున్నంత గౌరవం మంచివాడికి లేకుండా! పోయింది. ప్రపంచంలోవున్న రెండుకోలాలూ మంచీ-చెడులు. చెడునుబట్టేగదా మంచికి గౌరవం వచ్చేది అంతా మంచైతే ప్రపంచం కొన్నివేల సంవత్సరాలక్రిందటే స్థంభించి పోయేది. చుట్టూ గాఢాంధకార పటలం వ్యాపించినప్పుడే, దీపపు కాంతి విలువ ప్రస్ఫుటించేది.

సుందరం నెమ్మదిగా మురళితో స్నేహం చేసుకున్నాడు. మాటల్తో మానవుల్ని వశంజేసుకునే మహత్తరమైనశక్తి, సుందరంలోవుంది. మాటల్తో మరో లోకంలోవున్న త్రిపిస్వర్గాల్ని తెరిపించవచ్చు. అలాఅయితే,సుందరం మురళితో స్నేహంజేసుకోవడం పెద్ద కష్టమేం కాదుగదా?

ప్రతిరోజూ మురళి వున్నా, లేకపోయినా సుందరం మాత్రం తప్పకుండా హాజరవుతూండేవాడు. తియ్యగా మాటండేవాడు. అగాధమైన మనుష్యుల హృదయాల్లో సంస్కారం వుందనుకుందిగానీ, కుటిలత వుందిఅని ఏనాడూ భావించలేదు బాల. సుందరం బాలను చేజిక్కించుకుందామనుకున్నాడు. దానికావల్సిన ఉచ్చులూ పన్నాడు.

మురళిలో కొన్ని అనుమానాల్ని రేకెత్తించాడు. మురళికి బాలమీద అనుమానం వేసింది. అతని అంతర్యం ఒక ఎదురుప్రశ్న వేసింది. నిన్ను ప్రేమించినట్లు, బాల యింకోర్ని ప్రేమించలేదనే నమ్మకంఏమిటి? అనుమానం

ముదిరాక మరి మనిషి యిక నిలువలేడు. సంస్కారం చుట్టూ ఉచ్చులుపన్నుకుని, సాలెగూడులో ఈగవ్యాదిరిగా బాధిస్తుంది. మురళికి బాలమీద బలీయమైన కాంక్షలు, అది వరకులా గాక బదా బదలైనాయి.

మురళీలోమార్పువచ్చిందని గ్రహించడానికి, బాలకి ఎంతోసేపు పట్టలేదు. అయితే మురళిలో ఎందుకు మార్పు వచ్చిందో కనిపెట్టడాని కనువైన స్పష్టమైన ఘటనలు యింత వరకూ ఏఒక్కటీ చేయులేదు. తనకు తెలిసినంత వరకూ, జరిగినంత వరకూ తప్పులు, మాటపట్టింపులు, పొరపొచ్చాలు రాలేదు. తను ఏనాడైతే, మురళితో లేచిరావడానికి నిశ్చయించుకుందో, ఆనాడే తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకి నీళ్లొదులుకుంది. ఉన్న వారినీ, ఉన్నవూరినీ దూరం చేసుకుని, లేచి రావడానికి యిష్టపడిన తన ఆంతర్యం మురళిని అనుసరించకుండా ఎలావుంటుంది? విభిన్నమైన మానసిక సంస్కారాలు వుండటం నిజమే. అవన్నీ వుండటమూ అవసరమే!—కానీ అవి ఎదురుతిరిగి పాముల్లాగా బుసలుగక్కుతూ, పడగలు విప్పడంలో అర్థం లేదు – కాలానికి, ప్రకృతికి అనుగుణంగా మనస్సును మార్చుకోవాలిగానీ, మనస్సుకు అనుగుణంగా కాలాన్నీ ప్రకృతినీ మార్చడం అసహజమేగాదు; అపాయం కూడాను బాలకిమాత్రం మానసిక సౌందర్యంలేదా? మరి దానిమాటేమిటి? దానిగోడు దానిదయ్యే. పరిస్థితులు విషమించాక యిప్పుడు ఏడ్చి, మొత్తుకున్నా లాభమేమిటి?

ఒకరాత్రి చాలా చీకటిగావుంది. మబ్బులుపట్టిన ఆకాశం, ధ్యాకాసిభూతంలాగావుంది. మురళి ఒచ్చేదాకా వుంటానని

సుందరం నడవాలో కూర్చున్నాడు. అతను కూర్చోవటంలో వున్న నిగూఢమైన వాంఛ, బాలకి తెలీదు. సుందరం కళ్ళు బాడీమీద వెనకనుంచిచూసి, వీపు వెనుకవైపున వున్న నున్నదనంమీదా అని బాలకి ఎలా తెలుస్తుంది?

ఉన్నట్టున్న ఆకాశం మెరుపుల్ని మెరిపించింది. పిడుగుల్ని వెలిగ్రక్కింది. బ్రహ్మాండాన్ని బద్దలుచేయాలని కాబోలు వుర్విళ్ళూరింది. కిటికీరెక్కలు టపటపమని కొట్టుకున్నాయి. తలుపు గడేసుకుని, బాల లోపల నిద్దరోతోంది. సుందరానికి నిద్రబట్టటం లేదు. అతనిచూపులు బాలమీద కేంద్రీకరించినాయి. ఆమె అందం అతన్ని ముగ్ధుణ్ణి చేసింది అతనిలోని కామం కళ్ళుదెర్చుకుని, నిద్రబట్టనీయకుండా కాల్చి చంపింది. ఏం చెయ్యడానికీ— ఏమీ చేయవద్దనడానికీ మానవుని అంతరాత్మే సాక్షి. సుందరం ఈలోకంలో తనమానవత్వాన్ని ఏనాడో అమ్ముకుని డబ్బుచేసుకున్నాడు. అతనికి పెడఆలోచనలురావడంలో అతని సంస్కారమే, అతనికి దోహదంచేస్తుంది. బాలలాంటి వాళ్ళని తను చాలా మందిని చూశాడు; అనుభవించాడు. అంతమాత్రాన నివురుగప్పిన నిప్పులాంటి కామం నీరుతగలకుండానే చల్లారుతుందా? పెడ ఆలోచనతో మనసు లుంగలుతిరుగుతోంది— అంతే...

సుందరం గుమ్మం క్రీనీడలో నుంచున్నాడు. గాలిలో తుంపర్లు లేచి అతనిమీద పడ్తోన్నాయి. సుందరం నెమ్మదిగా, తలుపు తట్టాడు. దబదబ మని నీటిచుక్కలు తమ ఆధిక్యతని స్పష్టం చేస్తున్నాయి. బాల తలుపు తీసింది. మెరు

పుల వెల్తురులో డాబా పిట్టగోడ తళుక్ తళుక్ మని మెరుస్తోంది.

సుందరం ఒక్కవూపులో బాలని కావిలించుకున్నాడు. పెనుగులాడ్డానిక్కూడా సమయంలేని కాలం. కాండ్రుమని గర్జించింది బాల. గాలిలోకలసిపోయింది కంఠస్వరం. విదలించింది, విసిరికొట్టింది, కొరికింది కానీ మగవాడి శక్తికింద ఆడదాని శీలం ఎన్నోసార్లు నలిగిపోయింది- అది మనం ఎన్నోసార్లువిన్నాం—

బాల శీలాన్ని బలిగొన్నాడు సుందరం.

బాలలోని పవిత్రత ఒక్కక్షణంలో కలుషితమైంది. అందమైన కలువపూవు రేకుమీద నల్లని బాడి అలుముకున్నట్లు, బాల పవిత్రురాలుకాదు. పతిత. దానికిసాక్ష్యం వున్నది-బాల అంతరాత్మ. బాల పతితురాలని ఆవిడ రేగిన వెంట్రుకలు చెప్తాయి. నలిగినపూలు చెప్తాయి. వూడి, నేల రాలి పడిన తెగిన జాకెట్ గుండీ చెబుతుంది. కంపించేరోమ్ములు చెప్తాయి ఇంతకన్నా యింకాకావల్సిన సాక్ష్యం ఏమున్నది.

"ఏమిటిది సుందరం?" బాల ఏడ్చింది.

దానికి సమాధానం యివ్వడానికి సుందరం అక్కడ లేడు. వానలో తడుస్తూ యిరుకైన కోడంబాకం చీకటి సందుల్లో కలిసిపోయ్యాడు. బాల హృదయం ఆగినంత పనైంది. ఎదురుగా చేతిలో మెరిసేచాకుతో మురళి నుంచున్నాడు.

'నుంచో' అన్నట్టు కత్తితో సంజ్ఞ చేశాడు. బెరుగ్గా, పగిలిపోయే గుండెల్తో శాల నుంచున్నది.

'తప్పుడు లం...' అన్నాడు. నోటికొచ్చినబూతుకూతలన్నీ కూశాడు. 'ఇంకా యిక్కడనీకు స్థానంలేదు. నీలాంటి నీతితక్కువదాన్ని కట్టుకుని నా జీవితాన్ని నేను నాశనం చేసుకున్నాను నా యిల్లు చక్కబెట్టే దీపానివనుకున్నాను. నాగుండెల్లో గుచ్చుకునే ముల్లువనుకోలేదు. ఇప్పుడు ఎన్ననుకుంటే ఏమిటి లాభం – నీకూ నాకూవున్న బాంధవ్యాలు ఈ క్షణంలో పటాపంచలైపోయినాయి. నా హృదయంలో శూలాన్ని గుచ్చావ్. నీ రంకు భాగవతంలో అడ్డంవుండే, పాత్రధారిగా నన్ను వాడుకున్నావ్—పో, యిక్కణ్ణించి బైటికి పో. ఇక జీవితంలో నీముఖం ఎన్నడూ నాకు చూపించకు."

శాల ఏడ్చింది. నిజం చెప్పడానికి ప్రయత్నించింది. కాని, మురళిలోని వెన్నహృదయం ఏనాడో కటికపాషాణమయ్యింది. కన్నీరు దాన్ని కరగించలేదు. జాలితో కరగవలసిన మానవహృదయాలు, వానలేక ఎండిన బీడుల్లాగా వున్నాయి–అనడం ఆ పరిస్థితుల్లో సమంజసమైన విషయం. విషయాన్ని యింకా పొడిగించడం అనవసరం. ఆ కటిక చీకట్లోనే మురళికీ తనకీ ఋణానుబంధం తీరిపోయింది.

ఇక, చేయగల్గిందేమిటి?—ప్రస్తుతం చేసేదేమిటి?–ఈ ప్రశ్నలు, వాటికి సంబంధించిన జవాబులు ప్రస్తుత కర్తవ్యం. చిమ్మచీకట్లో చీర పూర్ళ్యకోకముందే, కారుమబ్బులు కళ్ళు మూయకముందే, గాలిదుమ్ము జోలపాట ఆపకముందే, తారురోడ్లమీద నీటి ప్రవాహాలు నిలవక

ముందే మురళితో వున్న బాంధవ్య సరళి బద్దలై పోయింది.

ఆరాత్రే కట్టుకున్న బట్టల్తోనూ, పెట్టుకున్న నగ ల్తోనూ ఎలా వచ్చిందో అలాగే, ఆ యింట్లోంచి కాలు బైటికి మోపింది. అయితే ఆరాత్రికీ, ఈరాత్రికీ వున్న తేడా అల్లా, ఆనందంతో వచ్చిందా రాత్రి; ఆవేదనతో తిరిగి వెళ్తోందీరాత్రి. ఆనందంతో వచ్చిన కన్నీళ్లు, ఆవేదనతో వచ్చిన కన్నీళ్ళు ఎవరికోసమైతే అన్నిబంధాల్నీ తెంచు కుని యిక్కడికొచ్చిందో, ఆ బంధమే యిక్కడ జారిపో యింది. కట్టుకున్న ఆశాసౌధాలన్నీ పెళ్లుమని కూలితే, ఆరాళ్ళకింద సమాధి అవడానికి వీల్లేదుకదా?—ఆశాసౌధం అది. ఇప్పుడేం చెయ్యాలి?—వానలో తడుస్తో, చలిలో ఒణు కుతో, ప్రకృతి ప్రచండ వేగంతో ప్రళయాట్ట హాసాలు చేస్తోన్న గాఢాంధకారంలో ఎక్కడికో వెళ్తోంది తను. సత్రంలో ఆరాత్రి, మరిరెండు రోజులూ తలదాచుకుంది.

ఎవరైతే తనజీవిత సౌధాన్ని కూలదోశారో;ఆ సుంద రమే తనకి బాసటగా నిల్చాడు. వెతుక్కుంటూ సత్రాని కొచ్చాడు. గతాన్ని గురించి ని వొక్కతెవేగాదు, నేనూ ఏడుస్తున్నా నన్నాడు. అతనికి కళ్ల వెంట నీళ్ళొచ్చినాయి. అవి మొసలికన్నీరని తనకింకా తెలీదు జాలితో తనహృదయం ద్రవించింది యుగ యుగాల్నించీ ఈ జాలివల్లనే మగవా డికి శానిసగా బ్రతుకుతున్న ఆడది. తనకి యింత అన్యాయం జరగటానికి తనే కారణమన్నాడు. క్షమించమని చేతులుపట్టు కుని యివి చేతులుకాదు, కాళ్ళు – అన్నాడు. మురళిమీద ప్రతీకారం తీర్చుకుంటా నన్నాడు. కానీ, తనే ఒద్దని వారిం

చింది. ఔను. అంతరాంతరాల్లో ఒక్కసారి ఆడది మగవాణ్ణి ప్రేమిస్తే అంతతేలిగ్గా మర్చిపోలేడు ?

తర్వాత ఏంజరిగింది! ఏం జరగాలనుందో అంతా జరిగింది. బాలకీ మానసికమైన గౌరవాలున్నాయి. ఆ గౌరవాల్ని యిక్కడ కాల్చి నుసిచేసుకోపోతే కడుపులో రాజిరగిలే అగ్నిజ్వాల సంగతేమిటి? అందుకునే బాల సుందరంతో త్యాగరాయనగర్లో కొంతకాలం కాలం గడిపింది. ఇది దాంపత్యం అనడానికి వీల్లేదు. చిరిగిన దుప్పటికి, ఇంకో కంతపడినా, ఎవరూ పట్టించుకోరు. అసలు పడే జాగర్త అంతా, చిరగకముందే వుండాలి. ఈ సిద్ధాంతం చాలా తక్కువమందికే వర్తిస్తుందనుకోవడం పొరబాటు. చాలా మందికి వర్తించినా చాలా తక్కువమంది ఆచరిస్తారు.

పై సిద్ధాంతం ప్రకారమయితే, ఆడదాన్ని వాంఛించని మగవాళ్ళు యీ లోకంలో చాలా తక్కువమంది వుంటారు వీళ్లు, బాధనంతా స్త్రీ ధనాన్ని దాచుకున్నట్టు దాచుకుంటారు ఒక్కొకళ్లు స్వేచ్ఛావిహారులు. ఈ ప్రేమపక్షుల రెక్కల్ని కట్టేసేహక్కు ఎవరికీ లేదు. అయినా సుందరం హీనంగా బ్రతుకుతున్నమాట నిజమే. కష్టపడలేడు అతను. అనుకోవడానికి సంస్కారం అడ్డం వస్తూనేవుంది. ఈ సంస్కారం దేనికి అడ్డంరాదుగనుక. ఒక్కమాటమాత్రం నిజం. సుందరం ప్రేమపక్షి!"

బాల యెంత శ్రద్ధగా చెప్తోంగో, విశ్వం అంతకన్నా రెండింతలు శ్రద్ధగా వింటున్నాడు. అప్పుడప్పుడూ బాల విశ్వం ముఖంలోకి చూస్తోంది. ఇదీ ఒకరకమైన ప్రేమేమరి. కానీ సోదరప్రేమ.

"ప్రతిమనిషి జీవితంలో ఎవర్నో ఒకర్ని గాఢంగా ప్రేమిస్తాడు. ఈ ప్రేమ చిత్రమైంది. ఇక్కడొక కథ చెప్పడం మంచిది. మా అన్నయ్య ఫ్రెండ్, ప్రసాద్. కాలేజీలో స్నేహం. ప్రసాద్ ప్రేమించిన అమ్మాయి చాలా అందగత్తె. ఈ ప్రేమకి కారణభూతుడైనవాడు మా అన్నయ్య. అంటే అంతరాంతరాల్లో ఆ అమ్మాయిని మా అన్నయ్య ప్రేమిస్తున్నాడన్నమాట. కానీ యిదీ సోదరప్రేమే. దాం తర్వాత పరిస్థితులు యెదురుగాలై వీచి, ప్రసాద్ ఆ అమ్మాయిని చేపట్టలేకపోయాడు. చాలా కాలం తర్వాత ఎక్కడో ఒక చోట ఆమ్మాయి కన్పిస్తే ప్రసాద్‌ని గురించి చెప్పి, బాగా చితికిపోయాడు పాపం అంటే, అతనెవరో నాకు తెలీదు, "బహుశా యెక్కడన్నా చూశానేమో" అన్నది.

అలా ఎందుకన్నదీ, ఏమిటి అని తర్కిస్తే ఒచ్చేలాభం ఏమీ వుండదు. ఇంచుమించుగా నా జీవితమూ అంతే అయ్యింది. నా శీలాన్ని గురించి, అనూచానంగా వస్తున్న నా పూర్వపు ఔన్నత్యాన్ని గురించిగానీ ఏడ్వటానికి వీల్లేదు. సుందరాన్ని నేను ప్రేమించడంలేదు. నిజమే. ఐనంత మాత్రాన, నేను సుందరానికి ఏమీ కాకుండాపోను.

బతికినంతకాలమూ సుఖమే దొరకడం కష్టం. కష్టం కూడా దొరికితేకాని సుఖాన్ని గురించి తలపోయలేం. ఎప్పుడూ యెదురుదెబ్బ తగలక కళ్ళు కానకుండా నడిచే మనిషి, ఒక్కసారి గోరులేచే యెదురుదెబ్బ తగిలితే – కష్టించుకుని మరీ నడుస్తాడు.

ఇప్పుడు నాకు ఎదురుదెబ్బ తగిలింది. అది కాలి కాదు. హృదయానికి. అది జీవితంలో ఎన్నటికీ మరువ లేనిది. కొందరికి కావలసింది డబ్బు మాత్రమే. దానికోసం వాళ్లు ఏమైనా చేస్తారు. భార్యల శీలాన్ని కూడా అమ్మే స్తారు. వీళ్లే! ఈ బుద్ధిహీనులే, విశాలత్వాన్ని, పాతి వ్రత్యాన్ని గురించి మాట్లాడతారు. సుందరం నన్ను వాడు కున్నాడు. నేను అభ్యంతరం చెప్పలేదు. నేను యివ్వాళ పతివ్రతనన్నా ఎవ్వరూ నమ్మరు. నాకు ఆ బిరుదు అక్కర్లేదు కూడాను.

ఒకరాత్రి సుందరం ఒకతన్ని తీసుకొచ్చాడు. అత నెందుకొచ్చాడో నాకు తెలుసు నన్ను అడ్డం బెట్టుకుని, నా యవ్వనాన్ని అమ్మి, తన సౌఖ్యాన్ని పోగొట్టుకోదల్చు కోలేక. తన విలాస జీవితానికి నా శరీరంబలి. ఇలా ఎందర్ని ముంచాడో సుందరం! ఒప్పుకోక తప్పలేదు. పతితకి పాతి వ్రత్యాన్ని గురించి మాట్లాడే హక్కులేదు. ఒచ్చినతను నన్ను అనుభవించాడు. అనుభవాలకి ప్రతిఫలంగా డబ్బును వెదజల్లాడు. దాంతో రెండో్రోజులు సుందరం విలాసాల్లో మునిగి తేలాడు.

ఇంతకన్నా నికృష్టాన్ని నేను భరించలేను. కంపు శరీరంవాళ్ళు ఫుల్ గా తాగిమాట్లాడితే డోకువేసే, అసహ్యం వేసేవాళ్ళని నా దగ్గరికి చేరనీయొద్దనుకున్నాను. కానీ అలా జరగలేదు. బోగందానికి నీ తేమిటన్నారు. నీకావల్సింది డబ్బు. మాకావల్సింది సుఖం. అంతే-మాటాడొద్దన్నాను.

ఇంకేంచేయను నేను? డబ్బుతో నా శరీరాన్ని కొని, దాన్ని యిష్టంవచ్చినట్లు వాడి, దానితో సుఖాన్ని అనుభవించి నా మీదుగా నడిచిపొయ్యారు.

సుందరంతో అనుభవించిన బ్రతుకు మూడునాళ్ళ ముచ్చటయ్యింది. నూటికో కోటికి ఎక్కడో ఒకళ్ళు తప్ప, లేచివచ్చి సుఖాన్ని అనుభవించినవాళ్ళు యీ లోకంలో ఎందరున్నారు! దాంతర్వాత నాబతుకు కంపెనీ పాల య్యింది. ఇంతకన్నా నికృష్టపుబ్రతుకు ప్రపంచంలో మరేమీ వుండదు – ఇదొక చిత్రమైన ప్రపంచం – ఇక్కడి మను షులు యంత్రాగారాలు. వీళ్ళు నేర్చుకున్న విద్య 'ఆకర్షణ' వీళ్ళు కట్టుకునే ఏడుగూపాయల వాయిల్ చీరకింద ఎన్ని రోగాలు దొంతర్లుగా పేర్చుకునివుంటాయో, ఆడదాన్నయిన నాకు తెలుసు – వీళ్లని అభిమానించేది, అభిమానంతో కాదు – ఆనందంకోసం – విలువలేని సుఖంకోసం – పోనీ, విలువగా భ్రమిసే తాత్కాలికానందంకోసం.

దాంతర్వాత ఎలావచ్చానో తెల్సుకోకుండా, చిత్ర రంగంలో కాలుపెట్టాను. నడ్డితిప్పటం నేర్చుకున్నాను. మేకప్‌మేన్ రంగువేస్తూ బుగ్గ గిల్లినా వూరుకున్నాను. గొమ్ములమీద గుడ్డలేకుండా నాట్యంచేయమన్నా చేశాను. యంత్రం, మరతిప్పితే కదిలినట్టు — డ్యాన్సు డైరెక్టరుగారి నిర్వహణక్రింద యంత్రంలా యీనాటికీ బ్రతుకుతూనే వున్నాను.

నాకు యీ లోకంలో వాంఛలంటూ లేవు. ఉన్న

ఒక్కవాంఛా బ్రతకడం. సిగ్గునుగురించి ఆలోచించుకుంటే నాకు యిప్పుడు సిగ్గేస్తోంది - మానాభిమానాల్ని అమ్ముకున్నాక, వాటినిగురించి ఆలోచించుకోవడం హాస్యాస్పదం అనిపిస్తుంది. బ్రతకడాన్ని గురించి ఆలోచించు కునేప్పుడు, బాధల్నిగురించి ఆలోచించుకోవడం ఉత్తమం.గానీ, గతించిన బ్రతుకును గురించి ఒక్క క్షణమన్నా విచారించకూడదు.

పతాకసన్నివేశంలోని చివరిభాగంకోసరం అందరూ తయారవుతోన్నారు. విశ్వం బాధగా నిట్టూర్చి లేచాడు. అవును, బాల కళ్ళల్లో కన్నీళ్ళు —

## 5

లీల యిప్పుడు కొన్ని సుఖాల్ని అనుభవిస్తున్నమాట యదార్థమే. ఆ సుఖాలు దేహానికి సంబంధించినవికావు. సుఖంఅంటే తిన తిండీ, కట్ట బట్టా-ఈ పరిమితివరకే సుఖం అని శాసించారు పూర్వీకులు — ముసలి భర్తని చేసుకుని, అతను చస్తే — యింకేవరివంకా చూడకూడదు. నీ విలువైన జీవితం ఎలా తగలబడినా మాకేం బాధలేదు. నీ ముసలి భర్త చితిమీద కాలిననాడే నీ సుఖాల్ని చితిమీద కాల్చేశాం — అని శాసించారు. అదృష్ట్యా చూస్తే, లీల భర్తృ విహీన.

ఈ విషయం ఆ దివాణంలో ఒక్క సుచేలాదేవికి

మాత్రమే తెలుసు. ఈ దివాణంలో ఆమె చాలామందిని చూసింది. చూసి అర్థం చేసుకుంది. ఎవరి కళ్ళేములు ఎక్కడలాగాలో అక్కడే బిగించి పట్టింది. ఇక్కడ పనిచేసే వాళ్ళు ఏదో పని చేస్తున్నాం — పని గడిచాక అవతలకి పోతున్నాం — అనేవాళ్ళే. కానీ లీల అలాకాదు. ఆమె చేసే ప్రతీ పనిలోనూ సుభ్రతవుంది. ప్రతి మాటలోనూ సంస్కారత వుంది — అందుకే లీలఅంటే సుచేలాదేవి గారికి పంచప్రాణాలు.

ఒకరి ఉన్నతినిచూసి మరొకరు ఏడ్వటం — మానవుల సామాన్యనైజం. అది ప్రకృతి శక్తులు ఏనాడో జీవితాన్ని నిలదొక్కుకోడంకోసం - ఒకరి ఉన్నతిని ఒకరు సహించలేక దాన్ని సాధ్యమైనంతవరకూ నాశనం చేయడానికి ప్రయత్నించాయి. కానీ వేళ్ళు పాతుకుపోయిన ఉన్నతిని పెకిలించడం సాధ్యంకాకపోయిన రోజున, లోపల్లోపల కుళ్ళి కుళ్ళి ఏడ్చారు. వీళ్ళని ఎలా పడగొట్టాలా అనే మంచి రోజుకోసం ఎదురుచూశారు.

సుచేలాదేవి కరుణ లీలమీద ఎలాపడిందో, లీల మంచిది అనే ముద్ర సుచేలాదేవిమీదా అలానే పడింది - దివాణంలో చాలాకాలంనుంచీ వుంటున్న దాసీలు అంతరాంతరాల్లో లీలని ద్వేషించారు. అయినంతమాత్రాన పైకి అనగలిగిన సాహసం వాళ్ళల్లో ఏ ఒక్కరికీ లేదు. సింహంముందు చిట్టెలుక ఛెంగుమని గంతులేసినంతమాత్రాన, ఆధిక్యతకి విలువ ఎంతో నిర్ణయిస్తే - అర్థమౌతుంది; లీల పరిస్థితికీ, దివాణంలో వున్నవాళ్ల పరిస్థితికీ -

పదిహేనువేలు పిచ్చికల్లా ఎగిరిపోయాక, చిన రాజా వారు ఒకరోజున వచ్చేశారు, విలాసాలూ, వినోదాలు అనుభవించాలీ అంటే, ధనం కావాలి. ధనం అయిపోయి నాక ఘనంగా యింటికి చేరుకోవాలి. తర్వాత మళ్ళీ ధనం - మరో వెలుగు - వెలుగుమీద వెలుగు - అలా వెలుగు మీద వెలుగు వెలిగి ఒక్కసారి ఆరిపోవాలి. తర్వాత యింకా వెలుగుండదు - జీవన జీవిక శాశ్వతంగా ఆరడమే!

చినరాజాగారు వచ్చినరోజల్లా రెస్ట్ తీసుకున్నారు. మరుసటిరోజు-చినరాణీగారి దర్శనం చేసుకున్నారు అతను యింతకాలంవరకూ ఏదైతే కోరుకున్నాడో, అదే జరిగింది. చినరాణీగారు తనుభాగాన్ని తనకు పంచుతానంటున్నారు. అంటే చెరో నలభైవేల ఎకరాలొస్తాయన్నమాట! డబ్బు చెరో పదిలక్షలు. చెరో వెయ్యి ఆవులు. చెరో పన్నెండు వందల కాసుల బంగారం - మిగిలింది ఏదైనా చెరిసగమే నన్నమాట!

అతని అంతర్యం సంతోషంతో నృత్యం జేసింది. ముఖాన దివ్యతేజస్సు ప్రతిఫలించింది. పంజరంలో రెక్కలు కట్టుకుని విలవిలా తన్నుకున్న రామచిలుక, స్వేచ్ఛగా హాయిగా విహరించుతుంది. ఐతే యిక్కడ రాజరికపు షరతు ప్రకారం, ఆస్థి పంపకం కావాలంటే, చినరాజా గృహస్తు కావాలి. అలాకాని పక్షంలో చినరాజాకి ఆస్థిమీద హక్కు లేదు. చినరాజా ఒక విలాసపురుషుడు మాత్రమే - ఇప్పుడు అతను దాంపత్య జీవితంలోకి కాలుబెట్టాలి. అంటే చినరాణీ

వారుకూడా కాలుబెట్టాలన్నమాట ! బాగా ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాక, - చినరాజావారు పెళ్ళికి సుముఖుల య్యారని తెలిసింది. ఇది సామాన్యమైన జమీందారీ లన్నింటికీ తెలియవచ్చింది.

అయినా చినరాజావారి ఆంతర్యానికిది విరుద్ధమైంది. జమీందారీలలో పెళ్ళిచేసుకోవడాన్ని ఆయన మనసెప్పుడూ తిరస్కరిస్తూనేవుంది. కేవలం భేషజంగా ప్రతికేవాళ్ళకన్నా పెద్దరాణిలాంటి సమర్థురాలూ, అందగత్తె దొరికితే బావుండును అనుకున్నారు.

కానీ అలా జరుగలేదు. జయపురం జమీందారుగారి చిన్నకూతురు 'ఇందుసుందరి' - యిక్కడ రాణిగావచ్చే యోగం కన్పించసాగింది. అనుకున్నంతా జరిగింది. చిన రాజాకి, ఇందుసుందరికీ చాలాఘనంగా పెండ్లి జరిగింది. చుట్టుపక్కల మూడు వూళ్ళవాళ్ళు ఏడురోజులు - సుష్టుగా భోంచేసి వెంచేశారు -

దాంతర్వాత పెళ్ళి పెత్తనంతోపాటు, ఆస్తి పంప కాన్నికూడా చినరాణివారు భుజస్కంధాలమీద వేసుకు న్నారు. ఇక ఇందు ఎంత ధనాన్ని, బంగారాన్ని పొలాన్నీ తెచ్చిందీ లెక్కల్లో తేల్చి చెప్పగలిగిందిమాత్రం కాదు.

ఒకరోజున ఇందు దాస దాసీల్ని వెంటబెట్టుకుని మెట్టినింట్లో కాలి మెట్టెలు మోయించింది. ఇందు వచ్చే నాటికి దివాణానికి మధ్యగా పెద్దగోడ కట్టారు. రాక పోక లకిమాత్రం - దర్వాజా ఏర్పాటు చేశారు. ఇందు గర్విష్టి

అని తెల్సుకోవడానికి సుచేలాదేవికి ఎక్కువసేపు పట్టలేదు. ఇందు గర్వించగల కారణాలూ చాలావున్నాయి. పెద్ద సంస్థానంలో పుట్టింది - కాలుకదిపి కింద పెట్టాల్సిన పని లేదు - మొఖంపుల్ల అందించేవాళ్ళ దగ్గర్నించీ ముఖం తుడిచేవారిదాకా దాసీలు వున్నారు -

ఈగోడ కట్టడంలో - యిందుమతి అంతర్యం ఒక్కసారి గప్పుమని ప్రజ్వరిల్లి చల్లారినమాట నిజం. కానీ ఒక్క విషయం చెప్పక తప్పదు. సుచేలాదేవి కళ్లెములు బిగలాగడంలో మంచినేర్పరి. తాను ఒక్కతప్పుకూడా చేయదు. ఇంకోరి తప్పులుకూడా సహించదు. ఇందు దీన్నే, మొట్ట మొదటిసారిగా దివాణంలో - అర్ధంచేసుకున్నది. అయినా తాను సుచేలాదేవిని ఏంచెయ్యలేదు. కుందేళ్ళు తాటాకుల చప్పుళ్ళకి బెదరవుగదా ?

చినరాజా, చినరాణి యిందుని గాఢంగా ప్రేమించాడు. బహుశా యిది తొలిమోజు కావచ్చు. ఐనా, ఇందు స్త్రీ - ఆదిశక్తి, అనాదిగా ప్రేమలాలసత్వంతో లోకాన్ని జోకొట్టే ప్రేమమయి. సంధ్యాసుందరి ఆనందాన్ని, సాయం సంజలో కాంతుల్ని ఇందుముఖంలో పారబోసింది. సోగ కళ్ళలో ప్రతిఫలించిన కాటుక నల్లదనం, ఆకాశపు తెల్ల దుప్పటికి నల్ల బార్డరులాగావుంది. అంతే సామ్రాజ్యాల్ని సైతం, ఒక్క క్షణంలో రక్తపు ప్రవాహాల ఆటుపోటుల్ని చూపించిన ఆడదాని ఆధిక్యత, షాజహాన్ సామ్రాజ్యానికే అగ్నిపరీక్షే నిల్చింది.

వయసులో మెరిసే యవ్వన మదత్వం - నెమ్మది నెమ్మదిగా, తిరగబడిపోతోంది. సన్నజాజి నలిపితే సహించ లేనిమృదుత్వం అగ్నిపర్వతాల్ని సహితంకూల్చివేస్తుంది కొన్ని సమయాల్లో ! కొంతమందిమీద మనకి అనుకోకుండా, కొన్ని దురూహాలు బయల్దేరతాయి. దానికి కారణం యిదీ అని, యిదమిద్ధంగా నిర్ణయించ లేదు - కాలం.

ఇందుసుందరికీ, సుచేలాదేవిమీద యిలాంటి అభిప్రాయమే కుదురుకుంది తన ఆధిక్యతక్రింద, సుచేలాదేవి ఎన్నోవంతు ? ఈప్రశ్న నిజంగా యిందుకి రాదగిందికాదు. కాని వచ్చింది. వచ్చింది - నిద్రపట్టనీయకుండా కాల్చి సతమతం చేస్తోంది.

సుచేలాదేవికి, యిందు అంటే, దురభిప్రాయమేమీ లేదు. ఇందుకన్నా తాను దేనిలోనూ అధికురాలుకాదు. తనకివున్న అధికారమల్లా ఆయింటి పెద్దకోడలు కావడమే నన్నది. మానవుల అధికత్వాన్ని, అల్పత్వాన్నీ నిరూపించాల్సింది ప్రకృతికాని, మనంకాదు. నిమిత్తమాత్రులమైనమనం దేంట్లో అధికులము ? ఒక్కక్షణం ఆడి, నవ్వి, ఏడ్చి చచ్చే మనం, ఏ నుక్షణం జీవితంతో పోరాడుతూనేవున్నాం - అధికులు ఆధిక్యానికి గర్వించినట్టే, అల్పులు తమ అల్పత్వాన్ని కించపర్చుకోలేరు. ఈ తేడా వేర్వేరు కొమ్మల్నించి, ఎగిరి యీ దివాణంలో స్థిరనివాస మేర్పరుచుకున్న, యీ రాను చిలుకల ఆంతర్యాల్లోవుంది. ఒకరు ఎంత బీదవాళ్లో, రెండో వారు అంత ధనికులు - సుచేల ఆంతర్యం వెన్నపూ

నైతే, ఇందుసుందరిది దీనికి పూర్తిగా వ్యతిరేకమైనది. ఎంతకీ కరుగనిది –

ధనికులకు దరిద్రుల బాధలు తెలియవు. వాళ్ళు పస్తుల్తో చస్తున్నా వీళ్ళ విలాసాలకి కొదువరాకూడదు. జమీందారుగారు నిద్రపోతుంటే దివాణంలో నిశ్శబ్దం తాండవించాలి. ధనమదాంధత్వంతో ప్రకృతినే శాసించే యీ దౌర్భాగ్యులు, ఎవరికన్నా అధికులుకాదు.

దివాణం ఇందురాకతో అదోవిధంగా మారిపోయింది. కళాకాంతులు ప్రభవించినమాట వాస్తవమే కాని, అవి పూర్తిగా భేషజానికి సంబంధించినవి. ఒక్కముక్కలో చెప్పాలంటే విలాసజీవితానికి దర్పణాలుగా నిల్చినవి. కుత్రిమతో కూడుకున్నవి.

ఇక్కడ లీల జీవితం హాయిగానే గడిచిపోతోంది ?– కాని హాయి ఎంతవరకు పరిమితమైంది ? –– ఈ హాయికి సంపూర్తికరమైన నిర్వచనం దొరికిందా ? భర్త పోయినంత మాత్రాన సుఖాన్ని వదులుకోగల్గిన వారెవరన్నా యీ లోకంలో వున్నారా ? వయసులో రక్తం ప్రవహించదా? నిద్ర పట్టకుండా చలికాలపు రాత్రులు భయంకరంగా నరనరాల్ని చిత్రహింసల పాల్జేయవా ? – పూలు పెట్టుకోవాలని, అందమైన చీరలు కట్టుకోవాలని, మూతిని అరసున్నాలా చుట్టి, భర్త ఆదరణకింద చిరుసిగ్గులు పోవాలని ఏ ఆడది కోరుకోదు ? – కాలం కత్తులబోనై, భర్త పీక కత్తిరించిన రోజున, ఈ కాంక్షలన్నీకూడా, కాలంలో కల్సిపోవాల్సిందేనా ?

అనాదిగా చిత్రమైన మానవ మేధస్సు ఎన్నో గొప్పకార్యాలు చేసినా, ప్రకృతినీ, ఆడదాని అధికతనీ శాసించి, చేసి చూపి నిరూపించుకోలేకపోయింది. రాకెట్లతో మరోలోకానికి ఎగిరిపోవచ్చు. ఆటంబాంబులతో లోకాన్ని ధ్వంసం చేసి, నరకానికి మెట్లు కట్టవచ్చు. అంతేగానీ గులాబీకన్నె బుగ్గలమీద సిగ్గుల్నికానీ, కలవపూవు మకరందంలోని మాధుర్యాన్నికానీ సృష్టించగలడా?—

సుచేలాదేవి లీలకి అన్నీ యివ్వగలదు. కానీ దైహిక సంబంధమై పాటమరించే ప్రేమ సూత్రాన్ని. తెంచుకోగల వరాన్ని యివ్వగలదా? అది ఒక్క సుచేలాదేవేకాదు; ఈ లోకాన్ని క్షణంలో ధ్వంసం చేసి, మళ్ళీ కట్టించగల మహిమ నిర్మాతుల్లో ఏ ఒక్కసారైనా, ఈ సాహసానికి పూనుకోగలరా—అన్నీ సృష్టించినవాళ్ళు, ఆడదాని అనురాగాన్ని కొలవగల యంత్రాన్ని సృష్టించగలిగారా?

లీల అనుభవించే సుఖంలో యింత ఆనందమున్నది. దీపం వెలుగులో చీకటిలాగా, మధుర హాసంలోని విషపు బిందువుల్లాగా, సుఖం కింద దుఃఖంలాగా లీల బ్రతుకు సాగిపోతూనే వున్నది.

కాలం ఏ ఒక్కరికోసమూ ఆగనట్టే, సుఖదుఃఖాలూ ఏ ఒక్కరికోసమూ ఆగవు. అనూచానంగా ఈ కాలవాహిని ప్రవహించిపోతూనే వున్నది. సముద్రాలకి, నదులకి ఆనకట్టలు కట్టవచ్చుగానీ, కన్నీటి కడలికీ, కాలవాహినికీ ఆనకట్టలు కట్టడం మానవవశం కాదు.

చినరాణీ ఇందు సుందరిగారు, ఇవ్వాళ పెదరాణీ

గార్ని చూడ్డానికి వచ్చారు. పెళ్ళిలో ఏదో గౌరవార్థంగా ముభావంగా మాట్లాడుకోవడమేగానీ, హృదయపూర్వకంగా మాట్లాడుకోవడానికి యిదే మంచి సమయం. సుచేలాదేవి అంతర్యంలో ద్వేషం లేదు. ప్రేమ ప్రవహిస్తోంది. ఇందు సుందరిగారి అంతర్యంలో ద్వేషం వున్నది. కానీ ప్రేమ లాగా నటించబడుతూ ప్రవహిస్తోంది. గౌరవార్థం సుచేలా దేవి రాచమర్యాదలతో ఇందు సుందరిని ఆహ్వానించారు.

ఇందు ఆశ్చర్యపోవాల్సిన విషయం అంటూ జరిగితే, అది ఒక్క లీల విషయమే లీల విధవ. అయినా మట్టిలో మాణిక్యంలా ప్రకాశించే, లీలని చూస్తే యిందుకి జాలికలి గినమాట వాస్తవమే. మరి యెందుకు. ఒకొ్కక్కర్ని ద్వేషించి, మనుషులు మరొకర్ని ప్రేమిస్తారు?

సుచేలాదేవి, హృదయపూర్వకంగా, ఇందు సుందర్ని ప్రేమించింది. ఆప్యాయతతో మాటాడింది. అయినా ఇందు సుందరికి ఏవో నిగూఢ భావాలు గోచరించాయ్. మాటల్లో భావాల్లో కృత్రిమత వున్నట్టుగా ఫీలయ్యింది. ఇందు సుంద రికి సుచేలాదేవిమీదఆప్యాయతలేనిమాటయదార్థమే. కాని, గౌరవించడం తన బాధ్యత.

గౌరవాలకింద మనిషి బానిస. గౌరవం మనిషిని గాడిదలాగా చేస్తుంది. గౌరవంకింద నలిగినపోయిన నవా బులు, నాశనమైన నాయుళ్లు మనకన్పిస్తూనే వుంటారు. ఇందు సుందరి లీలని అభిమానించింది; సుచేలాదేవిని ద్వేషిం చింది.

ఈ దివాణం రెండు చీలికలవ్వడాని కారణం

సుచేలాదేవి. కానీ యెంత గొప్పగా భవిష్యత్‌ను వూహించిందో. ఇందు కెలా తెలుస్తుంది? తాను బీదకుటుంబంలో పుట్టింది. ఇందు ధనవంతురాలు. ఒకే యింట్లో కలసివుండటంవల్ల తాను అధికురాలనని ఇందు గర్వించవచ్చు. తన మానసిక గౌరవం ఇందు ఆధిక్యతముందు చిన్నబోవటం, తనకి సుతరామూ యిష్టం లేదు.

చిన్నరాజావారూ, చిన్న రాణీగారు విడిపోయాక, అన్నీ సమంగా విడిపోయినయ్. అన్నతో అన్నిబంధనాలూ ఆ స్నేహంపకంతోసహా జరిగిపోయినై. చిన రాజా విలాస పురుషుడు. చినరాణీ కూడా ఆజాతిలోకి చెందిందే. రాణీగారు, సుచేలాదేవిగారి దగ్గర్నుండి తిరిగొచ్చాక, విశ్లేషాలేమిటని ప్రశ్నించారు చినరాజా. ఏమీ లేవన్నట్టు తలూపింది ఇందు. తర్వాత, అడిగింది లీలగురించి. 'లీల ఎవరు?' అని.

చినరాజా ఆశ్చర్యపడ్డారు. 'లీలా? ఎవరు? నాకు తెలిదే' అన్నారు. ఇందు కళ్ళు చిట్లించి, 'మీకూ తెలీదా?' అన్నది. 'అబ్బే లేదు, నాకూ తెలీదు' అన్నారాయన. ఆ రోజు చాలాసేపు మాటాడుకున్న ముఖ్యవిషయాల్లో ముఖ్యమైన విషయం లీల.

ఇలా కాలం గడచిపోతోంది. సుఖదుఃఖాల సమన్వయాన్ని వినోద విషాదంగా భావించగలగడం ఒక అదృష్టం. ఇది దేముడిచ్చింది. కష్టాల్లో కన్నీరుమున్నీరైతే, సుఖాల్లో కన్నీరు పన్నీరై – ప్రవహించి సెలయేరవుతుంది. సుఖం

వచ్చి ఆగలేనివారు, దుఃఖంవచ్చి ఆర్భాటాలు చేసేవారు, ఈలోకంలో వున్నారు.

ఇందు మన స్వత్వం, ఇందుకు విభిన్నమైందికాదు.

లీల అంటే యిందుకు జాలికలిగింది. కొత్తగావచ్చిన దేవేరికి సాటి ఆడదానిమీద యింత సహృదయత కలిగితే, మగవాడికి ఎలా కలగకుండా వుంటుంది! లీల అందాన్ని గురించి వర్ణిస్తూంటే, చినరాజావారి హృదయం లీలవైపుకే మొగ్గడం మొదలెట్టింది లీల యెంతఅందగత్తో చూడాలన్న కుతూహలం కలిగింది. ఇందు చెప్పినదాన్నిబట్టి - లీల అందగత్తెల్లో అందగత్తె అయివుండాలి.

సుచేలాదేవే అందమైంది. సుచేలదేవిలోవున్న ఠీవి, గాంభీర్యత, వర్చస్సునుబట్టి ఆవిణ్ణి 'వీనస్'గా వర్ణిస్తారు. అంతకన్నా అందంగా వుంటున్నదనుకుంటున్న యీ లీల ఎవరితో పోలిస్తే సరిపోతుంది! నలభై అయిదేళ్ళ కుమారరాజా సామాన్యమైన ఆడదాన్ని 'రాణి'గా చేశారంటే, అందాన్ని భ్రమించిగాకపోతే మరేమిటి?

ఇవ్వాళ తనూ పోటీకి యిందును చేసుకున్నాడు. ఇందులో రాజఠీవి వుంది. గంభీరత వుంది. కానీ అందంలేదు. మాటలోమొరటుతనముంది. కళ్ళల్లో కాంతివెనుక క్రౌర్యం వుంది. జీవితాన్ని పూర్తిగా అర్థంచేసుకున్నాననే ధైర్యం ఆ కళ్ళలో ఒకసారి కన్పించి, కన్పించకుండా పోవడంకూడా కద్దు, 'ఓ ఇందూ?! నీ ఆకర్షణ వెనక యింత అగాధమైన హృదయాన్ని ఎందుకుసృజించాడు విధాత' అనాలనిపిస్తుంది.

జీవితంలో అన్నీ తెగతెంపులు చేసుకోవచ్చుగానీ, అమరమై, ప్రేమవాహినిలా ప్రవహించే, పవిత్రమైన రక్తస్పర్శా బాంధవ్యాన్ని తెంచుకోగలిగినవాళ్ళు యీ లోకంలో చాలా తక్కువమంది వుంటారు. ఒకే తల్లికడుపునపుట్టి, ఒకే రక్తాన్ని పంచుకుని, ఒకే రొమ్ముపాలు తాగినవాళ్ళకి, అంతరాంతరాల్లో ఎన్నడైనా, దురూహాలు బయల్దేరతాయా? మధ్య నిష్ఠురం పడితే, రాజుకోకుండా, ఎన్నడూ వుండదు. భార్య లొచ్చింతర్వాత - మనస్పర్థలొచ్చి, బజార్లకెక్కి చీలిపోయిన అన్నదమ్ములు చాలామంది వున్నారు. అంత మాత్రాన వాళ్ల లోపల్లోపల కాలవాహినిలాంటి ప్రేమవాహిని ప్రవహించడం లేదనా? అనేనమ్మకం ఎక్కడన్నా వున్నా - నిజమనే, నమ్మాలనే నైజం లేదుగదా?

చినరాజా, పెదరాజా విడిపోయిన మాట యదార్థమే. వాళ్ళు పంచుకున్నది ఆస్తుల్నేకాని, అంతఃకరణాలని కాదుగదా? ఒకళ్ళుచస్తే, ఒకళ్ళు నీళ్ళోసుకోవాల్సిందే గదా? మరి ఏళ్ళెందుకు భార్యలమాట వింటారు! అంటే, యిది ఆకర్షణ అని చెప్పాల్సొస్తోంది.

ఇందు తన అమాయకత్వంతో అంతఃకలహాలని రేపవచ్చు. ఆరని అగ్నిజ్వాలల్ని రాజి, రగిలేదాకా చూసి ఆనందించవచ్చు. భర్తల్ని ఆటవస్తువులుగా చూచే భార్యకి, ఒక్కోసారి ఏంపోగొట్టుకుంటున్నామో తెలియక, అమాయకత్వంలో పడతారు. ఉన్న ఒక్క అవలంబనాన్ని పోగొట్టుకున్నాక, యెంత ఏడ్చినా ప్రయోజనం లేదని వీళ్ళకి తెలీదు. భర్తని అహంకారంతో గౌరవించే ఆడది, దాన్ని ఆధిక్య

తగా భావించి అంతా సర్వనాశనమయ్యాక తన రొమ్ముల్ని బాదుకుని ఏడుస్తుంది. ఏడ్చినందువల్ల వచ్చే లాభమేమిటి? అది యెంతవరకు సుఖశాంతుల్నియ్యగలదు?

ముందుచూపులేని ప్రతిజీవితమూ, సుఖశాంతుల్ని పోగొట్టుకోవడం ఖాయం.

ఇందుకు సుచేలాదేవి అంటే, మంచి అభిప్రాయం లేదు. మంచి అంటే కేవలమూ సదభిప్రాయం మాత్రమే. ఇందు జీవిత ప్రభావం చినరాజామీద కూడా తప్పకపడి తీరుతుంది అలా పడింతర్వాత ఇందు లక్షణాలు కొన్ని చినరాజాకి అబ్బకమానవు.

ఇంకో విషయం – దాంపత్యజీవితంలో పయనించవలసివచ్చినపుడు, హృదయాలు పెనవేసుకుని ఒకేబాట మీద నడిస్తే తప్పితే, జీవితం సుఖవంతంకాదు కాలం ఇలా జరిగిపోవాల్సిందే.

కుమారరాజాగారు చినరాజాకి కబురు పంపించారు. చినరాజాగారు బయల్దేరి కల్సుకున్నారు. పెదరాజాగారు గంభీరంగా, కిటికీసందుల్లోంచి, ఆకాశంకేసి చూస్తున్నారు. గోధుమ ముద్రంగు ముసురుకున్నట్లు కొండలు, పరుచుకున్న రాళ్ళ దొంతర్లాగా వున్నాయి. చల్లగాలి వీస్తోంది.

బూట్లుచప్పుడు విన్నతర్వాత పెదరాజావారు, తమ్ముడివంక చూసి చిరునవ్వు నవ్వి, 'కూచో' అన్నట్టు సంజ్ఞ చేశారు. చినరాజా కూచున్నాడు మళ్ళీ ఆయన దిగంతాల దాకా వ్యాపించివున్న, నీలపురంగు ఆకాశంకేసి చూస్తున్నారు. దీన్నిబట్టి చినరాజావారు అర్థంచేసుకున్న దేమిటంటే, కుమారరాజా ఏదో దీర్ఘాలోచనలో వున్నారని.

ఇంతలో సుచేలాదేవిగారువచ్చి. మరిదిని చూసి, తలుపుచాటుకి వెళ్ళారు. పెదరాజావారు మళ్ళీ పిలిచాక, మేలిముసుగు సవరించుకుని, కంకణాల కణకణధ్వనితో, సుచేలాదేవి గదిలో ప్రవేశించారు. సుచేలాదేవి పాదం మోపడంతో, గదిలో కొత్తకాంతి ప్రవేశించినట్లయింది.

'అదే, నేను చెప్పబోయేది' అని ఆపేశారు పెదరాజా.

"మీరు చెప్పండి మహారాణీ" అన్నారాయన.

ఇంతలో దాసీది ఫలహారాలు తెచ్చి బల్లమీద పెట్టింది. చినరాజావారు సేవిస్తున్నారు. అంతా పూర్తయ్యాక, పెదరాజావారు చెప్పడం మొదలెట్టారు. "తమ్ముడూ, నీకు చాలాకాలంనుంచి, ఒకవిషయం చెపుదామనుకుంటూనే వున్నాను. కానీ చెప్పలేక పోయాను. నిన్ను ఆనాడు రెక్కలురాని పక్షిగా భావించాను. కానీ మనిషి చాలాకాలం యింకోరి కాళ్ళమీద ఆధారపడి బ్రతకలేడు. నీకు నాన్నగార్ని గురించి తెలియదు. ఆయన విలాసప్రియుడు. ఆయన లక్షణాల్లో చాలాభాగం నీలోవున్నాయి. ఆయన ఏంచేస్తున్నది ఆయనకే తెలీదు—

అమ్మగార్ని గురించి, నీకు తెలుసనుకుంటాను, అయినా తెలియజేయుటం నాబాధ్యతగనుక యిప్పుడు చెప్పాల్సొస్తోంది. చాలావరకూ ఈఆస్తి ఆమెవల్ల మనసు సంక్రమించిందే, పెద్ద జమీందారు కూతురుగావడం, తండ్రిగారికి ఒక్కతేకూతురు గావడం, ఆయన తదనంతరం ఆస్తి నాన్న

గారికి సంక్రమించడం జరిగింది. అమ్మగారు చాలా అందంగా, గంభీరంగా వుండేవారు. ఆమె నడకలోనే రాజ ఠీవి సంక్రమించింది—మనకి."

"తర తరాల్నించీ, మనకో చంద్రహారంవుంది. ఆ చంద్రహారం వల్లనే అమ్మ బలైపోయింది. నాన్నగారికి అనుకోకుండా, ఒక దేవదాసితో పరిచయమయ్యింది. పరిచయం ప్రణయంగా మారింది. నాన్నగారు దాన్ని దేవత లాగా చూడ్డం మొదలెట్టారు.

నాగేంద్రుడు కులదేవతనీ, మనకి పూర్వంనించీ వస్తున్న సాంప్రదాయమనీ, నీకు తెలుసు. ఒకసారి నాగుల చవితికీ, మేళతాళాల్తో పూజ జరిగింది. సంబరం మనవైపు నించి వస్తోంది. ఆ గుంపులో నాన్నగారుంచుకున్న దేవదాసీకూడా వున్నది. నాన్నగారూ, అమ్మగారూ నుంచుని దీక్షగా ఉత్సవాన్ని చూస్తున్నారు. అమ్మగారిమెళ్లో నెక్లెస్ తళ తళ మన్నది అంటే దేవదాసీకి కళ్ళు నెక్లెస్‌మీదే వున్నాయన్నమాట!—

ఊరిమధ్యలో, ఆరోజుల్లో గన్నేరుచెట్టు ఒకటుండేది. అప్పటికి నీవుచాలా చిన్నవాడివి. చెట్టు నానుకుని పెద్ద పుట్ట వుండేది. ఆ పుట్టలో గోధుమ వన్నె త్రాచుపామొకటి వుండేది. అది ఎవర్నీ ఏం చేసేదికాదు. దానిమీదకర్రెత్తిన ప్రతివాడికళ్లూ పోయేవి. మళ్ళీ దణ్ణంపెట్టుకున్నాక వాటంతటవే వచ్చేయి. అందుకే దాన్ని దేవతాసర్పం అన్నారు.

ఒకరోజున, ఆ పాము అమ్మగారికలలో కన్పించి, చంద్రహారంచుట్టూ కాపలాకాసిందట. కలలో చంద్రహారం

ఎవరికీ, సొంత భర్తకైనా యివ్వొద్దని శాసించింది. అమ్మకి కల మెలుకువొచ్చేసరికి ఎవరూ లేరు.

ఇలా పదిరోజులు గడిచిపోయినయ్యి. ఒకరోజున నాన్నగారు పూర్తిగా తాగొచ్చారు. అమ్మని నెక్లెస్ అడిగారు. ఒకరోజు, యిచ్చింది నాల్గురోజుల తర్వాత, చంద్రహారాన్ని మళ్ళీ అడిగారు. అమ్మ యివ్వడానికి నిరాకరించింది. నాన్నగారు దేవదాసికి మాటయిచ్చారు. ఆమాట ఎక్కువైందే మరి ఆయనకి. అమ్మకి ఎన్నోవిధాలుగా నచ్చజెప్పారు. అమ్మ పెడచెవిని పెట్టింది. భర్తంటే ప్రేమలేక కాదు, నాగుబాము భయానికి జంకి.

నాన్నగారికి కోపం వచ్చింది. అమ్మ పీక పట్టుకున్నారు. బలంగా గొంతు నొక్కారు. అమ్మ విలవిల్లాడింది. ఆమె జీవం గాల్లో దీపంలాగా ఆరిపోయింది. తర్వాత ఏం జరిగిందో నీకు తెలియదనుకుంటాను. అమ్మ చచ్చిపోతుందని నాన్నగారెన్నడూ వూహించలేదు. ఈలోకంలో మనిద్దర్నీ వదిలి అమ్మ చచ్చిపోయింది. నాన్నగారే మనని చాలాకాలం వరకూ సాకుతూ వచ్చారు. ఎందుకనో తెలియదు. ఒకసారి నాన్నగారు, చచ్చిపోయి రక్తపు మడుగుల్లో వున్నారు. గన్నేరుచెట్టు దగ్గర పుట్టలోపాము కన్పించలేదు. ఆపామే నాన్నగారి శవందగ్గర చచ్చిపడివుంది. పడగ పగిలివుంది.

ఇది కేవలం కట్టుకథనుకుంటే—నేను చెప్పనవసరం లేదు. నాన్నగారి మరణానికి, పుట్టలో దేవతాసర్పం చచ్చిపడి వుండటానికి యిదమిద్ధమని కారణాలు వూహించలేము.

కాసీ కన్పించే కారణమల్లా నా అనుమానంద్రుష్ట్యా ఒకే ఒకటి—అమ్మగారి కులదైవం నాగదేవత. తర తరాల్నుండీ అనూచానంగా వస్తూన్నదీ చంద్రహారం. దాన్ని నాగు పాము యింకెవరికీ అందనీయ వద్దన్నది. ఈ పాము సామాన్యమైందికాదు. దేవతాసర్పమని ముందే చెప్పాను.

"అమ్మ చావబోయేప్పుడు ఎవ్వరూ దగ్గర్లేరు. అయినా, అంతఃపురాల్లో జరిగే విషయాలు యితరులకి తెలియడం అంటే తేలికైన విషయంకాదని అందరికీ తెలుసు. అమ్మ ఈలోకంలోంచి శాశ్వతంగా నిష్క్రమించాక్కానీ, తాను ఏం చేసిందీ ఆయనకి తెలిసిరాలేదు. భయంతో వణికి పోయాడు. నీవు పొత్తిళ్లలో బిడ్డవి. నన్ను కావిలించుకుని భోరుమని ఏడ్చాడు. అయినా, బిడ్డ చచ్చిపోయాక, మొక్కు మాట గుర్తొస్తే, వచ్చే లాభమేమున్నది?—అంతా అయి పోయాక నాన్న అమ్మనిగురించి ఏడ్వటం హాస్యాస్పదంగానే వుంటుంది. అయినా ఆగని కన్నీళ్లు - హృదయంలో సుడులు తిరగబడ జేస్తున్నాయిగదా?

"తర్వాత కొంతకాలానికి, నాన్నగారు పాము కాటుతో చనిపోయారు. చావబోతూ చెప్పిన చివరివాక్యం - 'చంద్రహారాన్ని వచ్చే యిద్దరికోడళ్ళలో ఎవరు గుణవంతులైతే వాళ్ళకివ్వ' మని దివానుగారితో చెప్పారు. చంద్రహారాన్ని నీకు చూపించకపోతే, నీకు ఎలానూ తెలిసేది కాదు. కాని నా ఆంతర్యం దానికి పూర్తిగా విరుద్ధమైనది. మీ వదినగారుకూడా ఈ హారాన్ని ఇందుకే యివ్వమంటు న్నారు"

"రాత్రకోతలన్ని పూర్తయినాయి. అన్నింటిని చెరి సగమే పంచుకుంటున్నాము. ఇంకేమన్నా అనుమానా లుంటే, యిప్పుడే ముఖాముఖి తేల్చుకుందాము. ఇప్పుడు నిన్ను కబురంపించింది, చంద్రహారాన్ని నీకు యివ్వడం కోసమే—"

చినరాజా సంతోషంతో ఎగిరి గంతువెయ్యలేదు. ఎందుకనంటే, అతనికి తెలుసు, తన భార్యకన్నా, తనవదిన గారు చాలా గౌరవనీయురాలని. మనుష్యులు, తమ తెలివి తేటలవల్ల తెలుసుకోగలరు_ఎవరు తెలివిగలవారో?_ఎవరు తెలివితక్కువవారో? ఇందుకే సంపత్తి లేకపోతే _ సుచేలా దేవి దాసీగానన్నా పడివుండే అదృష్టం ఇందుకు లేదు.

తెలివిగలిగీ, ప్రయోజకత్వం కలిగినవారు, తమ గొప్పతనాన్ని రుజువుపర్చుకో లేకుండా పోవడాని క్కారణం ధనం లేకపోవడం. ధనికుల యిళ్ళల్లో పుట్టలేక పోవడం కూడా, ఒక విధమైన దరిద్రమే! మానవుడు ప్రపంచంలో ధనంతో అన్నింటినీ కొంటూనే వున్నాడు. తన ఆధిక్యాన్ని ప్రదర్శించుకుంటూనే వున్నాడు. ధనహీనులు 'అధములు' గా భావించే శతాబ్దాలొచ్చినాయి. షాజహాన్ తన భార్య కోసం తాజమహాల్ నిర్మిస్తాడు ముంతాజ్ బీగంకోసం కట్టిన సమాధి, ప్రపంచంలోని ఏడు వింతల్లో ఒక వింత. అదే తాజ్ మహల్. పాలరాతితో నిగనిగలాడే ప్రతి రాతిలోనూ_ కూలీలు కార్చిన చెమట, స్వచ్ఛత కన్పిస్తూనే వుంది—

అనూచానంగా, వస్తున్న రాజుల వంశంలోని చంద్ర

హారం యివ్వాళ, చినరాణీ ఇందుసుందరి కంఠాన్ని అలంక రించింది. అవును. ఇది ముదావహమైనవిషయమే. అయినా, దీని సార్థకతని యిందు ఎంతవరకు ఉపయోగించుకోగల్గు తుంది?—

అదేరోజు సాయంత్రం, ఇందు తల్లి, అక్కగారూ వచ్చారు. వాళ్ళు తెచ్చిన తినుబండారాలూ, సామగ్రీ చూస్తుంటే, ఎంతనుంచి రక్తాన్ని పిండుకుతాగి, యివన్నీ తెచ్చారో—అన్పిస్తుంది ఆ సాయంత్రం ఇందు సంతోషం పట్ట పగ్గాలేకుండా పోయింది. ఎవరి పుట్టింటివాళ్ళనిచూస్తే వాళ్ళకి సంతోషం కల్గటం యధార్థమే. రాత్రి ఎనిమిదిగంట లకి సుచేలాదేవి, లీల కలసి చినజమీాందారుగారింటి కొచ్చారు. లీల అందాన్ని చూసి ముగ్ధులవని వారంటూ ఈ లోకంలో ఎవరూ లేరేమో అన్పిస్తుంది.

చినజమీాందారుగారు లీలనిచూసి దాదాపూ మూర్ఛబోయినంత పనయ్యారు. ఒక్కసారి కళ్ళముందు స్వర్గం కదలినట్లని పించింది. లోకంలో యింత అందగత్తెలు వున్నారా, అనికూడా అన్పిస్తుంది. ఈ లీల ఎవరు?—ఎక్క ణ్ణించి వచ్చింది? ఈలీలకి. సుచేలాదేవికి ఏమిటీ సంబంధం?

తాను తప్పుచేశానేమో అన్పించింది చినరాజాకి. తానూ, తన అన్నలాగా, ఒక బీదయింటిదాన్ని ఎందుకు చేసుకోలేదు? - లీలంటి అందమైన భార్య కలిగివుండటం జీవితంలో ఒక అదృష్టంగాక మరేమిటి?—ఈ లోకంలో డబ్బుతో కొనలేనివంటూ వున్నాయని లోకంలో ఎంత మందికి తెలుసు? —అందాన్ని, ఆత్మసౌందర్యాన్ని

లోకంలో ఎవరూ కొనలేరు. అందం ఆనందానికి ముఖ్య వస్తువు అందంతో దేశాన్ని ఆకట్టుకున్న వాళ్ళెందరు లేరు ఈ లోకంలో. ఒక్కో మనిషి నడుస్తుంటే, అందం వచ్చినట్టు కన్పిస్తుందిగదా?—

పూలరేకులమీద అందం, ఆకాశపు నీలిమబ్బుల మీద తెల్లని నగిషీల అందం, ఆదర్శదాంపత్యంలోని తొలి తీపుల అందం, అందమైన ఆడదాని ఎదుర్రొమ్ములమీది అందం, పసిపాప చిరునవ్వులోని స్నిగ్ధత ప్రకాశించే అందం, చందమామలోని చంద్రికాకాంతుల అందం, ఎన్ని రకాల వింత అందాలు ఈ లోకంలో!

కుమారరాజా సుచేలాదేవిని ఏంచూసి ప్రేమించారు? అందాన్నేకదా. ఆయన అదృష్టం బాగుండబట్టి, అందంతో బాటు; ఆత్మ సంస్కారంగల భార్య లభించింది. తాను ఇందుసుందరిని చేసుకున్నాడు. తనకి తప్పలేదు. తనకి లీల లాంటి అందమైన అమ్మాయి ఎవరూ దొరక్కపోవడమే అందుక్కారణం. చినరాజా లీలని ప్రేమిస్తున్నారు. ఆక ర్షణా ప్రలోభంలోపడి కొట్టుకుంటున్నారు.

ఆకర్షణ విద్యుత్తు లాంటిది. ఊరికే ప్రకాశిస్తుంది. అయస్కాంతంలా అది వీళ్ళహృదయాల్ని లాగివేస్తుంది. గుండెల్లో చేయిబెట్టి కలచివేస్తుంది–దాంతో కొట్టుమిట్టాడు కుంటారు. ఏం చెయ్యాలో తెలీదు. కానీ, ఏదోఒకటి చేస్తే బావుండును అనిపిస్తుంది. ఆ బాగుకు పరిమితిలేదు. ఆ ఒక టికి చెయ్యాలీ అనేతప్ప, సబబూ బేసబబూ అనే అర్థమూ లేదు.

ఇవ్వాళ చినరాజాగారి మనస్సూ, చూపులూ అన్నీ లీలమీదే కేంద్రీకరించి వున్నాయి ఆకర్షణా ప్రభావం మనిషిమీద పడనే పడకూడదు. పడిందంటే, యిక అది అగ్నిలా గుండెల్లో రాజి రగుల్తూనే వుంటుంది. ఈ ఆకర్షణకి తప్పొప్పులూ, మంచి చెడ్డలూ అక్కర్లేదు. అనుభవం కావాలి. దానివల్ల ఎదుటిమనిషి జీవితం నాశనమైనా బాధ లేదు. సుఖంకోసం అందర్నీ నరకడానికైనా సిద్ధపడే కటిక వాళ్ళు ఏ దేశంలోనైనా, ఏనాడైనా, చివరికి ధర్మం నాలుగుపాదాలా నడిచిన రోజుల్లోనైనా వున్నారు.

సుచేలాదేవి, నీళ్లు పోసుకున్నది. ఏవిళ్ళతో చిక్కి సగమైపోయింది. కడుపు ఎత్తుగావుంది. అడుగులు భారంగా పడుతూన్నాయి. మొదటికాన్పు. పుట్టినింటివారు తొలి కాన్పు చేయించాలి. ఒచ్చి సుచేలాదేవిని తీసుకువెళ్తారు. ఈ సమయంలోనే—ఎలాగైనా ఒక్కసారి లీలని అనుభవించాలి. అదొక్కటి తనకి కావాలి. చినరాజా మనసు లీల అందంచుట్టూ – యవ్వనంచుట్టూ తిరుగుతోంది.

అనుకున్నంతా అయ్యింది. సుచేలాదేవి తలిదండ్రులు వచ్చి సుచేలని తీసుకెళ్ళారు. ముసలిభర్త కన్నీళ్ళని చీర చెరగుతో తుడిచి, సుచేలాదేవి పల్లకీ నెక్కింది. అయితే యిక్కడ ఆవిడచేసిన పెద్ద పొరబాటు ఒకటున్నది. తనకోసం వేయికళ్ళతో తన పునరాగమనంకోసం చూసే లీల అనే దిక్కులేనిపక్షి ఒకటుందన్న విషయం. సుచేలాదేవి లీల విషయం ఎందుకో మరిచిపోయింది. ఎందుకు మర్చిపోయింది– అన్న విషయం ఆ సర్వాంతర్యామి కొక్కడికే తెలుసు.

సుచేలాదేవి పుట్టింటికెళ్ళింది. కొంతదూరమెళ్ళాక గానీ, లీల విషయం ఆవిడకి స్ఫురణకిరాలేదు. మళ్ళీ వెనక్కి తిరిగొద్దామా అన్నంత మమకారబంధం, వెనక్కి గుంజింది. మనస్సు గుంజినంతమాత్రాన మనుష్యులు వెనక్కి తిరిగి రాలేరుగదా ? అలావస్తే, యీ లోకంలో అన్నీ ఆశ్చర్యజనితాలే అయివుండేవి.

చినరాజాగారికి, అదునైన సమయం యిదే. ఇంత కన్నా మంచి తరుణం జీవితంలో మరోసారిరాదు. లీలని కళ్ళల్లో పాపలాచూచే సుచేలాదేవి, కన్నవారింటికెళ్ళింది. అథమం నాలుగునెలలకన్నా తక్కువ వుండదు. తన స్వభావంతో, ఒక్కసారి లీలని బెదిరించాలి. అనునయంతో మొదట లాలించి, లొంగని పక్షంలో బలవంతంగానైనా లొంగదీసుకురావాలి.

ఈ కాలవాహిని ఏనాటినుంచి ప్రవహిస్తున్నదో, ఆనాటినుంచీ, యీప్రేమజాడ్యం వుంటూనేవుంది. దాని కోసం రక్తపాతాలు జరిగినయ్. 'చరిత్రలు' సమ్మేళాలు కున్నాయి. సర్వనాశనమయ్యాకకూడా, ఆకర్షణ పట్టుకుని బాధించి నలిగి నాశనమైనవారు వున్నారు.

ఈ జబ్బు యీనాడు, యీ చిన్నరాజా ఒక్కడికే కాదు. ఆనాటి రాజాలనుంచి అనూచానంగా వస్తున్న ఆచారం. విలాసాలలో, విలాసినులతో కులాసాలలో – మునిగి తేలడం తప్ప కొంతమంది రాజులకు చేతనయ్యిం దేదీ యీ లోకంలో లేదు. చినరాజా ఆకోవలోవాడే.

ఈ విలాసతుమ్మెదచూపు లీలమీద పడింది. ఎలా కలుసుకోవాలా, ఎక్కడ కలుసుకోవాలా—అని బాధపడ్డారు చినరాజావారు. బాధ సర్వసామాన్యమైనది. కానీ యీ బాధ మహాభయంకరమైనది. నరనరాల్నీ కాల్చేసే, విద్యుత్తు అది. మనిషి మానాభిమానాల్నిసైతం పీల్చి, పిప్పిచేసే మహామారి ఆకర్షణ !

లీల ప్రతిరోజూ - తోటలో సాయంత్రం పొగడ చెట్టుకింద కూచుంటుందని, దాసీదొకతె నమ్మకంగా చేరవేసింది. మరుసటిరోజు సాయంత్రం - చినరాజావారు మళ్లె పొదచాటున కాపేసుకూర్చున్నారు. లీలవచ్చి, చుట్టూ కలియదిరిగింది. కాసేపున్నాక వచ్చి పొగడచెట్టుకింద కూచున్నది. గత జీవితం ఎదో గుర్తుకువచ్చినట్లున్నది; 'ఫిట్సు' - వచ్చి లుంగలుదిరిగి నేలమీదపడి కొట్టుకోసాగింది.

అక్కడున్నది ఒక్క చినరాజాయే. ఇంకెవ్వరూ లేరు. ఇప్పుడు చేయాల్సిందేమిటి ? – తాను లీలని పొందాలని వచ్చాడు. కానీ, లీల లుంగలుదిరిగి, నేలమీద పడి కొట్టుకుంటోంది. బాధ భయంకరమైంది. చిన్నరాజా లేచి నిలబడ్డారు. వెనకా ముందూ ఆలోచించలేదు. కోనేట్లో నీళ్ళు తెచ్చి, లీల ముఖంమీద చల్లారు - లీల కాసేపటికి కళ్ళు తెరిచి యీ లోకంలోకొచ్చింది. "మీరు ? – మీరు" –

చిన్నరాజా నవ్వాడు. ఆ నవ్వులో వాంఛ వున్నది. అనాదిగా మగవాడు ఆడదాన్ని లోబర్చుకునే, భయంకర

మైన తృష్ణ వున్నది. భయంలేదు – అని నవ్వే 'మత్తు' మంచి పాళ్ళల్లోవుంది. చినరాజా నిజంగానే మంచివాడు. కానీ, అతని మంచితనం విలాసాలకి బలయ్యింది. విలాసినులు అతని గౌరవాన్ని బజారుపాలుచేశారు. చినరాజాని చెడ్డవాడుగా మార్చింది అతని రసికత, సురాపానాపేక్షలు.

లోకంలో ఎవరుచేసేపని వాళ్ళకి మంచిగానే కన్పిస్తుంది. సహజమైన కాంక్షలు, ఆపేక్షలు అంతఃకరణాలో వుండటం అసహజమూకాదు; ఆపేక్షణీయమూకాదు. కోరికలకు మానవుడు బానిస. ఎన్నోచేసి చూపించగల మానవుడు 'ఆనందం' ముందు ఏనాడైనా తలవాల్చకుండా వుండలేడు. కారెంపూడిలో యుద్ధానికి సన్నద్ధమై, బయల్దేరిన బాలచంద్రుడు – మాంచాల 'మత్తు'లోపడి యుద్ధాన్నే వద్దంటాడు. ఎందుకంటే, యిలాటి ఆనందం మళ్ళా లభించదు. యుద్ధరంగంలోంచి వెనక్కి తిరిగి రాలేనేమోనన్న భయం దీనిక్కారణం. మాంచాల జ్ఞాననేత్రాన్ని తెరిపించి, మత్తుమంచును విడిలించేవరకు బాలచంద్రుడు గాడిలోంచి బైట పడడుకదా! –

చినరాజావారూ సాహసికులే. ఆత్మసౌందర్యం వున్నవారే. కానీ, ఏంజరిగింది? – ఆయన అగౌరవమనే చీకటిని నెత్తిమీదనుంచి దించుకోలేకపోయారు.

లీలకి ఏంజరిగిందీ తెలీదు – కళ్ళుతిరిగి పడిపోయింది. పాతఘటనలు నిష్ఠురవ్యాలు రాల్చి మంటలు చేస్తుంటే, నిలవలేక గిలగిలా తన్నుకున్నది. తాను కళ్ళుతెర్చి చూసే

సరికి చినరాజావారి తొడమీద తలపెట్టుకుని పడుకున్నది. నిజమా ? – తాను స్వప్నంలో లేనుగదా ? – సామాన్యమైన దాసీదాన్ని, చినరాజావారు తొడమీద తలపెట్టుకుని – ఆప్యాయతతో ఆదరించడమా ?

ఆడది ఒక్తి బలహీనురాలు. చిన్న సహాయాన్ని పెద్దదిగా భావిస్తుంది. పూరి కేలాంగుతుంది. జీవితంలో ఏనాడూ తప్పటడుగు వేయని ఆడది ఒక్కసారి ఏదో తృప్తిలో అడుగున మట్టి కూరుకున్న కోనేట్లో కాలు వేస్తుంది, పైకి కన్పించే కలువలనుజూసి. అడుగున మట్టివున్నదేమో – అనే ఆలోచనని హృదయంలోంచి దూరంగా తోసి పారేస్తుంది. ఒక్కసారి సుఖాన్ని అనుభవించిన మనిషి, ఆ సుఖాన్నే మళ్ళా కోరుకుంటుంది. దీన్ని శాసించింది ప్రకృతి. హృదయంలో "సుఖాల" దీపాన్ని ఆర్పుకుని, శీలంకోసం సమాజంకోసం దడిసే పతివ్రతకన్నా, ఏ బాధలూ లేని పతిత నయం. లీల సుఖాన్ని అనుభవించింది. ఒకనాడు తియ్యని స్వర్గాల్లో తేలిపోయింది. కాని విధాత, దాన్ని తననుండి దూరం చేశాడు. సుఖం నీకు యింతవరకే–హద్దు అని శాసించాడు. లోకం, సంఘం తనని అన్యాయం చేసింది. పరిస్థితులకు తట్టుకోలేక పారిపోయి వచ్చింది.

తనకీ సహజమైన కాంక్షలుంటాయని, యీలోకం ఎలా తెల్సుకోగల్గుతుంది ? – తెల్సుకోలేకపోవడం, ఒక విధంగా పాపమేనని యీప్రపంచం, సాలోచనతో ఒక్కసారి ఎందుకు సమాలోచించలేకపోయింది ?

ఇవ్వాళ, మళ్ళీ పాతజీవితపు పుటల్లోని సుఖాలు నీటిమీద తరగల్లాగా కళ్ళముందు తేలిపోతున్నాయి. లీల చినరాజాని ప్రేమించింది. ఇది సంభవమా ? — అనే ప్రశ్నని లీలనే, అడిగితే బావుంటుంది. అయినా, దీనికి లీలే కాదు, ఏ ఆడదైనా ఏమని సమాధానం చెప్తుంది ?

చినరాజా లీలని వదలి తోటలోంచి దివాణం గోడ చాటున అదృశ్యమయ్యాడు. స్పర్శనిమాత్రమే యిద్దరూ అనుభవించింది. శారీరకమైన ఆనందాన్ని అనుభవించలేదు. ఆ సమయమూ, కావాలనుకుంటే దరిదాపుల్లోనేవుంది. ఇద్దరికీ గాఢమైన ప్రేమముద్ర హృదయాల్లో హత్తుకునేవున్నది. ఇది మరెవ్వరూ చెరపడానికి వీల్లేనిది.

ఇందుసుందరికూడా, యివ్వాళ పుట్టింటికి వెళ్తోంది, అమ్మా, అక్కయ్యలతో పాటు. పుట్టింటిమమకారం అప్పుడే ఇందుకి ఎలావదుల్తుంది! ఇందు పుట్టింటికి వెళ్ళడానికి, చినరాజా ఏమీ అభ్యంతరం చెప్పలేదు. ఇందుకి భర్తని వదలిపోతుంటే, కళ్ల వెంట నీళ్ళువచ్చినాయి. తెంచుకోలేని, ఆడదాని భవబంధం — చిటికె నీరయ్యే, మానసిక బలహీనత.

ఇందు పుట్టింటికి వెడుతున్నప్పుడు, లీలకూడా దగ్గరే వుంది. లీలకూ కూడా కళ్ల వెంట నీళ్లువచ్చాయి. ఇందు బగ్గీలోకి ఎక్కుతూ లీల చేతిని, తన చేతిలోకి తీసుకుని నొక్కింది ఆమె అంతరాత్మలో నిర్దయుడైన దేవుడు లీలకు ఎందుకు అన్యాయంచేశాడు ? — అనే ప్రశ్న వున్నది. బగ్గీ కదిలిపోయింది. కాని లీల ఇందు హృదయఫలకం లోంచి చెదిరిపోలేదు.

అవును, యిందు లీలని చాలా వున్నతంగా, వుదాత్తంగా ప్రేమిస్తోంది. లీలకీ, ఆరాత్రి చాలాసేపటివరకూ నిద్ర పట్టలేదు. ఆలోచనల్లో ఆవిడ తల దిమ్మెక్కిపోయింది. చినరాజా తనని ప్రేమిస్తున్నాడు. ఇందుకు అన్యాయం చేస్తున్నానా ? తనని యింత గాఢంగా ప్రేమించే, ఇందు వాటాలో తాను భాగస్వామిని ఎందుకావాలని కోరుకుంటోంది. భారతీయ సంస్కృతి పవిత్రమైనది. తానా భర్త్రు విహీన. వీళ్ళకి కాంక్షలంటూ వుండకూడదు. కానీ, తాను అందుకు భిన్నంగా ప్రవర్తిస్తోంది. తాను తన కాంక్షలకి కళ్ళెం వేయలేకపోతోంది. పోనీ చినరాజా బ్రహ్మచారి కాదు. అతనికి అగ్నిసాక్షిగా తాళిగట్టిన భార్య వున్నది. ఆ భార్యకి తనంటే ఆప్యాయతవుంది, అనురాగంవుంది. కానీ తన హృదయం చినరాజాని కోరుతోంది.

లేదు. తాను మూర్ఖంగా పొరపాటు పడుతోంది. తను కాంక్షల్ని ఏనాడో చంపుకున్నది. మర్చిపోవడానికి ప్రయత్నిస్తోంది. ఇంతకాలంనించీ, నిలదొక్కుకున్న శీలం యీనాడు అపవిత్రం కావడాన్ని తను సహించలేదు. హృదయంలో అగ్నిపర్వతాలు పగులుతున్నా, చిరునవ్వు ముఖాన చిందింపజేయడమే వివేకుల లక్షణం. నాల్గువైపులా చీకటి ముసురుకున్నా ఎక్కడో వున్న ఆశాదీపాన్ని వెతుక్కునే మనిషి, అదృష్టజాతకకథానికల్లోని రాజకుమారుడు. జీవితం రోజాపూలపాన్పుకాదు. అంతమాత్రాన కంటక వితానమూ కాదు. సుఖదుఃఖాలూ, వెలుగునీడలూ, అమృతవిషా

దాలూ పడుగుపేకల్లా కలసివుండేదే జీవితం. జీవితానికి అర్థంవుంది. అర్థాన్ని అవగాహన చేసుకోకపోతే, అనర్థం వాటిల్లుతుంది. సాటివారిలో సహృదయతని పెంపొందింప జేసుకోవడం, అత్యద్భుతమైన కళ. తాను పొరపాటుపని చేయడంవలన తనకి పూర్తిగా యిక్కడ స్థానం పోవచ్చు. అనాదిగా ఆడదానికి జరుగుతున్న అన్యాయమే, తనకీ జరుగు తుంది – వద్దు భగవాన్, వద్దు, యీ కళంకాన్ని నేను మోయలేను. లీల మంచంమీద పడుకుని ఏడ్చింది. అలా ఏడుస్తూ, ఏడుస్తూ, ఎప్పుడో తనకి తెలీకుండా నిద్రపోయింది.

ఎవరో తలుపు తడుతున్నారు. ఒక్కసారి, ఫులిక్కి పడి లేచి తలుపుతీసింది. చీకటైనా ఆ ఆకారం స్పష్టంగా కనిపిస్తూనేవుంది. అతనే చినరాజా! 'మీరా' అన్నది భయంతో. అలామాట పూర్తికాకముందే చినరాజా చనువుగా చేతిని భుజంమీద ఆనించారు. ఎన్నో చెప్దామను కున్న లీల కంఠం బిగుసుకుపోయింది. ఏమీ చెప్పలేక పోయింది. కానీ, కళ్ళవెంట నీళ్ళు వస్తున్నాయి. ఆ కన్నీ ళ్ళలో ఆడదాని ఆంతర్యంవుంది – అసమర్థతవుంది. ఏం చెయ్యాలనుకుందో, అవన్ని తనగుండెల్లోనే సుడులు తిరుగు తున్నాయి.

చినరాజా లీల కన్నీళ్ళు తుడిచారు. అప్రయత్నంగా, ఆమె అతనిగుండెలపై వాలిపోయింది. తర్వాత ఏంజరిగింది! చిన్నరాజా పెదాలు, ఆమె చెంపల్ని స్పృశించాయి. వేళ్లు చీకట్లో – జాకెట్ గుండీల్ని వెదుకుతున్నాయి – ఒక్క సారిగా చాలాకాలంనాడు అనుభవించిన స్వర్గద్వారాలు మళ్ళీ యివ్వాళ తెరుపునబడ్డాయి.

అనుకున్నదొకటి_జరిగింది మరొకటి ! ఏం జరిగిందో, ఏం జరగాలనుకుందో - అన్నీ ఒక్కసారి తారుమారై నాయి - జీవిత విధానాన్నే తారుమారు జేసిన చిత్రమైన ఘటనలు!

తర్వాత తర్వాత - లీలకి, చినరాజాకి వున్న బాంధవ్యాలు ఎక్కువైనాయి. అయితే అది బైటికి పొక్కలేదు. వాళ్ళిద్దరూ రాత్రి రెండుగంటలకి తోటలో కలుసుకునేవారు.

మళ్ళీ రెండురోజుల్లో ఇందు -- తిరిగి మెట్టినింటికి రాబోతోంది. పుట్టింటినించి వాళ్ళు కబురు పంపించారు. అంటే లీలా, చినరాజావారూ ఎప్పుడుబడితే, అప్పుడు కలుసుకోకూడదన్నమాట ! ఇందు రాకతో మళ్ళీ యీ దివాణంలో కొత్తచరిత్ర ప్రారంభంకావచ్చు.

ఇందు తిరిగి మెట్టినింటికొచ్చింది. అయితే యీ విషయాలు - లీలకీ చినరాజాకి మధ్య జరిగిన విషయాలూ - లోకంలో యింకెవరికీ తెలియవు ఇక్కడున్న మనుష్యులకే యీ విషయాలు తెలియకపోతే, యింకా ఇందుకెలా తెలుస్తాయి ! చీకటి చాటున జరిగే తప్పులు, భయంకరమైన హత్యలూ: లోకంలో యింకొకరికి ఎట్టిపరిస్థితుల్లోనూ తెలియడానికి వీలుండదు. అలా తెలిసే పరిస్థితులేవస్తే, తర్వాత జరిగే విప్లవాల సంగతి తర్వాత -

ఇందు రాకతో అలజడి ప్రారంభమైంది రాచరికపు గౌరవాలు మళ్ళీ చిగుళ్ళు తొడిగి మొగ్గలువేయడం ప్రారంభించాయి. నిన్నటివరకూ వెలగని పడగ్గది లైట్లు మళ్ళీ

యివ్వాళ వెలిగాయి. సెంట్ల గుబాళింపు నాసికాపుటాల్ని చక్కిలిగింతలు పెడ్తోన్నాయి. ఆరాత్రి సుఖాల్ని అనుభవించింది ఇందుమాత్రమేగాదీ, చినరాజాకాదు. అతను ఇందును కావిలించుకుని, "లీలగా" లీలగా వూహించుకున్నాడు. దాన్లో ఏదోఒక తృప్తి వున్నది.

జీవితానికి ఏదో ఒక తృప్తి వుండటం సహజమే. తృప్తిలేక జీవితమూ లేదు; ఆశలేని మానవుడూ లేడు. ఆశ ఎండమావి. ఈ ఆశామావులే, లేకపోతే మానవుడు యింత వున్నతిని సాధించడానికి వీల్లేదు ఏనాడో, మానవ జీవిత చరిత్ర అంతమైవుండేది.

లీల, చినజమీందారూ కలుసుకోవడం, ఇందు వచ్చిన గతమూడు రోజుల్నుండీ - వీలుపడటం లేదు. దీనికోసం లీల పెద్దగా బాధపడనూ లేదు. ఎవరు యెవరి హక్కువారు, వాళ్ళ హక్కుని అనుభవిస్తున్నారు. ఇందువలన లీల బాధపడితే, వచ్చేప్రయోజనమేమీలేదు. అగ్నిసాక్షిగా తాళిగట్టిన భర్త, తన భార్యని ప్రేమించడంలో తప్పు లేదు. అది హక్కు; తాళిగట్టిన రోజునే తమ సమభాగాన్ని భర్త భార్యకి ధారపోశాడు.

మళ్ళీ ఇవాళ రాత్రి చినరాజా లీల గదితలుపు తట్టాడు. లీల ఆశ్చర్యంగా లేచి నిలబడి తలుపుతీసింది. అదే గంభీరమైన విగ్రహం, కళ్ళయెదుట నిలబడివున్నది. చిన రాజాగారు మారుమాటాడకుండా వచ్చి తలుపు కానుకుని నిలబడ్డారు.

'రండి' అని లీల ఆహ్వానించింది.

చినరాజాగారు గంభీరంగా వచ్చి మంచంమీద కూచున్నారు. చాలాసేపటివరకు నిశ్శబ్దం తాండవించింది. ఏ ఒక్కరి నోటివెంటా మాటలేదు. 'మూగ వేదన' -యిదే కాబోలు!

'లీలా, నీకు ఒక్కమాట చెప్దామని, ఇందు వెళ్లినప్పటినుంచీ అనుకుంటూనే వున్నాను. కాని చెప్పలేకపోయాను. నా పాపానికి బహుశా నిష్కృతి లేకపోవచ్చు. నేనూ, నీలాంటి బీదదాన్ని ఎందుకు చేసుకోలేదా, మా అన్నలాగా జ్ఞాననేత్రాన్ని యెందుకు తెరవలేదా-అని బాధపడుతున్నాను. ఇద్దరు ముగ్గురు భార్యలుండటం జమీందారీ వంశాలకు నిషిద్ధమేమీకాదు. నీకు అభ్యంతరం లేకపోతే, నిన్నుభార్యగా స్వీకరించడానికి,నాహృదయంతహతహలాడుతోంది. నీవు యెలా వచ్చావో, నీ గత జీవితచరిత్ర ఏమిటో దానితో నాకేం సంబంధంలేదు. నీవు నాకు కావాలి. నీ మానసిక సౌందర్యం నాక్కావాలి. ఇందువల్ల, ఇందుకు అన్యాయం జరగదా, అని నీవు బాధపడొచ్చు.

ఒక్కొకళ్లు సుఖాల్ని అనుభవించడానికే పుడతారు. ఇందు సుఖం అనుభవించడానికే, ఈ లోకంలో పుట్టింది. దానికి, నీవేమీ బాధపడనక్కరలేదు. లీలా, అంతులేనంత ధనంవుంది, అనుభవించగల హక్కూవున్నది. ఇది ఒక్క ఇందుదేకాదు. నా మనస్సు నచ్చినట్లయితే, ఎవరికయినా పెట్టుకోవచ్చు.

లీలా, యిది కల్పిత కథ కాదు. చచ్చిపోయిన, నా

కన్నతల్లి సాక్షిగా, నిజం చెపుతున్నాను. నీ అభిమతాన్ని తెలియచెయ్యి. నిర్ణయించుకో. జీవితాన్ని గురించి బాగా ఆలోచించుకో – ప్రతి మనిషికి తోడువుండాలి. ముఖ్యంగా ఆడదానికి. నీ భర్త చచ్చిపోయాడు. దాంతోపాటు నీ కాంక్షలన్నీ చావాలనే, నిర్ణయం ఏనాటిదో—

కానీ, యివ్వాళ ఉద్రేకంతో నేనూ తప్పుచేశాను. ఆ తప్పుకు నీవూ లోబడ్డావు. దీనికి కారణం, యిద్దరికీ సహజమైన వాంఛలుండటం –యివి బలీయమైన వాంఛలు. తెంచుకోలేనివి. లీలా, మనం యిద్దరం చేసిన తప్పుకు ప్రతిఫలంగా, యిద్దరం ఒక బంధానికి కట్టుబడివుండటం అవసరం. ఇది అపవిత్రంగా, ప్రపంచం పరిగణించినా, నా దృక్పథంలో పరమ పవిత్రమైంది. ఈ పవిత్ర ప్రేమవాహినిలో, నీవూ ఒక జలబిందు వెందుకవగూడదు?

ఒక్కసారి జీవితాన్ని గురించి బాగా ఆలోచించుకో– ఇంకా, యిక్కడ వుండటానికి టైములేదు. ఇందు ఏ క్షణంలోనైనా, నిద్రనుంచిలేవవచ్చు. భయమనికాదు. 'నిర్ణయం' అంటూ కాందే, ముందుగానే గాలివార్తలు ప్రచారం గావడం అంతమంచిదిగాదని నా వుద్దేశ్యం' లీల జాగ్రత్తగా విన్నది. కాని యేదో చెబుదామనుకున్నది. చెప్పలేక పోయింది. దించిన తల యెత్తేసరికి, అప్పుడే చినరాజా, తోటలోని చెట్లనీడలో కలిసిపోయారు.

# 6

పతాకసన్నివేశం అయ్యేసరికి, రాత్రి పన్నెండు గంటలయింది. బాల యింటికి బయల్దేరింది. విశ్వానికి యింకొంచం పనివుంది. అందుకే అతను యింకొంచెంసేపు ఆగాల్సివుంటుంది. రేణుక స్టూడియో కాంటిన్‌లో కాఫీ తాగడానికి విశ్వాన్ని పిల్చింది. విశ్వం వెళ్ళబోతున్న బాలని ఆపి – చనువుగా బాల భుజంమీద చెయివేసి, 'రండి–కాఫీకి వెళ్దాం' అన్నాడు.

బాల కొంచెం, ఇన్‌ఫీరియారిటీ ఫీలయ్యింది. మానవుడు జీవితంలో పూర్తిగా పతనమైనా, ఇన్‌ఫీరియారిటీని మాత్రం వొదులుకోలేడు. కాని విశ్వం పిలుపులో ఆప్యాయత వున్నది ఆ ఆప్యాయతలో దురూహలేదు. బాలా, రేణుకా, విశ్వం కలిసి కాంటీన్‌కి బయలుదేరారు. స్టూడియోకి కొంచెం దూరంలో కాంటిన్ వుంది.

స్టూడియోలోంచి బైటకొచ్చేసరికి హాయిగావుంది. ఆకాశంమీద నక్షత్రాల నగిషీలు మెరుస్తున్నాయి. చల్లగాలి, మెల్లిగా, మత్తుగా, మంజులంగా, సముద్ర కెరటాల మీదనుంచి సరదాగా, విలాసినిలా పరుగెత్తుకుంటో వస్తోంది. వెన్నెల మసక కిరణాలు భూమిమీద, స్టూడియో పూలమొక్కల ఆకుల్లోనూ, మొగ్గల్లోనూ దాక్కుంటున్నాయి.

"హాయిగా వుంది" అంది రేణుక.

"హాయిగానే వుంది. కాని సుఖకాంతులు యీ కాస్సే పైనా, అనుభవిద్దాం" అన్నాడు విశ్వం. బాలా, రేణుకా నవ్వారు. కాఫీతాగి సిగరెటు ముట్టించాడు విశ్వం. మొట్ట మొదటిసారిగా, సిగరెట్ తాగడం——

"మీకిదివరకు అలవాటు లేదుగా" అంది రేణుక.

'జీవితంలో ఏదీ అలవాటు లేందీ? – అమ్మ అని పిలవడం కెవరు నేర్పిన అలవాటు. అలవాటు ఏదైనా సహజంగా వస్తుంది. ఆ సహజమైన అలవాటును, మంచీ, చెడుగా నిర్ణయించేవి ప్రకృతి, సమాజాలు. మానవజీవితంలో అదృష్టం దానంతటదే వెతుక్కుంటూ వచ్చినరోజున ఏ అలవాటైనా బాధలేదు. సుఖాల్ని ఒక్కో మానవుడు, ఒక్కో అలవాటుద్వారా పొందగల్గుతున్నాడు. కాని మంచిని త్వరగా గ్రహించలేని సంఘం, చెడును వెంటనే వేలెత్తి చూపించగలదు. దీనికోసం బాధపడి ప్రపంచాన్ని తిట్టిపోయడంవలన వచ్చే లాభమూ లేదు; పొందగలిగిన ప్రయోజనమూ లేదు. సంస్కరణ హృదయంలోంచి, యెవరికి వారికే రావాలి. అనంతమైన దైవలీలలులాగా, అనంతమైన సుఖాలూ, ఆనందాలూ యీ లోకంలో లభిస్తూనే వుంటాయి.'

రేణుక చిరునవ్వు నవ్వి 'వేదాంతం నేర్చుకున్నారు' అంది.

'నిత్యజీవితం వేదాంతంలా, నిజం చేదుగా కన్పించడంలో ఆశ్చర్యంలేదు రేణుకాదేవీ! కొన్ని వేల సంవత్సరాలనుంచీ, వస్తున్న ఆచారాలూ, సాంప్రదాయాలూ మనం

మార్చడానికి వీల్లేనివి. వాటిని మార్చాలంటే, యింకా కొన్ని శతాబ్దాలు పడుతుంది. ఏకాలంలోనైనా మంచిని నిరాదరణచేసే, మూర్ఖులు వుంటూనే వుంటారు. ఎంత ముందుకు పోతున్నామని భ్రమిస్తున్నామో, అంత వెనుకంజ వేస్తున్నామని లోకంలో ఎంతమందికి తెలుసు? పురాణాలూ, వేదాలూ పవిత్రమైనవి, పూజనీయమైనవే. వాటిని కాదన గలిగిన సాహసం, ఈలోకంలో ఎవరికీలేదు. వాటిని అడ్డం పెట్టుకుని, తప్పుడుపనులుచేసే మూర్ఖులు పవిత్రతని, పంకిలంజేస్తున్నారు.'

'విశ్వంగారూ, మీకు ఫోన్‌వచ్చింది' అన్నాడు స్టూడియో బాయ్.

విశ్వం లేచి నుంచున్నాడు. రేణుకకూడా లేచి నుంచుంది. బాల యింకా అక్కడే కూర్చునివున్నది. పోతున్న విశ్వం వెనక్కితిరిగి, 'బాలగారూ, మీరు ఇంకా యిక్కడే కూచుంటారా? ఇదో, నేనూ చెప్పివచ్చేస్తాను' అన్నాడు. బాల సరేనన్నట్లు తలవూపింది.

విశ్వం ఫోను రిసీవ్ చేసుకున్నాడు.

'హలో! మదనగారా? ఎప్పుడొచ్చారు. పదకొండు న్నర ట్రయిన్‌కా? ఇదో; వచ్చేస్తున్నాను. వెంటనే వచ్చేస్తున్నాను. ఆఁ... ఆఁ... ఐసీ. అలాగే, అలాగే' అన్నాడు.

'ఎవరు' అన్నది రేణుక.

'మదన అనీ, మా వసంతా వాళ్ళ పెద్దమ్మగారమ్మాయి హైద్రాబాడ్‌నుంచి వచ్చింది. నన్ను చూడాలని వుందట. వెంటనే రమ్మని ఫోను చేసింది.'

'చదువుకుంటున్నదా?'

'బి. ఎ. అనుకుంటాను'

'అందంగా వుంటుందా?'

'చాలా అందంగా వుంటుంది'.

'ఓహో! అందుకే, మిమ్మల్ని దక్కించుకోవాలని చూస్తున్నదేమో!'

ఈ మాటకి విశ్వం ఆశ్చర్యపోయాడు. 'అంటే,' అన్నాడు. 'అంటే మరేంలేదు. మీలాంటి అందమైన వాణ్ణి దక్కించుకోవడానికి ఏ ఆడదయినా తాపత్రయ పడుతుంది.'

'నిజమా?'

'ఊఁ... నిజం...'

'మీరుకూడానా?'

'ఊఁ...'

'మీరు చాలా పొరపడుతున్నారు రేణుకాదేవి! పొందాలనుకున్న ప్రతివస్తువునూ పొందడం అనుకున్నంత తేలికయిన విషయంకాదు. మీకు తెలీదేమో? నేను పూర్తిగా అస్వతంత్రుణ్ణి. వసంత నన్ను ఆదరించింది. ఆశ్రయమిచ్చింది. ఆమెను కాదనుకొని, ఆమె మాట వ్యతిరేకించి, నేను చేయగలిగిందేమీ లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆమె మాట జవదాటే అధికారం నాకు లేదు. నిజం; నాకు లేదు.'

రేణుక చిరునవ్వు నవ్వి, 'సరే, పదండిపోదాం' అన్నది. విశ్వం చేతినిపట్టుకుంటో, రేణుక నడుస్తోంది.

విశ్వం తలవంచుకుని నడుస్తున్నాడు. రేణుక అన్నమాటలే పదే పదే చెవుల్లో గింగిరాలు తిరుగుతున్నాయి. 'మీలాంటి అందమైనవాణ్ణి దక్కించుకోవాలని, ఏ ఆడదైనా, తాపత్రయ పడ్తుంది!'

కార్లో బాలా, విశ్వం, రేణుకా ఎక్కికూచున్నారు.

విశ్వం బాల ప్రక్కన కూచున్నాడు. ఇది రేణుక్కి యిష్టంలేదు. విశ్వం ఒక సామాన్యమైన ఎక్స్ట్రా ప్రక్కన కూర్చోడమేమిటి? రేణుకకి యిష్టంలేకపోవచ్చు. అయినంత మాత్రాన, ఏమీ చేయలేదుగదా. విశ్వాన్ని శాసించే అధికారం నిజంగా, రేణుకకి లేదు.

'రేణుకాదేవీ; ఒకమాటఅడగమంటారా,' అన్నాడు విశ్వం.

'అడగండి—దాన్దేముంది?'

'కేవలం మానవుల అందాల్ని చూసే ప్రేమిస్తే, ఆత్మ సంస్కారాన్ని ప్రేమించే దెన్నడు?'

'ఆత్మ సంస్కారంలేని మగవాడి హృదయాన్ని మేల్కొల్పడం ఆడదాని కంత కష్టంకాదు. ప్రపంచాన్ని మాతృత్వంతో, జోకొట్టగల ఆడది ఒక్క మనసును మేల్కొల్పలేదా?'

'మరి చితికిపోయిన సంసారాల మాటేమిటి?'

'వాళ్ళు భర్తని కొన్ని ఆనందాలకోసరమేవాడుకుంటున్నారు. తనభర్త, తననితప్ప, యింక వేరెవ్వర్నీ వాంఛించగూడదు. ఈ వాంఛలో స్వార్థంవుంది. ఈ స్వార్థం గృహంలో కల్లోలాల్ని రేపుతుంది. ఖారపొచ్చాలు రానే

రాగూడదు. అవి వచ్చాక సుఖశాంతులు అన్నీ సమూలంగా తెంచుకుపోవాల్సొస్తుంది.'

"చాలు. నా కర్థమైంది" అన్నాడు విశ్వం. బాల నవ్వింది. రేణుక నవ్వాలని ప్రయత్నించిందిగానీ, ఆ నవ్వు పెదాలచాటునే ఆగిపోయింది. విశ్వం, తనని హేళనచేస్తున్నట్లు ఫీలయ్యింది.

కారు విశ్వం యింటి గేటుముందు ఆగిపోయింది. విశ్వం వెళ్లేసరికి వసంతా, మదన మాట్లాడుకుంటున్న వాళ్ళల్లాఆగి,పిట్టగోడ ముందుకొచ్చినిలబడిపోయారు. విశ్వం చిరునవ్వుతో బాలకీ, రేణుక్కీ గుడ్ నైట్ చెప్పి - మేడ మెట్లెక్కిపోయాడు. కారు స్టార్టయ్యింది.

మదన చిరునవ్వుతో విశ్వానికి ఎదురొచ్చింది. "కులాసాయేనా మదనాదేవిగారూ" అన్నాడు విశ్వం. కులాసాయే నన్నట్లు మదన తల వూపింది."వసంత ఎక్కడ" అన్నాడు విశ్వం. "భోజనాల గదిలో వుంది" అన్నది మదన. "సరే పదండి కల్సుకుందాం" అన్నాడు విశ్వం— మదనా, విశ్వమూ కలసి గదిలో కొచ్చేసరికి, వసంత టేబుల్ మీల్స్ అరేంజి చేస్తోంది. "వసంతా" అన్నాడు విశ్వం. వసంత ఒక్కసారి తలపైకెత్తి చిరునవ్వు నవ్వి, మళ్ళీ తనపనిలో లీనమయ్యింది.

ఇవ్వాళ, వసంత చాలాబాగా అలంకరించుకున్నది. తలలోంచి, విచ్చిన మల్లెపూల వాసన మనసుకి మత్తెక్కిస్తోంది. ఖటావ్ వాయిల్ చీర గాలికి రెపరెప లాడ్తోంది.

గాలికి రేగిన వెంట్రుకలు, ముఖాన సోయిగాలు పోతు న్నాయి—

"ఇవ్వాళ, చాలా అందంగా వున్నారు. ఏమిటా కథ?"—అన్నాడు విశ్వం.

వసంత కళ్ళు మెరిపించి, మూతిని అరసున్నాలా చుట్టి, "అదో పెద్ద కథలేండి. నిజం. బ్రహ్మాండమైన కథ" అన్నది—

"నిజమా" అన్నాడు విశ్వం. అని వసంతచేయి పట్టుకున్నాడు. పూలు వాసనచూద్దాం, అనే నెపంతో చెయిపట్టుకుని దగ్గరకు లాక్కున్నాడు. వసంత సిగ్గుతో తల కిందకు వాల్చుకుంది. జడ మీదికి వాలినముఖం, భుజం పైదాకాపోయి—భుజంమీద ఆనుకుని, భుజాన్ని పంటితో సుకుమారంగా కొరికింది. "ఏయ్, చిలిపీ" అన్నది వసంత - విశ్వం వసంత నడుం చుట్టూ చెయివేసి, "నేను భవదీయ దాసుడను"—తర్వాతరాక "దేవీ" అన్నాడు—అని నవ్వాడు.

ఇదంతా మదన చూస్తూనేవుంది. అసూయతో ఆమె హృదయం భగ్గుమంది. ఇంతలో వసంత అందుకుని, "చూశావా అక్కయ్యా విశ్వంగారు," అంది. మదన విషపు చిరునవ్వు నవ్వి 'ఏం చేశారేమిటి?'—అన్నది.

"ఏం చేశారూ అంటావేమిటి?—నా నోటితో చెప్పించుకోవాలని కాకపోతే. అంతా నువ్వుచూశ్లేదామ్మా. అదిగో చూడు. మళ్ళీ. అబ్బ, అందుకే జడ వదలండి విశ్వం గారూ... వుహూ అంటారేమిటి?—అదే.... అందుకనే"—

"వుహూఁ..." అన్నాడు విశ్వం—

ఇదంతా మదనకి చిరాకుపుట్టిస్తోంది. ఛీ...ఛీ...అనుకున్నది. అసూయతో ఆమెహృదయం భగ్గుమన్నది. చాలా వరకూ ఒచ్చింది. వీళ్ళిద్దరూ గాఢంగా ప్రేమించుకున్నారు. విశ్వం హృదయంలోంచి, వసంతని తప్పక తప్పించాలి. లాభంలేదు. తను ఎవరినైతే తనకా్కవాలనుకుందో, తను కలల్లో రాజకుమారైనట్లు కలలుగందో – ఆ రాజకుమారుడే యింకోరితో సుఖాన్ని అనుభవిస్తున్నాడు. ఇది తను సహించలేదు. తన ఆంతర్యం అందుకు ఒప్పుకోదు.

మమకార బాంధవ్యాలు బద్దలైతేగానీ, విశ్వం చెడ్డవాడని వసంతకి నూరిపోస్తేగానీ, తనకి హృదయంలో శాంతి లేదు. ఈ అశాంతి అనే సముద్రపు గట్టుమీద తను ఒంటిగా గమ్యాన్నెరుగని 'పడవ నావికుడు'గా బ్రతకలేదు. ఏం చేస్తే, వసంత హృదయంలోని ఆశాకిరణాల్ని సుడిగుండాల లోతుల్లోకి నెట్టగలదు! ఈ ప్రేమవాహినిని ఏ సముద్రాల్లోకి ప్రవహింపచేయాలి. ఇలారాత్రంతా మదనకి దురాలోచనలతోనే గడిచిపోయింది. కానీ, విశ్వమూ, వసంతా హాయిగా నిద్రబోయారు. రాత్రి బిజీగావుండటంవల్ల, వళ్ళెరగని ఆనందంలో నిద్రబోవడంవల్లా తెల్లారి తొమ్మిదిగంటలగ్గానీ, విశ్వానికి మెలుకువ రాలేదు. కళ్ళుదెరిచి చూసేసరికి ఎదుట 'వసంత' అనే దివ్యసుందరి ప్రత్యక్షమయ్యింది.

విశ్వం, చిరునవ్వు నవ్వి, "హాయ్, బ్యూటిఫుల్" అన్నాడు—

"వూహూ..." అన్నది వసంత.

విశ్వం పట్టుకో బోయేసరికి వసంత పరుగెత్తింది. విశ్వానికి దొరికింది, చీరచెంగు ఒక్కటే. దాన్ని బట్టుకుని ఒక్కగుంజు గుంజాడు. వసంత వూపులోవచ్చి విశ్వం ఒళ్ళో కూలబడిపోయింది. విశ్వం చెవిలో నెమ్మదిగా 'ఎక్కడికి పోతావ్?' అన్నాడు. 'నా యిష్టంవచ్చిన చోటుకి' అన్నది వసంత. 'నాయిష్టం లేనుండానే' అన్నాడు విశ్వం. ఇద్దరూ నవ్వుకూంటూండగా, మదన వచ్చేదల్లా ఆగి, కిటికీ సందులోంచి ఈ దృశ్యాన్ని చూసి క్షణం విభ్రాంతిచెంది, అసూయతో ఒక్కనిట్టూర్పు విడిచి, వెనక్కి తిరిగిపోయింది.

కాలం ఏం నిర్ణయించింది? మానవుడు దాన్నెంత వరకు శాసించగలిగాడు? వీటిని నిర్ణయించడం చాలాకష్టం. ఎమటి మానవుణ్ణి, మనం ప్రేమించవచ్చు. మనల్ని వాళ్ళు ఎంతవరకు ప్రేమించుతున్నారో, లేదా అసహ్య పడుతున్నారో మనకెలా తెలుస్తుంది?

ఇదే సమయంలో, రేణుక వచ్చింది. అప్పుడే వెళ్ళిన రేణుక, మళ్ళా అప్పుడే, ఎందుకు తిరిగొచ్చింది?– విశ్వానికి ఆశ్చర్యమేసింది. 'విశ్వంబాబుగా రున్నారా!'– అన్నది రేణుక 'ఆఁ...వున్నాను. రండి.' అన్నాడు విశ్వం. 'ఇప్పుడేగదా వెళ్ళారు. అప్పుడే వచ్చారేమిటి?—అన్నాడు విశ్వం.

"ఏం లేదు. పెద్ద ఆశ్చర్యకరమైన విషయమేమీ కాదు. కారు, చిన్నయాక్సిడెంట్ పాలయ్యింది. అందుకని తిరిగి రావాల్సొచ్చింది. 'మరి బాలో?'— రేణుక నవ్వి 'బాల విషయంతప్ప యింకేమీలేవా విశ్వంగారూ, ముచ్చ

టించుకోవడానికి! దెబ్బలంటూ ఎవరికీ తగల్లేదు. నేను పిరికి దాన్ని. ఇంటిదాకా వెళ్ళాలంటే భయమేసింది. అందుకని తిరిగొచ్చాను. బాల వెళ్ళిపోయింది. నాకేదో భయంగా వుంది. ఇంటిదాకా పంపించివస్తా రేమోనని?'—

"ఇప్పుడా, ఇంటిదాకానా?'—అన్నది వసంత.

"మాయిల్లు దూరం కాదులెండి. ఇక్కడే. తిరిగిరావడానికి అరగంటకూడాపట్టదు. ఆవిషయం విశ్వంగారికూడా తెలుసు. కాసేపట్లో తిరిగొస్తారు. తిరిగిరావడం టాక్సీలో ఎంతసేపు''

విశ్వం సంశయంతో నిలబడ్డాడు.

"రండి విశ్వంగారూ,'' రేణుక చనువుగానే చేయిపట్టుకున్నది.

వసంత హృదయం కళుక్కు మన్నది. మదన హృదయంలో ఆనందం గప్పుమని రాజి, రగిలింది.

వసంతే అన్నది. "క్షమించండి రేణుకాదేవిగారు. ఇంకా వారు భోంచెయ్యనన్నా లేదు. బాగా అలసటగా వున్నారు. భోంచేశాక ఎక్కడికీ రాలేరు. ప్రస్తుతం భోంచెయ్యండే అసలు కదల్లేరు"

"వసంతగారూ, మీ ఆంతర్యం నాకర్థమైంది. నా వెంట విశ్వంగారువస్తే, ఏదన్నా జరుగుతుందనే భయం మీకు వుండొచ్చు. కానీ అలాంటిదేమీ, జరగదని హామీయిస్తున్నాను. నిజం ఆడదానికి సహజమైన అపనమ్మకాలు, ఆలోచనలు వుంటాయని మీరు రుజువుచేశారు. నాకు చాలాసంతోషంగా వుంది''

'విశ్వంబాబూ, నేను ఆడదాన్ని. భయంతో మిమ్మల్ని యింటికి సాగనంప మన్నాను. అంతమాత్రాన మీా యిష్టులకి, మిమ్మల్ని గాఢంగా ప్రేమించేవారికి కోపం వస్తుందని నేనెన్నడూ భావించలేదు. ఆలోచించకుండా, నన్ను సాగనంపమని కోరటం నా బుద్ధితక్కువకి మాంచి ఉదాహరణ. వస్తాను. విశ్వంగారూ, వెళ్ళొస్తాను"—

వసంత శిలాప్రతిమలా స్తంభించిపోయింది. విశ్వం గంభీరంగా నిలబడి - యిదంతా చూస్తున్నాడు. లోపల కోపం మండుతోంది. అయినా, పైకి నిశ్చలంగానే నిల బడ్డాడు. ఒక్క మాటకూడా మాట్లాడలేదు. అప్పటికే మెట్లు దిగిపోయింది రేణుక—

విశ్వం ఒక్కడుగు ముందుకేసి, "రేణుకాదేవీ" అన్నాడు.

రేణుక ఠకీమని, నిలబడిపోయింది.

'కోపం తగ్గిందా?—ఇంకావుందా?—అన్నాడు. రేణుక మాట్లాడలేదు. "సరే పదండి పంపించివస్తాను. మీా కొక్కరికేకాదు, మాకూ గౌరవమూ, మానసిక సౌంద ర్యమూ వున్నాయి' విశ్వం రెండంగల్లో మేడమెట్లుదిగి— రేణుకని అనుసరించాడు.

రేణుకకి, అంతరాంతరాల్లోఎంతో ఆనందమయింది. తాను పద్మవ్యూహం పన్నింది. అందులో విశ్వం, ఈగ లాగా చిక్కగలడన్న ధాటీఅయిన నమ్మకంవుంది. అది బహుశా వూహాగానం కావొచ్చు. ఐనా, ప్రయత్నించి, విశ్వాన్ని లోబర్చుకోవాలని, రేణుక మనస్సు కొట్టుమిట్టాడు

తోంది. అయినా, విశ్వం అంత త్వరగా, లోబడతనే నమ్మ కంకూడా, ఒకవైపున పీడిస్తూనేవుంది. అయినా ప్రయత్నించాల్సిందేగదా?—

ధనంతో ఎన్నైనా కొనొచ్చు. ప్రపంచాన్ని కొనవచ్చు. ఒక హృదయాన్ని, పవిత్రతని మాత్రం కొనలేము. మువ్వావుగంటకి - యిద్దరూ కార్లో రేణుక యింటిముందు దిగారు. ఇక్కడ పద్మవ్యూహం పన్నబడివుంది. విశ్వాన్ని అందరూ, అంటే రేణుక అన్నలిద్దరూ, వదినలూ, అమ్మా ఆప్యాయంగా ఆహ్వానించారు. గొప్ప సినిమాస్టార్ యిల్లు ఎలా వుండాలో, అన్నిహంగులూ, ఆయింట్లో వున్నాయి. రకరకాల ఫొటోలు, ఫ్రేములల్లో కళకళ లాడ్తోన్నాయి. ఆర్గాన్ లైటు కాంతికి, యిల్లంతా కొత్త వెలుర్తో ప్రకాశిస్తోంది.

విశ్వం తాపీగా కుర్చీలో కూర్చున్నాడు. ఈ అలంకారానికి అతనేమీ మైమర్చిపోలేదు. రెండుక్షణాల తర్వాత లేచినిలబడి, "వెళ్ళొస్తాను రేణుకాదేవీ, నాకోసం అక్కడ ఎదురుచూస్తుంటారు పాపం, వసంత భోజనంకూడా చేసి వుండదు—" అన్నాడు.

"అప్పుడేనా?" అన్నది రేణుక. "చూడండి విశ్వం బాబుగారూ, వెళ్లొచ్చు. అప్పుడే ఏం మునిగిపోయిందని. వచ్చి అయిదునిమిషాలు కాలేదు. అప్పుడే బయల్దేరారు. మాయింటికొచ్చి, కనీసం కాఫీఅన్నా తాకకుండా పోవడం మీకుభావ్యమేనా, చెప్పండి—"

"ఇప్పుడు కాఫీయా? భోంచేయబోతుంటేనూ, యిప్పుడొద్దులే రేణుకాదేవీ, యింకెప్పుడన్నా తాగొచ్చుగానీ—"

రేణుక నవ్వి, "సినిమావాళ్ళు అప్పుడప్పుడూ సిగ్గు పడ్తారన్నమాట! ఇంతమంది వున్నారని బిడియంగా వుంటే, రండి నాగదిలోకి వెళ్దాం. అక్కడ కొంచం ఫల హారం చేద్దురుగాని – ఊఁ...రండి. అబ్బ, రద్దురూ. రాక పోతే నన్ను చంపుకుతిన్నట్టే—" .

ఇక లాభంలేదని విశ్వం లేచినిలబడ్డాడు. రేణుక గదిలో కాలుపెట్టాడు. నిజంగా అది గదికాదు. ఇంద్ర భవనం. విగ్రహాలు నాలుగుమూల్లా; తెల్లటి పాలరాతిమీద పర్చిన నల్లనికార్పెట్లు, మానవుని రసికతని వుదాత్తంగా నిరూపించే, అత్యుత్తమాలంకారాల్లో రేణుకాదేవిగది ఒకటి అని సందేహంలేకుండా చెప్పవచ్చు.

రేణుక చనువుబాగా తీసుకోగలదు. సినిమానటికి చనువు ఉగ్గుతో పెట్టిన విద్య. సిగ్గు అనేది పూర్వం ఏమన్నా వుంటే పాతజాకెట్టును ఒదిలినట్టే, పాతసిగ్గునుకూడా ఒదిలి వేయాలి. కావిలించుకోమన్నవాణ్ణల్లా కావిలించుకోడానికి సిగ్గుపడితే కాంట్రాక్టు దెబ్బకి చితికిపోతుంది. సినిమాలో అన్నల్ని కావిలించుకోవాలి, నాన్నని కావిలించుకోవాలి. ఇక ప్రియుణ్ణి సరేసరి. అప్పుడప్పుడూ రొమ్ములకు చెయ్యి తగల్టంకూడా కద్దు. అంచాత, కోపగించుకో కూడదు. దీనిని అత్యుత్తమైన కళగా భావించి, నవ్వుతూ సహించ గల్గాలి. అలా సహించడానికి ఆంతర్యం ఎదురుతిరిగిన రోజున చిత్ర రంగంలోంచి, యింటిరంగంలోకి కాలు పెట్టాల్సిందే!

రేణుక విశ్వం కూర్చున్న కుర్చీకి వెనుకగా వచ్చి విశ్వాన్ని బుగ్గమీద ముద్దెట్టుకున్నది. విశ్వం ఒళ్లు జల్లు

మన్నది. కోపంతో ముఖమండలం ఎఱ్ఱబడింది. సహనం నశించి నామరూపాల్లేకుండా పోయింది.

"ఏమిటిది రేణుకా" అన్నాడు.

"ఏముంది?" అన్నది.

"నన్ను పిల్చింది యిందుకా?_నీవుయింత దుర్మార్గానికి దిగుతావనుకో లేదు. నాకూ మానాభిమానాలున్నాయి. తెగబడే ప్రతి ఆడదాన్ని వాంఛిచడం నా అభిమతంకాదు"

రేణుక యివన్నీ విన్పించుకునే స్థితిలో లేదు. శరీరంలో రక్తం సలసలా కాగిపోతోంది. కళ్ళల్లో నిషా కాల్తోంది. మత్తులో శరీరం జలదరిస్తోంది. ఇంతవరకొచ్చాక, అభిమానాన్ని గురించి ఆలోచించుకోనక్కర్లేదు. అమాంతం విశ్వాన్ని వాటేసుకుంది; ముద్దుల్తో అతన్ని వుక్కిరి బిక్కిరి చేసింది. విశ్వం దిమ్మరపోయాడు. ఆడదాని వాంఛ యింత భయంకరమైందని, అతనికి యిప్పుడే తెలిసివచ్చింది. ఆడదాని గోళ్ళు యింతవాడిగా గుచ్చుకుంటాయని, ముద్దుల్లో యింత వేడివుందనీ, కావిలింతలో యింతకాంక్ష వున్నదని_ విశ్వం యింతకుముందెన్నడూ తెలుసుకోలేదు.

రెండు విదిలింపుల్తో విశ్వంనుంచి దూరంగా రేణుక పడిపోయింది. ఎడాపెడా రెండులెంపలూ వాయించి, తోలగదోసుకుని బైటకి వచ్చేశాడు.

నిషా దిగిపోయింది. ప్రేమకోసం, వాంఛకోసం, రేణుక చెంపలు వాచిపోయినయ్యి. కళ్ళవెంట నీళ్ళు వచ్చినాయి. ప్రేమించిన మగవాణ్ణి ఆడది త్వరగా వదలిపెట్ట

లేదు. అంతం చూసేవరకూ ఆడది వూరుకోలేదు: అదే ఆడ దాని ఆంతర్యం.

రేణుక ప్రశ్నించుకున్నది – తాను సుప్రసిద్ధ సినీ తార. తనకోసం ఎంతోమంది పడిగాపులుపడ్డారు. తన చిరు నవ్వులకోసం, యువకుల హృదయాలు రెపరెపలాడినయ్యి. ఐనా, తాను యింతవరకూ పతనావస్థలోకి దిగజారలేదు. కానీ యిప్పుడు జరిగిందేమిటి? – తను విశ్వాన్ని వాంఛిం చింది. తన ప్రేమని బాహాటంగా వెళ్ళగక్కింది. విశ్వం తనని అసహ్యించుకున్నాడు. కోపోద్రిక్తతలో కొట్టాడు. గుండెల్లో, మంటల్ని రగిలింపజేశాడు.

ఇంతకన్నా పతనం, ఇంతకన్నా అగౌరవం తనకింకేం కావాలి? – విశ్వం తనకి దక్కనిరోజున, వసంతకీ దక్క టానికి వీల్లేదు. అనుమానంతో అతని హృదయాన్ని, ముక్కలు ముక్కలుగా బద్దలుకొట్టాలి. నిజంగా, తనకన్నా వసంత అందమైందికాదు ఆడదాని అందానికే సవాలుగా నిల్చిన తననే; నిర్లక్ష్యంతో తోలగదోశాడు. దానిని తాను చేతులారా, తాను చూస్తూ చూస్తూ ఎలా సహించగలుగు తుంది? – రేణుక మంచంమీద పడుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

విశ్వం యింట్లో కాలుపెట్టేసరికి, ఠంగుమని ఒంటి గంట కొట్టింది. అతని హృదయం ఛిన్నాభిన్నమైవుంది. తన అందంమీద తనకే అసహ్యంవేసింది. లేకపోతే, ఏమి టదంతా? – గతాన్ని తల్చుకుంటే, ఒళ్ళు భయంతో

గగుర్పాటు చెందింది. అనాథ, అనామకుడు అయిన తనకి, వసంత ఆశ్రయమిచ్చింది. ప్రేమించింది. తానూ వసంతని ప్రేమించాడు. ఆరాధించాడు. జీవితంలో శాంతిని వాంఛించాడు. తర్వాత మదన! మదనపాత్రకూడా చాలా చిత్రమైందే! తనని, మదనకూడా ప్రేమించింది. మదనా ప్రేమ వాహినిలోంచి యీదుకుని, తానోగట్టుకువచ్చి నిలబడాడు. మదనయింకా పూర్తిగా ఒదిలిపెడ్తుందని నమ్మకంలేదు. ఈ ఘటనతో యింకా తాను కోలుకోకముందే, రేణుక ప్రవేశించింది. రేణుకా తనని ఆరాధిస్తోంది. బహిరంగమైన తన ప్రేమవాంఛని వెళ్ళగక్కింది. తాను ఉద్రేకంలో సహించలేకపోయాడు. త్వరపడి చేయి చేసుకున్నాడు. స్టూడియోలోంచి వస్తున్నప్పుడే, రేణుక అదోరకంగా మాటాడింది. కానీ అందులో వాంఛ వుంటుందని - తాను ఆశించలేదు. రేణుక చాలా కలుపుగోలు మనిషి. అంచేత, అలా మాటాడి వుండవొచ్చనుకున్నాడు — కానీ జరిగిందేమిటి ?

ప్రభూ !! మానవుల్లో - యిన్నిరకాల మనుష్యుల్ని సృష్టించడంలో అగాధమైన నీ ఆంతర్యమేమిటి ? - ఈ అనంత, అగాధ, తమోమయ కాలవాహినిలో యిన్ని రకాల జీవకణాల్ని ఎంత చిత్రంగా సృష్టించావ్ ? - అందాల్ని నిర్మించిన నీవే, అనుబంధాల్ని సృష్టించావ్. అందమూ, అనుబంధమూ - రెండూ ప్రకృతి శక్తుల్లా కుమ్ములాడుకుంటున్నవి.

విశ్వంతల దిమ్మెక్కిపోయింది. మదన నిద్రపోతోంది. ఇంకా వసంత గదిలో, లైటు వెలుగుతూనేవుంది. ఐతే, వసంత యింకా నిద్రపోలేదన్నమాట. విశ్వం పిల్లిలా అడుగులు వేసుకుంటూ – వసంత గదిలోకి వెళ్ళాడు. వసంత టేబుల్ మీద తలఆనించి, దీక్షగా ఆలోచిస్తోంది.

విశ్వం నెమ్మదిగావెళ్ళి "వసంతా" అన్నాడు.

వసంత విశ్వంవైపుచూసి, లేచినిలబడింది. "భోంచేద్దురుగాని రండి" అన్నది. విశ్వం మారుమాటాడకుండా అనుసరించాడు. వసంత భోజనం పెడ్తోంది. ఆమె కళ్ళలోంచి ఒచ్చిన రెండు కన్నీటిబొట్లు – విశ్వం చేతిమీద పడినాయి. విశ్వం వసంతముఖంవంక చూశాడు. కళ్ళవెంట నీళ్ళు ధారాపాతంగా కురుస్తున్నాయి.

"వసంతా, తప్పుచేశానా ?" అన్నాడు – తర్వాత విశ్వానికి అన్నం తినబుద్ధియలేదు. లేచి, చేయికడుక్కున్నాడు – చేయితుడుచుకుని, వసంతచేయి పట్టుకున్నాడు. నెమ్మదిగా నడుస్తూ, వసంతని తీసుకొచ్చాడు. గదిలోకిపోయి మంచంమీద పక్కనే కూచోబెట్టుకున్నాడు. కన్నీళ్ళు తుడిచి, తనవైపు తిప్పుకున్నాడు.

ఇప్పుడు విశ్వం మనస్సు సందిగ్ధతతో – కొట్టుకుపోసాగింది. నిజాన్ని చెప్పడమా?–కొన్ని పరిస్థితుల్లో నిజంకన్నా అబద్ధం బలమైనది. రేణుక ఉదంతం యిప్పుడు చెప్పడం వలన, చిట్లిన హృదయం – పగలడం తప్ప – ఒచ్చే లాభం లేదు. ఇప్పుడేం చెయ్యాలి? తనకి అన్నీవుండి ఆత్మశాంతి

లోపించింది. లాంతరు క్రీనీడలాగా తన ఆనందంలో విషాదం వుంది. ఎవరికీ కన్పించని, ఎవరికీ వివిన్పించలేని యీ దీన మైన గాథ ఎవరికి చెప్పుకోగలదు? - వసంతకి చెప్పి, ఆమె హృదయంలో అగ్నిగుండాల్ని రగల్చలేదు. దీనికి తన మానసిక సౌందర్యం ఎదురు తిరుగుతోంది. ఏం చెయ్యాలి?

పోనీ, యిక్కణ్ణించి ఎక్కడికన్నా పారిపోతే! పారి పోయిన మరుక్షణాన మళ్ళీ పూర్వపు దరిద్రదేవత ఆవ హించవచ్చు. గతాన్ని తల్చుకుంటే, గుండెల్లో అదటు కలుగుతోంది. చూస్తూ చూస్తూ తాను నరక జీవితంలోకి అడుగుపెట్టలేదు. పస్తుల్తో చావలేదు. కానీ తనని అభిమా నించి, గౌరవించి ప్రేమించిన వసంత హృదయం—విలవిలా తన్నుకుని ఏడుస్తోంది. పూలలో పెరిగి, ఆనందాన్ని అనుభ వించిన వసంత హృదయం - తనద్వారా కన్నీరుపాలు కావల్సొస్తుంది. పరిస్థితంతా అధ్వాన్నంగావుంది. ఆనం దాన్ని అనుభవించే అర్హతకి తాను నోచుకోలేదా?—లేక పోతే ఏమిటిది?—ఒకపక్క మదన, మరోపక్క రేణుక. ఎదురుగా వసంత. మూడు ఆప్యాయతలమధ్య రగిలే జ్వాలతో మిడతలాగా మాడిపోవడం తప్పితే గత్యంతరం లేదా?—

ఆలోచనల్తో మస్తిష్కం మండుతోంది. వసంత ముఖం అరిచేతుల్లో దాచుకుని వుంది. "చూడు వసంతా," అన్నాడు విశ్వం. వసంత అలానేవుంది. కళ్ళెత్తి చూడ లేదు "వసంతా, యిటుచూడవా?"—అన్నాడు. అని గడ్డాన్ని కుడిచేత్తో పైకెత్తాడు.

వసంత కళ్ళు ఎఱ్ఱగా మండుతోన్నాయి. వసంత ఏడుస్తోంది. నిజమే. ఇలా ఎంతసేపని ఏడుస్తుంది?—ఏడ్వటానికి కొంత హద్దులేదా? తాను రేణుకని అభిమానిస్తున్నట్టు దురూహ కల్గుతోందా?—ఇంత సున్నితమైన వసంత హృదయం తనకళ్ళముందు; కటిక శిలల్లాంటి హృదయాలుగల రేణుకా, మదనా కళ్ళవెనక చాలా చిత్రమనిపిస్తుంది. తర తరాల్నించీ, అంతుదొరకని, అగాధమైన ఆడదాని హృదయాన్ని విశ్వం అర్థంచేసుకోలేడు. చేసుకోగల స్థైర్యం అతనికిలేదు—వాస్తవంగా లేదు.

"చూడువసంతా" అన్నాడు విశ్వం. వసంత చూసి మళ్ళా తలవంచుకున్నది. "వసంతా, చెప్పడం నా బాధ్యత—వినడం నీ యిష్టాయిష్టాలమీద ఆధారపడి వుంటుంది. నేను నిజంగా ఏతప్పూ చేయలేదు. నేను ఎవరికీ ఏఅన్యాయమూ చేయలేదు. నన్ను అపార్థం చేసుకుంటున్నావ్? దానికి నేను బాధ్యుణ్ణికాను. కానీ, ఒక్కవిషయం చెప్పగలను.

"ఒకనాటికి, నేను యిక్కడికి ఎలా వచ్చానో, అలా వెళ్ళిపోక తప్పనట్లుంది. నేను యీయిల్లు వదిలిపోయాక, లేదా ఈలోకంలోంచి శాశ్వతంగా దూరమైనాక, ఒక్కసారన్నా ఏడుస్తావా వసంతా?— లేదా ఒక్కసారన్నా తల్చుకోగలవా?"

వసంత వెక్కి వెక్కి ఏడుస్తోంది. "అలా అనకండి విశ్వంబాబూ, అలా అనకండి. నేను మిమ్మల్ని చేతులారా దూరంచేసుకోలేను. నాకు యీ ప్రపంచంకన్నా - మీరు విలువైనవారు."

"వసంతా!!" ఒక్కసారి విశ్వం వసంతని కావిలించు కున్నాడు. అతని గుండెలమీదపడి ఆమె అలానే ఏడ్చింది. విశ్వానికీ కళ్ళవెంట నీళ్ళువచ్చాయ్. ఆమె అతని గుండెల మీదపడి ఏడ్చి ఏడ్చి నిద్దరోయింది. విశ్వం వసంత ముంగు రుల్ని నిముర్తూ - చాలాసేపు అలానే కూర్చున్నాడు. ఒకే మంచంమీద, అలానే ఒరుసుకుని నిద్దరోయారు-ఆరాత్రి.

* * * *

"సుమిత్ర ఒక పేరుమోసిన పెద్దగృహిణి" అన్నాడు జగన్. "అంటే" అన్నది సుమిత్ర. "అంటే, మరేమీలేదు, అడపా దడపానన్నా మేము గుర్తుంటున్నామా ? - లేక ఎప్పుడూ పాపేనా. ఓహో, పాపపేరు 'రాగరంజిత' అని పెట్టావనుకుంటాను. పేరు సెలక్షన్ బాగానేవుంది. అయినా పాప విషయంలోపడి, ఈ సుమిత్రానాథుడి విషయం మర్చి పోవడం ధర్మంకాదు."

సుమిత్ర నవ్వి, "పొండి, మీరు మరీ చిన్నపిల్లలవు తున్నారు! మీకూ్కడా. గౌను తొడగమంటారా? - కాళ్ళ మీద పండుకోబెట్టి సున్నిపిండి నలుగు పెట్టాలా?- చెప్పండి."

జగన్ పగలబడి నవ్వుతూ, చిరుకోపాన్ని ప్రదర్శించి, "అలా అయితే, నాకు పాలెవరిస్తారమ్మా ? - నాకు అమ్మ లేదుగా" అన్నాడు. సుమిత్ర బుగ్గలు ఎరుపెక్కాయి. జగన్ సుమిత్ర భుజంమీద చెయివేసి తనవేపుకు తిప్పుకు న్నాడు - "సుమీ" అని పిల్చాడు నెమ్మదిగా.

"అటుపదండి - పాపలేస్తుంది" అన్నది సుమిత్ర.

భార్యఒళ్ళో తలపెట్టుకుని, "అన్నయ్యగారింటికి వెళ్ళి చాలారోజులయ్యిందికదూ. ఒకసారి వెళ్ళొద్దామా?" అన్నాడు.

"ఊఁ ... వెళ్దాం ... ఎప్పుడువెళ్దాం చెప్పండి" అన్నది సుమిత్ర కళ్ళల్లో ఆనందం మెరిపిస్తో,

"నీయిష్టం. సాయంకాలం వస్తున్నామని ఫోన్ చెయ్యనా ?"

"వూఁ చెయ్యండి" అన్నది.

"వూఁ, చెయ్యండి. మా అన్నయ్యగారిల్లంటే నాకంటె నీకే ఎక్కువయిష్టం– అక్కడ వసంతా, విశ్వమూ వుంటారని. అయినా, ఆమాత్రం ఆపేక్ష వుండటం అవసరమే ననుకో —".

"పాపం• మీకే ఏ ఆపేక్షా లేనిది మాట్లాడకుండా, ఫోన్ చెయ్యండి. వూఁ... చెయ్యమంటూంటే —"

జగన్ ఎదురుగా నిలబడ్డ, భార్య మొహంచూస్తూ, చేతు లేసి, "నే చెయ్యను ?—" అన్నాడు. "ఏం, ఎందుకని" అని సుమిత్ర మూతిని చక్రంలా చుట్టింది.

జగన్ నుదురుమీద ముద్దెట్టుకుని, ముక్కులాగాడు–

"ఏయ్, దొంగపిల్లాడా !!" అన్నది సుమిత్ర.

ఇంతలో పాప లేచింది. సుమిత్ర జగన్ చేతుల్ని తీసి వేసి, పరుగెత్తుకెళ్ళి, పాపని చంకన వేసుకున్నది. పాప స్థాయిలో ఏడుస్తున్నదల్లా ఒక లెవల్లోకొచ్చింది.

"ఏమండీ—"

"ఊఁ..."

"పాపని కొంచం ఎత్తుకోండి పాలు తీసుకొస్తాను."

జగన్ పాపని చంకన వేసుకున్నాడు. పెంపుడు తండ్రిని చూడగానే ఆపిల్ల పక్కుమని నవ్వింది. తండ్రి ముఖంమీద చేతులువేసి కొడ్తో - గ...గ...గా...గేల్ ...గే...వుంగా...అన్నది. ఈ పెంపుడు తండ్రికి యీ చిన్నకూతురుమీద మహాలావు ప్రేమవేసింది. ఎత్తుకున్న దాన్ని ... ఎగరేస్తూ, పట్టుకుంటూ, తానూ ఎగుర్తూ నవ్వుతోన్నాడు.

సుమిత్ర వస్తున్నదల్లా ఆగి యీదృశ్యాని చూసింది. ఆనందంతో ఆమె హృదయం పొంగిపోయింది. కళ్ళవెంట ఆనందాశ్రువులు రాలినయ్యి. భర్త చూడకుండా, చెంగుతో సీళ్ళు తుడుచుకుని, "పాపని, యీలా యీయండి" అన్నది.

"ఊఁ - యిదిగో తీసుకో...." అన్నాడు జగన్.

సుమిత్ర చేతులు జాపింది. పాప నవ్వి, జగన్ భుజంమీద వెళ్ళనన్నట్టు తలఆన్చి పండుకున్నది.

"చూశారా, యిన్నిరోజుల్నుండి — సంరక్షణ చేస్తుంటే లేంది, రోజుకు ఒక్కసారి సరిగ్గా ఎత్తుకుంటారో లేదో, రానంటూంది___"

"ఊఁ ... మనమంటే, మరేమిటనుకున్నావ్ ? - చిట్టీ చూడమ్మా, బాయితాగు. మాఅమ్మకాదూ. మళ్ళీ ఎత్తుకుంటాను. నాఅమ్మకదూ .... మీ అమ్మదగ్గర కెళ్ళు. ఇవ్వాళ వసంతక్కగారింటికెళ్దాంగా" అన్నాడు. ఆపిల్లకి పెద్ద అర్థమయినట్టు సుమిత్ర చేతుల్లో కెళ్ళింది.

సుమిత్ర నవ్వి, "అంతా దొంగలే. ఒక్తి దొంగ సజ్జు" అన్నది.

జగన్ నవ్వి — ఫోన్ చెయ్యడానికుపక్రమించాడు. ఫోన్‌లో మాట్లాడింది వసంత – తప్పకుండా రమ్మనీ, పిన్నినీ పాపనీ చూడాలనివుందనీ, విశ్వంగారు స్టూడియో నుంచి వచ్చి నిద్రపోతున్నారని విషయసంగ్రహం.

"చూశావా, నిన్నూ పాపనీ చూడాలట, నన్ను చూడక్కర్లేదట. ముందొచ్చిన చెవులకన్నా వెనకొచ్చిన కొమ్ములు వాడి అన్న సామెత వూరికినేరాలేదు" "మీరు ఎప్పుడూ యిలానే అంటారు" అన్నది సుమిత్ర. "ఆ... అవునుమరి" అన్నాడు జగన్.

ఆ సాయంకాలం, సుమిత్రా, జగన్ ప్రసాదరావుగారింటికి బయల్దేరారు. వెళ్ళేసరికి ప్రసాదరావుగారు యింటి దగ్గర్లేరు. విశ్వం స్నానం చేస్తున్నాడు. మదన నిన్న సాయంత్రమే, యింటికి వెళ్ళిపోయింది. వసంత డాబామీద నుంచున్నదల్లా, వీళ్ళరాకని చూసి, గబగబా ఎదురు కిందికి దిగొచ్చింది.

ఒచ్చి ఆప్యాయంగా సుమిత్ర చెయ్యి పట్టుకుని "పిన్నీ" అన్నది. సుమిత్ర ఆప్యాయంగా, "ఏమ్మా, కులాసాయేనా, ఒక్కసారి మాయింటికి రాకూడదూ" అంది. "నిన్న ఒద్దామనుకుంటే పడలేదు పిన్నీ. మదన వచ్చి పది రోజులయ్యింది. కానీ, నిన్నే వెళ్ళిపోయింది. నిన్న అందుకనే, రావడానికి వీలుపడలేదు."

"ఉహూఁ" అన్నది సుమిత్ర. తిరిగి వెంటనే "చూశావామ్మా. మీ బాబాయి నన్నెప్పుడూ చెప్తుతూ వుంటారు. నన్ను చూసినట్టు, మీరు బాబాయిని చూడ్డం లేదట"! "అదేమిటి-బాబాయ్. నిన్ను ఎప్పుడు చూశ్ళేదు చెప్పు. ఏదో ఒక నెపంతో చెప్పాలని కాకపోతే" అన్నది వసంత—

"మీ చిన్ని మాటలు ఒట్టి అబద్ధాలు. నేనంటూనా స్వూ ఆ మాట. పూర్వన్నే. మరీ చిన్నపిల్లలాగా అబద్ధాలు" సుమిత్ర ఆశ్చర్యం నటించి, 'నావా అబద్ధాలు. మీరు మధ్యాహ్నం అనలేదండీ.' 'నేనా, అన్నానా, ఛా పూర్వనో వసంత నమ్మిపోగల్దు' అన్నాడు జగన్. 'అసలు, మీరు దుత్త దొంగలండీ-అబద్ధాలాడ్డంలో ఫస్ట్‌ప్రయిజ్ మీదే' అన్నది సుమిత్ర.

ఇంతలో విశ్వం స్నానం చేసి, డ్రస్ చేసుకుని వచ్చాడు. 'మా హీరో అల్లుడు వస్తున్నాడు' అన్నాడు జగన్. జగన్ చూశ్ళేదుగానీ, వసంత ముఖమండలం సిగ్గుతో యెర్ర బారటాన్ని- సుమిత్ర యిట్టే పసిగట్టింది. మనస్సులో నవ్వుకున్నది విశ్వంవచ్చి, 'నమస్కారమండీ' అన్నాడు. 'నమస్కారం కూడో అల్లుడా! బాగా చావ దేలావుసుమా, మా అమ్మాయి పెట్టుడిసి' అన్నాడు జగన్ నవ్వుతూ. విశ్వంకూడా నవ్వి, 'అసలు నావంటి తీరే అది మీ అమ్మాయి పెట్టుదల కాదు' అన్నాడు. 'హూఁ... అలాగా పాపం. ఏమీ యెరగరమ్మా' అన్నది వసంత.

హాస్యాల్తో కాలంగడిచిపోతోంది. విశ్వం రాగరంజి

తని యెత్తుకున్నాడు. 'అత్తగారూ మీ చేతుల్లో మాంఛి వెయిటుంది మా పాప ముద్దబంతిలా వుంది' అన్నాడు. 'పాపకాదు. రాగరంజిత' అన్నాడు జగన్. 'ఇది మా పిన్ని పెట్టిన పేరే' అన్నది వసంత. 'ఏమ్మా! ఆ మాత్రం పేర్లు పెట్టడం నాకు రాదనుకున్నావా?' అన్నది సుమిత్ర. 'నీ పేరుకన్నా, యీ పేరే బాగుంది' అన్నాడు విశ్వం.

'మా అమ్మాయి పేరుకేమిటి, చక్కగా మూడు అక్షరాల్లో వసంత అని పిలవచ్చు' అన్నాడు జగన్.

'బాబూ, వాళ్లతో మనకేమిటి? ఒక్కొక్కొంటొరకం. వాళ్ళతో వాదించడం ఉత్త శ్రమ' అన్నది సుమిత్ర. 'అలాగా' అన్నాడు జగన్. 'ఓహోహో' అన్నది వసంత.

పాప నిజంగా బాగా బొద్దుగావుంది. తిరువాన్కూర్ రబ్బరు బొమ్మల్లే నిగనిగలాడుతుంది. చలాకీగా నవ్వుతుంది. ఈ అందాల పాపకి 'రాగరంజిత' సరైన పేరే!

రాత్రి ఏడింటికి, స్టూడియోలో కొత్త సినిమాకి ప్రారంభోత్సవం. ఇది విశ్వం నటించబోయే ఆరో సినిమా. ఇది జానపదం. ఇందులో హీరోయిన్‌గా నటించబోయే నటి సుందరి. ఈవిడ కన్నడతార. కన్నడంలో శతదినోత్సవం చేసుకున్న సినిమాని-మంజీరా ప్రొడక్షన్స్ అనే ప్రయివేటు సంస్థ తెలుగులో తీస్తున్నారు. అందులో ఆవిడే హీరోయిన్. ఇప్పుడు తెలుగులో కూడా ఆవిడే. విశ్వం ఆరుంబావుకి బయల్దేరి స్టూడియోకెళ్ళాలి. కాని, యిప్పటికే ఆరున్న రయ్యింది.

'మీకు ఇవ్వాళ స్టూడియో వర్క్ లేదనుకుంటాను'

అన్నది వసంత. విశ్వం నవ్వి, 'ఇవ్వాళే కొత్త సినిమాకి ప్రారంభోత్సవం. కన్నడంలోంచి తెలుగులోకి తీయబోతు న్నారు. సుందరీ అని, కన్నడ నటి హీరోయిన్. స్టూడియో నుంచి కారు యింకా రాలేదు. అదే చూస్తున్నాను' అన్నాడు. వసంత, 'ఓహో అలాగా' అన్నది. 'పోనీ, మీ రందరూ రాగూడదూ. కార్లో నన్ను డ్రాపు చేసివద్దురుగాని' అన్నాడు విశ్వం.

'మేమెందుకులే, వసంత దిగబెట్టి వస్తుంది' అన్నాడు జగన్. కాసేపు నిశ్శబ్దం తాండవించింది. జగన్ లేచి నిల బడి సిగరెట్ తాగుతో, ఆకాశంవంక చూస్తున్నాడు. పాప కేరింతాల్తో ఆడుకుంటోంది. వసంతా, విశ్వం లేచి నిలబ డ్డారు. వసంత ముఖం కడుక్కొని, టాయిలెట్టయి వచ్చింది. విశ్వం వసంత చెయిపట్టుకున్నాడు. ఇద్దరూ కలసి మేడదిగారు. కారు వసంత డ్రైవ్ చేస్తోంది. విశ్వం విశాలమైన భవనాల వంకా, అప్పుడప్పుడూ, వసంత జడలోని పూలవంకా, చెవి దుద్దుల్లో మెరుస్తున్న రాళ్ళవంకా చూస్తున్నాడు.

కారు స్టూడియోలోకి వచ్చి ఆగిపోయింది. టి. బి. పేషెంటులాగా బక్కగావున్న అతనితో మాటాడుతోన్న సుందరి చిరునవ్వుతో విశ్వాన్నీ వసంతనీ విష్ చేసింది.

'వీరు మీ మిసెస్ కాబోలు' అన్నది. అవునన్నట్టు తలవూపాడు విశ్వం. 'ఐ సీ; కంగ్రాచ్యులేషన్స్' అన్నది సుందరి. వసంత ముఖం ఒక్కసారి వికసించి, మళ్ళీ మామూలయింది. సన్నటతని వంక చూపించి, 'వీరు' అన్నాడు విశ్వం. 'మా హజ్బెండ్. ఒక్తి అనుమానప్పు

రుగు ఆ వ్యక్తి చిరునవ్వుతో వూరుకున్నాడు. బహుశా యిది మామూలు కావొచ్చు అతనికి.

వసంత చేయిపట్టుకుని - విశ్వం స్టూడియోలోకి దారి తీశాడు. భేతాళునిగది ట్రిక్కు ఫోటోగ్రఫీలో - చూడ్డానికి చాలా భయంకరంగా వుంది. వసంతకి భయంవేసి, విశ్వం చేతిని నొక్కింది. విశ్వం వీపుతట్టి - చిరునవ్వు నవ్వాడు.

సుందరి చాలా అందగత్తె. ఈ సుందరి పేరుమోసిన విలాసిని మనుష్యుల్ని లోబర్చుకునే మత్తు-ఈమె కళ్ళల్లో వుంది. పెదాల్లో దానిమ్మరంగు దాక్కుని, పళ్ళల్లో తెల్లని రంగు మెరుస్తో---

వసంత యింటికి బయల్దేరింది. రాత్రి పదిగంటలకి - తప్పక యింటికి వస్తానని చెప్పి, ఎవరూ చూడకుండా వెంట్రుకలు నిమిరాడు విశ్వం. ఆనందంతో ఆమె హృదయం పరుగులెత్తింది. కారు స్టార్టయ్యింది. విశ్వం చెయి వూపాడు.

కథ మంచి హుషారుగా జరుగుతోంది. డైరెక్టరు మాంచి హుషారైనవాడు. విశ్వం కూడా సినిమాజీవితానికి అలవాటయ్యాడు. అదివరకు హీరోయిన్లను, కావిలించుకుంటే ఒళ్లు గగుర్పొడిచేది. కానీ, ఇప్పుడు శరీరంలో రక్తం పొంగులెత్తడంలేదు - మామూలుగానే వుంది.

సినిమా జీవితమే అంత అలవాటుకూడా - దానికి వంతపాడుతుంది. సిగ్గు ఎగిరిపోతుంది. జీవితం అద్భుతంగా, చిత్రంగా చిత్రరంగంలో నిలబడిపోతుంది - నిజం.

# 7

ఆశ యుగాంతరాలనుంచీ, యిరవయ్యో శతాబ్దం ఉత్తరార్థంవరకూ - దరిమిలా పాకిపోయి యుగాంతరాల వరకూ స్థిరంగా నీడల్ని ప్రసరింపచేస్తూనే వుంటుంది.

లీలకి, ఈ ఆశే ప్రశ్నగా ఎదురునిల్చింది. ఏం చెయ్యాలో అర్థంకావడంలేదు జమీందారీ జీవితాలు క్షణిక మైనవి. వీళ్ళు అందాన్ని కొనుక్కుంటారు సుఖం లభ్య మైనాక, అందం వీళ్ళకి వాళ్ళ ముఖాల్లోమృగ్యమవుతుంది. మనిషిలో అందం కన్పించినప్పుడు - ప్రపంచమే అందంగా కన్పించడం,మానవునిలోని భావనా పటిష్ఠానికి తార్కాణం. అతని సెక్స్ జీవితానికి ఆదర్శప్రాయం - రొమాంటిజానికి పునాదిరాయి.

చిన్నజమిందారుని చేసుకోవాలంటే, అది ఒకవిధ మైన అదృష్టమే. విధి అనుకూలిస్తే బాగే. కాని ఎదురు తిరి గితే చీకటిలోయలూ - అగాధపు కోనేర్లూ - బ్రతుకు భయంపాటా- కళ్ళముందు సినిమా రీళ్ళులాగా తిరుగు తాయి. స్థానంఅనేది లభించడమే కష్టం. కానీ, కొంచం స్థానం లభించాక, యింకొంచం స్థానంకోసం వెదుక్కోవడం మానవనైజం. లీల యిందుకు అతీతురాలుకాదు.

ఇప్పుడిప్పుడే, దివాణంలో కొంచం గుసగుసలు బయల్దేరాయి చినరాజాకి, లీలకి కొంచం - సంబంధ బాంధవ్యాలు వున్నాయన్నట్టు పుకార్పిచ్చు బయల్దేరింది.

అయితే లీల ముఖంచూసి ఈమాట అనే ధైర్యం ఎవరికీ లేదు. ఆవిడ మహారాణి సుచేలాదేవి అంతరంగిక చెలికత్తె. పల్లెత్తు ఒక్కమాట తప్పిజారి నోటివెంటవచ్చినా, అనుభవించబోయేశిక్ష వూహాతీతమైనది—

కట్టుదిట్టాలు దిట్టంగా వున్నా—శిక్షమాత్రం భయంకరమైనదైనా, విషయాలు ప్రచారం కాకుండామాత్రం వుండవు. పరిస్థితులు యిలావున్న రోజుల్లోనే, పండంటి పిల్లాణ్ణెత్తుకుని, సుచేలాదేవి మెట్టినింటి కొచ్చింది. ముసలిరాజు కళ్ళల్లోని ఆనందాశ్రువుల్లో ఉదాత్తత వున్నది. స్వచ్ఛత వున్నది. అంతరాంతరాల్లో భార్యమీద ముసలియవ్వనం నాట్యంచేసి నివాళు లర్పించింది.

వేడుకలూ, వుత్సవాలూ యథావిధిగా జరిగిపోయినయ్యి. ఆనందోత్సాహాలు చల్లారిపోయి - దివాణం యథాస్థితికి వచ్చింది. ఈ చిన్న రాజకుమారుడు, ఈ రాజ్యానికి కాంబోయే అధినేత. ఈ అదృష్టానికి కన్నతల్లి సుచేలాదేవి.

సుఖస్వప్నాలకళ్లు, తెరుపుడు పడకముందే– ఆనందోత్సాహాలు ఆరీ ఆరకముందే - లీలవిషయం చూచాయగా సుచేలాదేవి చెవుల్ని సోకింది. ఈ విషయాన్ని అడుగుదామనుకున్నది. కాని నిర్మలత్వంతో, స్వచ్ఛంగా భాసించే, ముఖాన్ని చూశాక అడుగుదా మనుకున్న ప్రశ్న పెదవుల చాటునే చిక్కు పడిపోయింది అడుగలేదు యథావిధిగానే ఆప్యాయంగానే ఆదరిస్తోంది. ఒక్కనమ్మకంమాత్రం ఎందుకనో, సుచేలాదేవి హృదయంలో సుంచిస్థానా న్నావహించి

వున్నది. కాలం నిర్ణయించే, లీల శీల నిర్ణయంలో తాను తొందరపడకూడ దనుకున్నది. ఒకవేళ ఈ పుకారు ఒట్టి గాలికబురైతే – లీల జీవితం సగానికి విరిగి నేలకూలవచ్చు. జీవితం చీకటిపాలుకావొచ్చు. మతి స్థిమితంతప్పి – మళ్ళీ ఏ చీకటిగోతిలోనన్నా పడవచ్చు.

ఇందుకూ ఈవిషయం తెలిసిపోయింది. ఆమాకీ సొంతం చిక్కిందే, కల్పించుకోకూడదనే నిశ్చయానికి ఆవిడా వచ్చింది. చిత్రమేమిటంటే, ఇందు చాలాకోపిష్టి మనిషి – శాంతభావాన్ని వహించిందంటే, అందులోనూ తన జీవిత భాగస్వామి విషయంలో – ఇందుకు లీలంటే చాలా అభిమానం అనేది యిక్కడ సుస్పష్టమైన విషయం.

చిన్నరాజా రాకపోకలు యిప్పుడు బందైనాయి. పుకార్లు చాలావరకూ అణిగిపోయినయ్యి. కానీ, మనం అనుకున్నవి అనుకున్నట్టుగా కాలం జరగనీదు. ఒకరాత్రి తోటలో తన కళ్ళతో తాను చినరాజా – లీల సరాగాన్ని చూశారు పెదరాజావారు. ఈ విషయాన్ని పెదరాణీ గారికి తెలిపారుకూడాను. ఈమాట తనభర్త నోటిద్వారా విన డంతో క్షణకాలం స్థంభించిపోయింది సుచేలాదేవి. అయినా, ఈ విషయాన్ని ఆమె, – లీలకిగానీ, మరెవ్వరికీ గాని తెలియనియ్యలేదు – అది సుచేలాదేవి మన స్తత్వానికి విరుద్ధమైనది.

చిన్నరాజావారు చేస్తున్న యీ చిత్రమైన పనికి, దివాణంలో అందరూ ఆశ్చర్యపోయారు. విషయం వినడా నికి ఆశ్చర్యజనకమైందే కాకుండా, ఉత్సాహభరితమైంది. "లీలని చినభార్యగా చినరాజావారు స్వీకరిస్తారు."

ఇందు అంతర్యం జ్వాలతో భగ్గుమన్నది. గుండెల్లో శూలాలు గుచ్చారు. విధి తనకి ప్రతికూలించింది. లీలని గాఢంగా తాను ప్రేమించింది. కానీ, యీప్రేమ, విషంగా మారకపోతే తనకి స్థానంలేదు. సమాదరించదగినవాళ్ళనే, సమూలంగా నాశనంచెయ్యాలి. లేదా తనజీవిత భవితవ్యం, ఒక్కసారి పెఠీలుమని కూలిపోతుంది. చినరాణిగా తన అధికారాన్ని పరిహసించేవాళ్లు - యింకోరువచ్చి తన స్థానానికి అడ్డుగా నిలబడుతున్నారు. ఏంచెయ్యాలి విధీ - యీ ప్రశ్నకు ఒకేఒక్క సమాధానంవుంది. "లీలని తనమార్గంలోంచి నిష్కంటకం చేయాలి" - ఇదీ ప్రస్తుత పరిస్థితుల్లో వున్న ఇందు హృదయం. చినరాజావారు లీలని రెండో భార్యగా గ్రహించారు. నిజంగా, లీల స్థానంలో యింకోరుంటే పెదరాణీ క్షమించగలేది కాదు. అయినా ఒక్క మాటైనా, లీలని ఆమె అనలేకపోయింది. ఉన్నతులు తప్పుల్ని ఉదాత్తంగా క్షమించగలరు. దానికి నిదర్శనగా నిల్చింది ఆమె గంభీర ప్రదర్శన.

చాలాకాలానికి, యివ్వాళ మళ్ళీ లీల ముఖాన బొట్టు ప్రకాశిస్తోంది. చేతుల్ని రంగురంగుల గాజులు మెరుస్తోన్నాయి. నున్నగా దువ్విన తలలో చామంతియింతులు నవ్వుతున్నాయి. లీల చిన జమీందారిణి - కాదు. చిన జమీందారిణీ సవతి. తోటికోడలు.

ప్రకృతి చిత్రమైన మార్పుల్ని తెస్తుంది, అనుబంధాల్ని కలుపుతుంది. ఈర్ష్యను రేపుతుంది. మహోదాత్తతని సృష్టిస్తుంది - ప్రళయాన్ని ఆహ్వానిస్తుంది - వసంత సుంద

రిని నగ్నంగా నిలబెడ్తుంది — వెన్నెలని మురిపిస్తుంది — చీకటిని కప్పేస్తుంది - ఇది ప్రకృతి ధర్మం.

జమీందారీ, యిళ్ళల్లో మనుష్యులు చావడం పెద్ద కష్టంగాదు. గాలిబుడగల్లాగా తేలిపోతారు. ఇనుప పాదాల క్రింద హాతమై, గుండెల్లో రక్తం - పూలల్లోని మకరందానికి మళ్లే - మంచాలమీద మేను - ఒలికిపోతుంది. ఈ దిక్కులేని కరుణామయ గాధని ఓపికతో వినేతీరికా, వివరించగల అర్హతా ఎవరికీ వుండదు.

ప్రజావిప్లవం అన్న ఒక్క లక్ష్యమూ లేకపోతే, కాంగో ప్రెసిడెంట్ షోంబీకన్నా పీకల్ని తేలిగ్గా, సుతిమెత్తగా తప్పించగలరు. వీళ్ళ జీవితాశయం సుఖాన్ని కౌగలించడం, ఆనందాన్ని వరించడం. అంతకన్నా వీళ్ళకి యింకేమీ అక్కర్లేదు. పుట్టింతర్వాత ఒక్కక్షణం, ఎవరో ఒకరు తప్ప - ప్రజల బాగోగుల్ని కనిపెట్టగలిగిన వాళ్ళు అరుదు - వీళ్ళు నియంతలు - క్రూరులు. కాని వీళ్ళమీద ప్రపంచం ఆధారపడకుండా బ్రతకలేదు - వీళ్ళ కాళ్ళకింద ఒక్కసారన్నా నలక్కుండావుండే మధ్యతరగతి మనిషి వుండడు.

* * *

మనిషిలో అందం వుండటం అదృష్టమే. కానీ, అపాయంకూడాను సుఖశాంతుల్ని సదా భగ్నంచేస్తూ వుంటుం దది. అందుకే, అందంగలవాళ్ళు చరిత్రల్ని - జీవగతుల్ని మార్చుకున్నారు.

రేణుకకి విశ్వంమీద - అమోఘమైన ప్రేమ

వున్నది- దానికిరట్టింపు ద్వేషమున్నది. అయితే విశ్వాన్ని తనవాడుగా వేసుకోవాలన్న ప్రయత్నంలోంచి మదన శాశ్వతంగా విరమించకపోయినా, దానికిందేలెక్క. దాని కొ కారణంవుంది. ఈమధ్యన సుధాకర్ అనే కాలేజీ లెక్చరర్ కీ, మదనకీ కొంచం కొంచం ప్రేమవూట లూరిస్తోంది. ఫలితాన్ని ఒకవైపు నెట్టిచూస్తే......

విశ్వంకోసం రేణుక రావడంలేదు. విశ్వానికి ఎవర్నీ పరామర్శించే తీరికాలేదు; ఒకరిమీద ఆధారపడ దగినంత భయమూ లేదు. తన జీవితాన్ని సుఖప్రాయంగా, కొన్ని సంవత్సరాలవరకూ నెట్టగల ధైర్యం అతనికున్నది.

కానీ, ఆశ త్వరగా చల్లారదు. అదికాలే నిప్పునెగడు. సర్వదా నిప్పుకాల్తూనే వుంటుంది. దాంతోపాటు యింకొందర్ని కలిపి కాలనివ్వందే, అది తృప్తికరంగా నిద్దరోదు – అది దానిలక్ష్యం. గమనం. జీవనం. ఇవ్వాళ వసంతపేర, ఒక వుత్తరం వచ్చింది. దాన్ని రాసింది రేణుక. దాన్లో చాలా భయంకరమైన విషయాలున్నాయ్.

'ప్రియమైన వసంతా !!

ఇంత దీర్ఘమైన ఉత్తరాన్ని వ్రాస్తున్నందుకు మన్నించు – కానీ, వ్రాయడం నా బాధ్యత. నీ ఆశల్ని కూలదోస్తున్నాననుకోకు. జీవితాన్ని నిలబెట్టున్నాను అందుకే యింత సాహసం చేస్తున్నాను వసంతా !!

నీవు విశ్వాన్ని ప్రేమిస్తున్నావు. నాకు తెలుసు. పాలుతాగిన పాములు విషాన్నే కక్కడం మనకితెలుసు. అది వాటి నైజం. విశ్వం యీ కోవలోవాడే. ఇతనికి

అందంవుంది. ప్రజల్ని మోసగించగల చిరునవ్వువుంది. ఇతను అపూర్వమయిన మనిషిలా మనల్ని భ్రమింపజేస్తాడు. కాని యీ మనిషిలో యింకో భయంకరమైన మనిషి వున్నాడు - అతనే ఆడవాళ్ళ జీవితంతోనూ, శీలంతోనూ ఆటాడుకునే విశ్వం. చిరునవ్వుకింద విషపు నిట్టూర్పులు నీకు విన్పించకపోవచ్చు.

విశ్వం అందర్నీ ప్రేమిస్తాడు, లేదా ప్రేమించినట్లు నటిస్తాడు. మొట్టమొదట నిన్ను ప్రేమించాడు విశ్వం. అతని అగాధమైన హృదయకుటీరంలో నీవు చిన్న ప్రమిదని వెలిగించావు. కానీ, దాని కొడి రాలిపోలేదు - చీకట్లని బద్దలుకొట్టి ప్రజ్వలమై ప్రకాశించింది. అతని అదృష్టంగా అతని అందాన్ని తీర్చిదిద్దింది విధాత. నీకు మదన వరసకి అక్క అవుతుందని తెల్సుకున్నాను. నీవు సహృదయత కలదానివి. వాళ్ళిద్దరి చనువునూ నీవు మనోదృక్పథంలో చూడలేకపోయావు. ఇదే అలుసుగా తీసుకుని - విశ్వం హైదరాబాద్‌లో తన వాంఛల్ని మదనతో పూర్తిగా తీర్చుకున్నాడు. అది అలావుంచు :

దాంతర్వాత నీకు నేను పరిచయమయ్యాను. అది విశ్వం ద్వారానే అనుకోండి. ఇలా కొంతకాలం గడిచాక నన్ను ప్రేమించానన్నాడు. 'మనిద్దరం - కళారాధకులుగా జీవితాన్ని వెళ్ళదీద్దాం. మన బ్రతుకుతోటలో ఆనందపు నందనవనాల్ని వెన్నెల ఎరువువేసి పండిద్దాం' అన్నాడు. నేనూ ఆడదాన్నే, యుగయుగాల్నించీ ఆడదాన్ని తియ్యని మాటల్తో మోసగించే, నైజంలో నేనూ చిక్కుపడ్డాను.

ప్రస్తుతం ఇప్పుడు కన్నడసుందరి. మొన్నటివరకూ,

బాల. ఇదీ విశ్వం మద్రాసు చరిత్ర. అతన్ని నీకు దూరం చెయ్యాలనే దురుద్దేశం నాకు ఏ కోశానాలేదు. నీ సోదరి లాంటి హితాహితాభిలాషి — రేణుక.

వసంత హృదయం బద్దలైంది. శరాఘాతం తిన్న లేడి పిల్లవలె, కిందపడి విలవిలా తన్నుకొని ఏడ్చింది. 'భగవాన్! ఎంత చిత్రమైన పరీక్షయిది. విశ్వం యింత దుర్మార్గుడా?- ఇంత నీతిహీనుడా?- తనని వంచించాడు. సుదప కూడా, యిలా చేసిందా?- అందుకే ఒక్క విశ్వాన్నే హైద్రాబాద్ రమ్మని బలవంతపెట్టింది. తను ఒట్టి అమాయకురాలు. నిజమని నమ్మింది. విశ్వం చాలాకాలం తను వెళ్లేవరకూ హైద్రాబాద్ నుంచి రాలేదు. ప్రభూ! ఎంత మాయా వినోదివి నువ్వు?—ఎందుకిలా జీవితంతో చదరంగ మాడు న్నావ్?—

రేణుకని తను అపార్థం చేసుకున్నది. రేణుక చాలా మంచిది తన జీవితాన్ని అగాధంపాలు కాకుండా కొంత నిష్కృతి కలిగే మార్గాన్ని చూపించింది. అవును, రేణుక చాలా ఉత్తమురాలు. రేణుక మనస్సు నిర్మలమైనది- ఇది వసంత భావన తర్వాత: సుందరి. ప్రస్తుతం యీావిడ విశ్వం గారి ప్రియురాలు. అందుకే తనని, విశ్వాన్ని ఎంతో ప్రేమ వున్నట్టు ఆహ్వానించింది. అంతా కపటం. అసలు విశ్వం లోనే-మానసిక బలహీనత వున్నది. ఆడదాన్ని విలాస వస్తువుగా భావించే యితను ఏనాటికైనా అధోగతి పాలవక మానడు.

ఆడవాళ్ళ మనస్సు ఎంత చంచలమైందో, దానికి

ప్రతిబింబంగా వసంత నిలుస్తుంది. మనస్సును విరగదీయడం, మానవ మనస్సులో అంతఃకలహాల్ని రేపడం ఆడదాని ఆంతర్యం. విశ్వంమీద మనస్సులో ద్వేషాగ్ని రగుల్తోంది. తనని నమ్మించాడు. నయవంచన చేశాడు. తనశీలాన్ని, అందాన్ని అతనికి సమర్పించింది. ఇదేనా అతను చేయవలసింది!

తను ఆదరించకపోతే, విశ్వంగతి ఏమైవుండేది! అతనికి ఎక్కడా స్థానం లభించేదికాదు. జీవితాన్ని పూర్తిగా నాశనం చేసుకునేవాడు. ఇంతగా ఆదరించినందుకు, ఘనంగా ప్రేమించినందుకు, యిదేనా యివ్వగలిగిన బహుమానం. తనకి అన్యాయం చెయ్యడమే తన జీవిత లక్ష్యమా?—

రేణుక యింట్లో, ఒక్కర్తే తనగదిలో కూర్చుని ఆలోచిస్తోంది. తన వుత్తరం వసంతలో చాలా మార్పును తేవచ్చు. సగంవరకూ తన ప్రేమ పరాజయాన్ని వసంత అంగీకరించదా? ఇలా పరిపరివిధాల రేణుక ఆలోచన్లు దొర్లిపోతున్నాయి—ఇంతలోకే ఫోన్ వచ్చిందని వాళ్ళ పెద్దన్నయ్య పిలిచి హడావుడిగా ఏదో పనివున్నట్లు వెళ్ళిపోయాడు—

ఫోన్‌లో వసంత మాట్లాడుతోంది వసంత చెప్పసాగింది. అంతావిన్న తర్వాత, రేణుక ముఖం వికసించింది. తాను వేసిన మందు యింత త్వరలో, యింత బాగా పని చేస్తుందనుకోలేదు. విద్వేషాగ్నితో వసంత హృదయాన్ని కాల్చి నుసిచేసిందది. విశ్వాన్ని దూరం చేసుకోడానికైనా ఆమె సిద్ధంగా వుంది. ఆ స్థానాన్ని తానుఆక్రమించుకోవాలి. అందుకే ఆమె హృదయం ఆనందంతో పొంగులెత్తింది.

విశ్వం రాత్రి పదింటికి—కార్లో యింటికొచ్చాడు. ఆ కారులో సుందరి ఒక్కర్తే వుంది. ఆ మొగుడు అన్న పదార్థం ఎక్కడున్నా తప్పుకుని వుండవచ్చు ఇద్దరూ నవ్వుతూ మేడమెట్లు ఎక్కుతున్నారు. సుందరి చాలా అందంగా మాట్లాడగలదు హాస్యరసపూరితమైన సంభాషణలు ప్రయోగించడంలో ఆమె సిద్ధహస్తురాలు. అంతను ముందే అన్న ఏదో ఒక మాటకి—వాళ్ళిద్దరూ నవ్వుకుంటూ వస్తున్నారు.

విశ్వం ఉద్దేశ్యం సుందరిని వసంతకి పరిచయం చేయడం అన్నది సుందరిలాంటి సరదా మనుషులు చాలా తక్కువమంది వుంటారు లోకంలో. వీళ్లు తప్పులు చేయనక్కర్లేదు. వాళ్ళ విశాలమైన మనస్సే వాళ్ళకి శత్రువులాగా నిలబడి, ఎదురుతిరిగి పోట్లాడుతోంది.

ఈ చనువు బహిరంగంగా, ఏ పాపాన్నీ చేయక పోయినా, పెద్ద సంబంధం వున్నట్లు లోకానికి ప్రచారం చేస్తుంది. ఇది చిత్రమైన కాలనైజం. సహృదయతకి, విశాలత్వానికి చాటులేని పచ్చి బోగపు యిరవయ్యో శతాబ్దం—అక్కా అన్నల సోదరత్వానికి తాటాకులుకట్టే దుష్కాలం—ప్రపంచ పరిస్థితే యిలావుంది.

వసంత ఆనందంతో యిద్దర్నీ విష్ చేయలేదు సరిగదా; గౌరవించనన్నా గౌరవించలేదు. సుందరి హృదయం కొంచెం ఫీలయ్యింది. కాని బోలా మనిషి గనుక సర్దుకు పోయింది. చిన్నబోయిన హృదయంతో వెళ్ళబోయేప్పుడు మాత్రం, "విశ్వంగారూ మీరు యీ మేడలో వుండేకన్నా పెద్ద అరణ్యంలో చిన్న గుడిశె వేసుకునుండటం—ఉత్తమం"

అన్నది—విశ్వం కళ్లు కొంచెం చెమర్చాయి. కానీ ఎవరూ చూడకుండా తుడుచుకున్నాడు.

కొన్నిరోజులు పోయాక ఆ యింట్లో స్థానంలేదని తెలుసుకున్నాడు విశ్వం. జానపద చిత్రం పూర్తయినరోజున బొంబాయినుంచి విశ్వానికి ఒక పెద్ద ఫిల్మ్ కంపెనీ నుంచి పిలుపొచ్చింది. విశ్వానికి, అక్కణ్ణించి ఎంత త్వరగా బైట పడితే అంత త్వరగా నిష్కృతి లభించవచ్చు. ఇంకా పది రోజుల్లో—యీ మద్రాస్‌ని వదిలి తాను బొంబాయి పోతున్నాడు. తనకి బొంబాయిలో అత్యుత్తమమైనస్థానం లభించక పోవచ్చు కానీ బ్రతగ్గలిగిన స్థానానికి మాత్రం నోచుకో గలడు. ఈ విషయాన్ని ఎవరికీ తెలియనివ్వ దల్చుకోలేదు. ఈ విషయం ఒక్క సుందరికి తప్ప యింకెవరికీ తెలీదు. అయినా వసంతకి తను బొంబాయి వెళ్తున్నట్టు తెలియనీయ దలుచుకోలేదు.

ఈనాడు విశ్వందగ్గర రెండు లక్షల రూపాయ లున్నాయి. ఈ అదృష్టం తనకి లభ్యమవటాని క్కారణం వసంతే—అయితేనేం, తనకి తెలీని, అనివార్య పరిస్థితులవల్ల వసంత తనని నిరాదరణ చేస్తోంది. ఇంతకన్నా తనని కొరడాతో కొట్టినా తను నవ్వుతూ సహించేవాడు.

మరుసటిరోజు విశ్వం సుమిత్రగారింటికి వెళ్ళాడు. రంజితే యిప్పుడు నడుస్తో—ముద్దుగా మాట్లాడుతోంది. రు కొచ్చింది. కన్నబిడ్డని ఒక్కసారన్నా కళ్ళారా లేని నిర్భాగ్యురాలు లీల. లీలకోసం వెక్కి వెక్కి యంలో ఏడ్చింది—విశ్వం లోపలి విశ్వం.

పాపని ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు. "సుమిత్రత్తా,

3)

నా కెందుకనో భయంగా వుంది. ఇక్కణ్ణించి నేను లేకుండా పోయినా యీ బిడ్డని నీ బిడ్డగా చూసుకోగలవా అత్తా" అన్నాడు. సుమిత్ర దీన్ని హాస్యం అనుకుంది హృదయంలో వున్న చీకటి రాత్రిని సుమిత్ర ఎలా గుర్తుపట్టగలదు?—

  

లీల సౌభాగ్యాన్ని అనుభవించడానికి వీల్లేదు. ఇది విధాత ఏనాడో విధించిన శిక్ష. ఒకరాత్రి లీల చచ్చిపోయింది. దాని క్కారణం ఇందు, అనే సాహసం ఎవరికీ లేదు. ఎంచేతనంటే ఆప్యాయతకింద కాలకూటవిషం వుందని, ద్రాక్షలో కలి సిన విషం, లీల ప్రాణాన్ని తీసేముందు నిరూపించింది.

శని విరగడైనందుకు హాయిగా ఫీలయ్యింది ఇందు. లీల ఎందుకు చచ్చిపోయిందీ ఒక్కదాసీకితప్ప మరెవ్వరికీ తెలీదు. చావబోయేముందు చినరాజావారు దగ్గరేవున్నారు. ఆయన కళ్ళల్లోంచి కారే కన్నీటిని లీల తుడిచింది చావ బోయేముందు చిరునవ్వు నవ్వి, భర్త కన్నీళ్ళు తుడిచి "చచ్చింతర్వాత ఒక్కసారే ఏడుద్దురుగాని - ఇప్పుడు నవ్వండి" అంది. ఆమె ప్రాణ విహంగం రెపరెప కొట్టుకుని ఆగిపోయింది. కానీ ఆముఖంలో చిరునవ్వు అలానేవుంది. తర్వాత, ఒకరాత్రి ఇందునూ, జమీందారీని వదిలి, పిస్తో లుతో కాల్చుకుని చినజమీందారూ, ఆలోకానికే ప్రయా ణంకట్టారు.

లీల చచ్చిపోయినరోజున, ఎలా హృదయాన్ని బ కొట్టుకుని, పెదరాణీ ఏడ్చిందో- ఇవ్వాళా అంతే ఏడి

నల్లపూసలు తెంచుకుని, తెల్లముసుగేసుకు పల్లకీఎక్కి పుట్టింటికి పోతున్నప్పుడుగానీ—ఇందుకు

తప్పిదం తెలిసిరాలేదు. అప్పటికే అంతా చేయిజారి పోయింది. ఆమె కన్నీటిబొట్లు రెండు సుచేలాదేవి పాదాల మీద పడినాయి_ వంగి దణ్ణం పెడ్తోన్నప్పుడు. అందులో "క్షమించు_పాపాత్మురాల్ని"—అనే అర్థంవుంది.

*　　　*　　　*

ఒకరాత్రి విశ్వం వెళ్ళటానికి సిద్ధపడ్తూన్నాడు. తన వుంగరాన్నితీసి, డ్రాయర్ డెస్కులో పెట్టబోతున్నాడు. కాయితాలకింద చూస్తున్నాడు_ఒక తెల్లకాగితంమీద 'వెళ్లి పోతున్నాను' – అని రాద్దామని. అక్కడే తనజీవితాన్ని నాశనంచేసిన రేణుక ఉత్తరంవుంది. దాన్నిచదివి స్తంభించి పోయాడు. వసంత ఈ పదిరోజుల్లోనే చాలా చిక్కిపోయింది. ళ్ళు లోతుకుపోయినయ్యి—విశ్వం కన్నీళ్ళు తుడుస్తు న్నాడు.

మద్రాస్—.

వసంతా!!

ప్రియమైన అని సంబోధించాలనివుంది, కానీ నేను నికి అర్హుణ్ణికాదు. రేణుకరాసిన వుత్తరం చదివాను. కానీ ం నీకు దూరమయ్యాకకానీ నావిలువ నీకు తెలిసిరాదు. ేమతో సుఖాన్ని అనుభవించలేని నీదగ్గర వుండే ాకు లేదు. శెలవు—కానీ, ఒక్కవిషయం—సదా న్ని, సౌభాగ్యాన్ని ఆశిస్తున్నాను. నీ అక్క ని, రేణుకనిగాని, నేనెన్నడూ ప్రేమించలేదు. ంతో నా, నీ జీవితాల్ని శాంతికి దూరంచేశావ్. కుంకుమ, నీ ప్రేమ చిరకాలం మన్నాలనే హృ

భాగ్యుడు విశ్వం—నన్ను మర్చిపో. ఒకనాడు ఎ
వచ్చానో, ఈనాడూ అలాగే పోతున్నాను. కానీ, నాక
శాంతిలేదు. ఆదరంతో ఆహ్వానించావ్, అనాదరంతో
తిరస్కరించావ్—ఇంతకన్నా నాకు యింక విధించగల్గిన
శిక్ష ఏముంది? సెలవు,

—విశ్వం.

విశ్వం, వసంత తలదగ్గర ఉత్తరాన్ని పెట్టి వెనక్కి
తిరిగాడు. వసంత అలానే పాలిపోయినముఖంతో నిద్రిస్తోంది.
ముంగురుల్ని నిమిరి నుదురుమీద ముద్దెట్టుకున్నాడు. అశాంతి
కరమైన దీర్ఘనిశ్వాసం వెలువడింది. ప్రసాదరావుగారి పాదా
లకి దణ్ణంపెట్టాడు. కన్నీళ్ళు యిక ఆగలేదు. గబగబా అడు
గులు వేసుకుంటూ దిగివచ్చాడు, ఇక అంతే—కారు స్టార్ట
య్యింది.

తెల్లవారింది. విశ్వంలేడు—ఉత్తరాన్ని చదివింది
వసంత—విరగదీసుకుని పడిపోయింది. అప్పుడే బెజవాడ
దాటింది గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్!

ఎందుకిలా జరిగింది?—ఈప్రశ్నకు అర్థంలేదు. అనూ
చానంగా యీ కాలవాహిని ప్రవహిస్తోంది, నవ్వుతూ
ఏడుస్తూ, తెల్ళుతూ, త్రుళ్ళుతూ.

'పాపం!! నిర్భాగ్యుడు' అని కన్నీళ్ళు తుడుచు
సుందరి—

చీకటితెరలు అప్పుడే ఆకాశంనుంచి భూమికి
డ్తొన్నాయి

—♦ సమాప్తం ♦—



## మనసు ఫౌండేషన్

### పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106B 172 |
| పుస్తకం పేరు | కాలమానిని |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 185 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hasin |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |